# శ్రీ అరవింద జీవితము

నా ల గ వ కూ ర్పు

౧౯౫౩

ప్ర కా శ కు లు :

శ్రీయుత చతురేదుల వేంకటకృష్ణయ్యగారు.

# శ్రీ అరవింద జీవితము

నాలగవ కూర్పు

౧౯౫౩

ప్రకాశకులు :

శ్రీయుత చతురేదుల వేంకటకృష్ణయ్యాగారు.

# విషయసూచిక





## మొదటి తరంగము ౧-౩౬

## బాల్యము-విద్యాభ్యాసము



## రెండవ తరంగము ౩౭-౮౪

## బరోడావాసము-వివాహము

# విషయసూచిక



## మూడవ తరంగము ౮౫-౧౬౮

## జాతీయోద్యమము

## విషయసూచిక



### నాలగవ తరంగము ౧౬౮-౨౦౨

### రాజకీయముల విడచుట

# విషయసూచిక



## ఐదవ తరంగము ౨౦౩-౨౩౧

## లోకసంగ్రహార్థమై 'ఆర్య' ప్రచురణము



## ఆఱవ తరంగము ౨౩౨-౩౦౨

## విజ్ఞానావరోహణకై చేసిన కృషి

# విషయసూచిక

## విషయసూచిక

## పటముల పట్టిక

# ముఖపత్రము

(శ్రీ అరవిందయోగి జీవిత చరిత్ర)



శ్రీ అరవిందయోగి జీవిత చరిత్రము ఆంధ్ర భాషయందలి మహోత్కృష్ట గ్రంథములలో నొకటి. విషయము లోకోద్ధారకము. సర్వజనులకు ఆదరణీయ మైనది. అరవిందుడు సామాన్యుడు కాడు. అవతార పురుషు డను గణ్యతకు అర్హుడు. గొప్ప విద్యావంతుడు. ఆంగ్లమున కీర్తిని గడించిన కవి. ఆంగ్ల వచన రచన యందు అద్వితీయుడు. వీరి శైలి అమోఘము. వీరిచే ఉపదేశింపబడిన తత్త్వములు వేద తుల్యములు. ఇతడును ఋషియె.

దేశసేవయందు ఒకానొకప్పుడు దీక్షతో నవీన పద్ధతులమెయి కృషిసల్పి, భారతీయుల నవయుగమును స్థాపించిన వారిలో కాలరీత్యా ప్రథముడు. మన నవయుగ బ్రహ్మ.

దేశము లోకములో ఒకభాగము. ప్రపంచము మేలువడిన దేశము మేలిమిజెందును. అట్లగుట ప్రపంచోద్ధరణము, దేశోద్ధరణమునకు సాహాయ్యకారి.

కావుననే ఈ యోగీశ్వరుడు ఆధ్యాత్మికము, అఖిలాండ శాహుళ్యమును అయిన సాధనను కనిపెట్టి లోకమున వ్యాపింపజేయుచున్నాడు.

తెలుగు వారెల్లరు తప్పక పదే పదే చదివి ఆనందమును అభ్యుదయమును చెందుటకు ఉపయుక్తములైన గ్రంథరాజములలో ఈ 'శ్రీఅరవింద జీవితము' ఒకటి. మంచి వచనశైలిన వ్రాయబడియున్నది. అగాధమైన పారమార్థిక జీవితము కాబట్టి, 'సముద్రమువలె గంభీరమైనది' అను ధ్వనిని స్ఫురింపజేయునట్లు ఇందలి ప్రకరణములకు తరంగములను పేరిడి యుండుట ఎంతయు సమంజసము. విషయ వైశుద్ధ్యమునను, రచనా రామణీయకమునను గ్రంథకర్త సిద్ధిని గడించి, ధన్యుడును, మన కృతజ్ఞతకు పాత్రుడును అయి ఉన్నాడు. అతడు నాకు ఎన్నో సంవత్సరములుగా మిత్రుడు. శ్రీ అరవిందయోగి ఎడల తనకు గల పూజ్యభావమును ఈ రీతిని వెల్లడించి లోకోపకారమొనర్చిన నా మిత్రునకు నా ధన్యవాదములు.

"పద్మప్రభాస"
చిత్తూరు
౧౧—౭—౪౫.

ఇట్లు
కట్టమంచి రామలింగారెడ్డి,
ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షుడు.

# మూడవకూర్పు విన్నపము



శ్రీఅరవిందుల పట్లగల శ్రద్ధాభిమానముల వలన ఈ గ్రంథముయొక్క రెండవకూర్పు ప్రతులు సుమారు రెండు సంవత్సరముల క్రిందటనే విక్రయమైపోయినవి. అప్పుడప్పుడే స్థాపితమగుచుండిన శ్రీఅరవిందాశ్రమ ముద్రణాలయమునందే ఈమూడవకూర్పు ముద్రితము కావలయునని మా సంకల్పము. తెలుగు టైపులు ప్రాతవై మొనలు విఱిగిపోయియుండెను. క్రొత్తగా మద్రాసునుండి టైపులను తయారుచేయించి తెప్పించుకొనుటలోను ఇతరములైన ఏర్పాట్లు చేయుటలోను ఎంతోకాలము వేచియుండవలసివచ్చినది. ఎట్లో శ్రీఅరవింద జన్మదినోత్సమునాడే ఈ గ్రంథముద్రణము పూర్తిగావించి, ముఖ్యముగా నేడు శ్రీ అరవిందులొనర్చిన దివ్య సందేశము ననువదించి పొందుపఱచి ఆంధ్రలోకమున కందించ గలిగినందుకు సంతోషించుచున్నాము.

విద్యా ప్రపంచమున సుప్రసిద్ధులును, ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు నగు శ్రీయుత కట్టమంచి

మూడవ కూర్పు విన్నపము

రామలింగారెడ్డి ఎం., ఏ. గారు మాకోరికను మన్నించి, ఎన్నోపనులలో నిమగ్నులై తీరికలేకున్నను, ఈ గ్రంథమునకు పీఠిక వ్రాసి పంపి సాయపడినందుల కెంతయు కృతజ్ఞులమై వందనముల సర్పించుచున్నాము.

ఈ కూర్పునందును గ్రంథకర్తగారు నూత్నవిషయముల నెన్నింటినో చేర్చి సుమా రరువది పుటలను బెంచియున్నారు. పనివారి వేతనములు, ఆర్టుపేపరు, రాపరు, కాగితము వీటి ధర లన్నియు విపరీతముగా పెరిగినవి. రెండవ కూర్పు నాటికి ఫారమునకు అచ్చు చార్జి పది పంద్రెండు రూపాయలై యుండగా నిప్పటి పరిస్థితులలో ఇరువదైదు నుండి ముప్పది ముప్పదైదువఱకు ధరలుపెరిగియున్నవి. ఐదాఱు క్రొత్తపటముల (బ్లాకుల)ను జేర్చితిమి. అందువలన విధిలేక గ్రంథమూల్యము మూడున్నర రూపాయగా నిర్ణయింపవలసి వచ్చినది. ఈ విషయముల గుర్తించగల యాంధ్రలోక మన్యథా తలంచక మునుపటివలె యాదరాభిమానముల జూపునని విశ్వసించుచున్నాము.

శ్రీఅరవిందాశ్రమము,
పుదుచ్చేరి.
౧౫-౮-౪౭.

ఇట్లు
ప్రకాశకులు,
ప. వే. కృష్ణయ్య.

# నాల్గవకూర్పు విజ్ఞాపనము



ఈ గ్రంథముయొక్క నాల్గవకూర్పు ముద్రించి ప్రకటించగలిగినందులకు శ్రీ అరవిందులకును ఆంధ్ర లోకమునకును మా కృతజ్ఞతను వినయపూర్వకముగా చూపెట్టుచున్నాము.

ఈ కూర్పునందు గ్రంథము నామూలాగ్రము శోధించి పరిష్కరింపబడినది. శ్రీ వారి తత్త్వసిద్ధాంతములును సాధనక్రమమును తెలుపు 'ఉపదేశము' లను శీర్షికలో క్రొత్త విషయములను చేర్చి విపులముగ గ్రంథకర్త రచించినారు. ౧౯౫౦-వ సంవత్సరమున తీసిన శ్రీవారి ఫోటోలుకూడ చేర్చబడినవి.

శ్రీ అరవిందాశ్రమము,
పుదుచ్చేరి.
౧-౧-౫3

ఇట్లు
ప్రకాశకులు,
చ॥ వే॥ కృష్ణయ్య.

# శ్రీ అరవింద జీవితము



## మొదటి తరంగము

పరమేశ్వరుని లీలావిలాస మత్యద్భుతము. సృష్టిక్రమవిధాన మిదియని నిర్ణయించగాదు సరిగదా ఊహించుటకేని మానవమాత్రునకు, కేవలము 'బాహ్యభుక్కు' నకు సాధ్యము కాదు. శాస్త్రజ్ఞుల సృష్టి పరిణామ సూత్రముల ననుసరించిచూచినచో మానవజన్మ ముత్తమోత్తమ మనదగును. నరజన్మమందే శ్రీమన్నారాయణవిలాసమహిమ ప్రస్ఫుటమై నరనారాయణత్వ సిద్ధిలభింప నవకాశ మున్నది. భగవానుడు ప్రసాదించిన గవాశ్వములతో తనివి చెందని దేవతలు మానవమూర్తిని ముందు పెట్టినంతనే సంతృప్తులైరను ఐతరేయోపనిషద్వాక్యము సుప్రసిద్ధము.

నారాయణత్వము గర్భితమైయుండియు అవర ప్రకృతియే, అనగా ద్వంద్వములకు త్రిగుణములకు బద్ధమైయున్న పరిణామ దశలో అహంకారమే, ప్రబలముగా నున్నందున మానవునిజీవిత మత్యంత నిగూఢము,

క్లిష్టము, దురవగాహము నగుచున్నది. అతని జీవిత చరిత్రము, కాదు తనలోని యే కోశమేని, భాగమేని, సమగ్రముగ నాతనికే తెలియదు. ఇట్లు స్వీయచరిత్రములే యసంపూర్ణములుగా నున్నపుడు, ఇతరుల జీవిత చరిత్రము వ్రాయగడంగుట పరిహాసాస్పదమే. అందునను అంతర్ముఖులైనయోగీంద్రుల, అవతారమూర్తుల, పురుషోత్తముల పవిత్రచరిత్రమును ఉల్లేఖింపబూనుట నిజముగా సాహసము.

శ్రీఅరవిందుల జీవితచరిత్ర మందఱకు దెలియునట్లు ఉపరితలమున గాక కేవల మంతఃస్థితమై యున్నది. అందువలన వారి చరిత్రమును సమగ్రముగా వారు తప్ప మఱొక రెవరును రచింపజాల రనుట అతిశయోక్తి కాజాలదు. ఈ యాథార్థ్యము నెఱింగియు వారిపట్లగల భక్తి విశ్వాసముల నండగా జేసికొని, ఆంధ్రలోకమున కూడిగముగా. శ్రీఅరవిందుల జీవిత విశేషములను సాధ్యమైనంతవఱకు వారి వాక్యముల ననుసరించియే సూక్ష్మముగా వెల్లడింప బ్రయత్నించుచున్నాము.

## జన్మస్థానము

స్థలమాహాత్మ్యము లాయాస్థలములం దుద్భవించిన మహాపురుషుల నాశ్రయించి యుండుటయు నెందఱో

మహానుభావుల యౌన్నత్యము వారు జన్మించిన స్థల విశేషములబట్టి యుండుటయు గాననగును. శ్రీఅరవిందుల విషయమున నీరెండును అన్యోన్యాశ్రయములుగా విరాజిల్లుచున్నట్లు తోచుచున్నది. వేదఋషుల సామగాన మాధురీవాసనల తనివితీర గ్రోలి శోభాప్రదమై దోషరహితమై పూజనీయయగు గంగామతల్లిచే పునీతమైనది వంగదేశము. అందుననే గంగాస్రవంతివలె ఏకధారగా వంగమాత గర్భమునుండి పరమహంసలు, యోగులు, తపోధనులు, భక్తాగ్రేసరులు, సాధుపుంగవులు, కవిశ్రేష్ఠులు, శాస్త్రజ్ఞులు, పండితులు, మేధావులు, దేశోద్ధారకులు, త్యాగులు, శ్రీమంతులు నుద్భవించుచున్నారు. రామప్రసాద్, గౌరాంగ, శ్రీరామకృష్ణ, రామమోహన్, వివేకానంద, బంకించంద్ర, దేవేంద్రనాథ్ ఠాకూర్, కేశవచంద్ర, మధుసూధన్, రాజనారాయణ, శిశిర్ కుమార, బందోపాధ్యాయ, సురేంద్రనాథ, చిత్తరంజన్ మున్నగు పుత్రరత్నముల గాంచి వంగమాత ధన్యమైనది. ఇదంతయు మాంధాత కాలపు విస్మృతచరిత్రగా గాక ప్రత్యక్షముగా నీనాడును సుప్రసిద్ధ విజ్ఞానశాస్త్ర విశారదులను, చరిత్ర పరిశోధకులను, పత్రికాసంపాదకులను, కవిచక్రవర్తులను, వక్తలను,

ప్రతిభాశాలులను, స్వార్థరహితులను, పరోపకారపారీణులను, మాతకై 'ప్రాణంబుల్ పువ్వులట్లు చల్లు' వీరులను, త్యాగులను, వేయేల సర్వతోముఖముగ నేవిషయమందేని మేల్బంతిగానున్న పుత్త్రుల నెందఱనేని సగర్వముగా వంగదేశము పేర్కొనగలదు. ఇట్లనాదిగా పవిత్రసంతానభాగ్యమును గాంచి అసమానయోగ్యతా విశేషములనందిన వంగదేశమందు శ్రీఅరవిందు లుద్భవించుట సముచితమనియే తలంపనగును. మఱియు బరమేశ్వరుడు గుడ్డివానిచేతి ఱాయిగాగాక యేదో సంకల్పముతోడనే దేశకాలపాత్రముల బరిశీలించియే మహాపురుషుల జన్మక్షేత్రముల నిర్ణయించు చుండునని యూహింపదగియున్నది.

## వంశవిశేషములు

వృక్షములందును జంతువులందును వలె వంశప్రభావము మానవులం దంత బలీయముగా నున్నట్లు గనపడదు. కేవల మనాగరిక జాతులందు కంటె బుద్ధికృషిగల నాగరిక వంశములందు వంశసంప్రదాయము మఱింత దుర్బలమై విభిన్నమై తోచుచున్నది. అయినను శ్రీఅరవింద వంశ మత్యంతసుప్రసిద్ధమై ప్రాచ్యపాశ్చాత్య

సభ్యతా సమ్మేళనమందు కొంత సంబంధముగలదై వంగ దేశవికాసమునకు యథాశక్తి తోడ్పడి పేరువ్రాసిన దే.

పందొమ్మిదవశతాబ్ద ప్రారంభకాలమున భారత దేశము, ముఖ్యముగా వంగదేశము, ప్రాచీప్రతీచుల వికారమునకుమాత్రము లోనై విచిత్ర సంయోగ సంఘట్టనల కాలవాలమైనది. ఒకవంక వేదకాలపు ఆధ్యాత్మిక వికాస మంతరించి,తొల్లింటి ధర్మశాస్త్రముల సమన్వయింపగల సర్వాంకషమైన దేవభాషాజ్ఞానము గాని స్వతంత్రాలోచనాపటిమగాని అనుష్ఠానమహిమ గాని లేక సనాతనధర్మసూత్రములకే భిన్నముగాగల మూఢాచారములు, అర్థశూన్యములైన ఆడంబరపు తంత్రకలాపములు, శాహ్యాట్టహాసములు నివియే మత సారమని నిరంకుశులుగా నధికారము చెలాయించు గురువులు, మతోద్ధారకులును, మఱొకవంక పాశ్చాత్య నాగరకతయన్న సభ్యతయన్న జోహారు లొసంగి వెనుక ముందు లారయక, వేషభాషలందేమి అనుదినాచారము లందేమి ఆమూలాగ్రముగ తెల్లజాతి ననుకరించుటయే గౌరవభాజనమని విశ్వసించి, మన మత భాషా వేష సంప్రదాయములందు నిరసనమే గాక విరోధభావము గలిగి, ప్రచ్ఛన్నక్రైస్తవు లనదగు నవనాగరకులును దేశ

మును చీకాకుపఱచినకాల మది. ఈ కాలప్రవాహము నకు అహుతులయినయే మధుసూధన్, కాళీమోహన్, బందోపాధ్యాయ, కాళీచరణబెనర్జీ మున్నగు ప్రతిభా శాలులు స్వమతమును త్యజించి క్రైస్తవమతమును స్వీకరించిరి.

నాటి వంగదేశమున మూర్తీభవించి యుండిన పాశ్చాత్యసభ్యతావ్యామోహమునకు దాసులైనవారును, తన్నివారణార్థమై ఆర్యావర్తపు జాతీయజీవనమును సభ్యతను భావములను బునరుద్ధరించ దీక్షవహించిన వారును శ్రీఅరవిందుల వంశమునగలరు. ఆధునిక వంగదేశ నిర్మాతలలో నొక్కరుగా బూజనీయులైన శ్రీ రాజనారాయణబోసు శ్రీఅరవిందుల మాతామహులు. వీరు వంగ, సంస్కృత, పారశీక, ఆంగ్లేయాది భాష లందు నాడు మేటిపండితులు. తన పదునెనిమిదేండ్ల పిన్న వయస్సునందే బ్రహ్మసమాజపక్షమున నుపనిషత్తులను వంగాంగ్లభాషలందు పరివర్తనమొనర్చుటకు నియోగింపబడిన మేధావి. నాటి కాలప్రవాహమున మొదట బ్రహ్మమతావలంబియై కొంతకాలము బ్రహ్మసమాజమున కధ్యక్షతకూడ వహించియుండినను బ్రహ్మసమాజ సభ్యుల పాశ్చాత్యానుకరణములకు కేశవచంద్రుని విపరీత

వర్తనమునకురోసి తత్సమాజసంబంధమును ద్యజించి 'హిందూమతాధిక్య' మను కరపత్రమును సప్రమాణముగ శాస్త్రీయముగ రచించి వంగీయుల మేల్కొల్పి మతభ్రష్టులు గాకుండ నండగా నిలిచిన మతోద్ధారకుడు. ఈతని పాండిత్యమును బుద్ధికుశలతను యోగ్యతను గాంచి, వశీకృతుడై మిత్రుడై మిక్కిలి గౌరవించుచున్న తాధికారమందుండిన సర్ హెన్రీ కాటన్ ఎన్ని పర్యాయములో డిప్యూటి కలెక్టరు ఉద్యోగమును స్వీకరించవలసిన దని సర్వవిధముల ప్రోత్సహించి బ్రతిమాలినను ప్రభుత్వోద్యోగము నంగీకరింపని స్వతంత్రమూర్తి, స్వార్థత్యాగి. దేశీయమహాసభా నిర్ణయమున కిరువదియైదు సంవత్సరములకు పూర్వమే విదేశవస్తుప్రవాహము నరికట్టుటకు జాతీయ వస్తుప్రదర్శనములను, దుర్బలులగు దేశీయులను వీర్యవంతులుగా నొనర్చుటకు వ్యాయామ ప్రదర్శనములను నెలకొల్పిన జాతీయాభిమాని. ఈయన ప్రత్యక్షముగా రాజకీయరంగమున నంతగా బనిచేయకున్నను మతసాంఘిక విద్యాదివిషయములందు కృషిచేసి తత్సంబంధముగా నెన్నియో గ్రంథముల రచియించి జీవచ్ఛవమైయుండిన జాతిలో ప్రాణముపోసి యుత్తేజమును బుట్టించిన దేశోద్ధారకుడు.

'జాతీయ గౌరవ సంపాదినీ సభ' అను పేర నొక సంస్థ ను స్థాపించి, సజాతీయ సంప్రదాయముల బోషించి, మాతృభాషలోనే సంభాషణముల నుపన్యాసముల నొనర్పవలయుననియు ఆంగ్లేయ పదము నుపయోగించు నపుడెల్ల నొక్కొక్క పదమునకు కాలణా వంతున నపరాధము చెల్లించ వలయుననియు నియమ మేర్పఱచి తదనుసార ముగా ననుష్ఠింపజేసిన కార్యశూరుడు. ఈ మహా మహుని ప్రథమ పుత్రికారత్నమగు స్వర్ణలతాదేవియే శ్రీఅరవిందుని గాంచిన పుణ్యవతి.

శ్రీఅరవిందుల పితామహుల చరిత్ర మంతగా దెలియదు. వీరు కలకత్తాకు పదునొకండుమైళ్ళదూర మున, హుగ్లీమండలమున, హుగ్లీ లేక భాగీరథీ నదీతీర ముననున్న 'కొన్నగర్' గ్రామవాసులు. ఈ హుగ్లీ మండలమే, పందొమ్మిదవ శతాబ్దమున సంస్కృత-పార శీక-వంగాంగ్లేయాది భాషాకోవిదులు,'సహగమన'మను పేర బయల్వెడలియుండిన ఘోర దురాచారము ను రాక్షసకృత్యమును రూపుమాప నిశ్చయించి వ్యయ ప్రయాసలకోర్చి బ్రిటీషు పార్లమెంటునందు వాదించి విజయుడై చిరస్మరణీయుడైన శ్రీరాజారామమోహన్ రాయలకు,నానామతముల మార్గముల మూలసత్యమును

స్వానుభవమునకు దెచ్చుకొని మహైక్యమును జాటిన ఆధ్యాత్మిక గురువును 'భగవానుని నిన్నుచూచునట్లే నేను దర్శించితిని. నీకును చూపించెదను' అని స్పష్టముగా శ్రీవివేకానందులకు నచ్చజెప్పి వారిని శిష్యునిగా వశ పరచుకొని వారిమూలమున పాశ్చాత్యఖండములకు, ముఖ్యముగా అమెరికా ఖండమునకు ఆర్యావర్తపు ఆధ్యాత్మిక సందేశామృతమును చవి జూపించిన శ్రీ రామకృష్ణపరమహంసకును జన్మస్థానము. 'కొన్నగర్' గ్రామముగూడ చరిత్రప్రాశస్త్యమునుబొందినదే. పురాతన వంగవాఙ్మయమున ఈ గ్రామము పేర్కొనబడి యున్నది. బ్రహ్మసమాజోద్యమ నాయకుడును నిజ దాతయు నగు శివచంద్రదేవు, రాజకీయ సాంఘిక విద్యాదివిషయములందు నాడు పేరెన్నికగన్న డాక్టరు త్రైలోక్యనాథమిత్ర, రాజా రాజేంద్రలాల్ మిత్ర, సంస్కృత భాషయందపార పాండిత్యము గడించిన మహోపాధ్యాయ దీన బంధు న్యాయరత్న మున్నగు వారు జన్మించినది గూడ నీగ్రామమందే. (సుప్రసిద్ధమైన ఘోషు కుటుంబమున, ప్రాయశః ౧౮౪౦-వ సంవత్సర మందు కైలాసవాసినీ దేవీ కాళీప్రసాద దంపతులకు జన్మించిన కృష్ణధనుడే శ్రీ అరవిందుల తండ్రిగారు.

అప్పుడప్పుడే నెలకొల్పబడుచుండిన బ్రహ్మసమాజమునకు బద్ధ విరోధులైన పూర్వాచార పరాయణుల కుటుంబమునకు చెందినవారు. కాని కృష్ణధనునకా వాసన సోకినదిగాదు. విద్యాభ్యాసకాలము నుండియే అనగా బాల్యమునుండియే బ్రహ్మసమాజ వాతావరణమున బెరిగి పాశ్చాత్య భాషాసభ్యతల పై మెఱుంగులకు లోనైన వారనియే చెప్పవలయును. బ్రహ్మమతమును స్వీకరించిన అనుష్ఠాన సభ్యులలో ముఖ్యుడై తన్మతాభివృద్ధికై ఎంతో యుత్సాహముతో పనిచేయుచుండిన యువకుడు. అందువలననే ఆయన తన కుటుంబములోని వారి నందఱను ధిక్కరించి బ్రహ్మసమాజమునకు సంబంధించిన కన్యనే వరించి వివాహమాడెను. వారి వయస్సపుడు పదునెనిమిదేండ్లు. కలకత్తా వైద్యకళాశాలలో నాల్గవ సంవత్సరపు విద్యార్థిగా నుండిరి. ఇప్పటివలె వివాహ పద్ధతిలేని కాలమది. బ్రహ్మసమాజ ధర్మముల ననుసరించి జరిగిన ప్రథమవివాహ మిదియేయని చెప్పవచ్చును. ఈ వివాహమునకు ప్రపంచ ఖ్యాతిగడించిన కేశవచంద్రసేన్, రవీంద్రకవివర్యుని తండ్రిగారగు మహర్షి దేవేంద్రనాథ ఠాకూర్ ప్రధానాచార్యులై పౌరోహిత్యము వహించిరి. శ్రీ రాజనారాయణబోసపుడు మేదినీ

పురమున నుపాధ్యాయులుగా నుండిరి. అచ్చటనే స్వర్ణలతా కృష్ణధనుల వివాహ మతివైభవముతో జరిగినది. ఈ వివాహము వలననే కృష్ణధనుడు తన కుటుంబమునకు, సమీప బంధువర్గమునకు వెలిగావలసివచ్చినది. తుదకీ బహిష్కార ఫలితముగా తన భాగమునకు వచ్చిన గృహాది స్థిరాస్తులను బంధువర్గమువారి కెవరికిని గాక, మఱెవరికో ముందు మాటయిచ్చితి నను కారణమున, మిక్కిలి తక్కువ మొత్తమునకు విక్రయించి ఆ గ్రామ సంబంధమునే విసర్జించినట్లు తెలియుచున్నది.

కృష్ణధను డత్యంత మేధావి. ప్రారంభమున వైద్యవిద్య నభ్యసించి సబ్ అసిస్టెంటు సర్జనుగా చిన్న యుద్యోగముననే జీవితమును బ్రారంభించినను తన శక్తి సామర్థ్యములవలన ఇంగ్లాండునకు వెళ్ళి యున్నత విద్యాభ్యాస మొనర్చుటకు వలయు ధన మంతయు స్వయముగా నార్జించి, ౧౮౬౯-లో విదేశమున కేగి ఎం. డి. పరీక్షయందు త్తీర్ణుడైన ప్రతిభాశాలి. ఆకాలములో విదేశ ప్రయాణముగాని ఎం. డి. పరీక్షయందు త్తీర్ణు లగుటగాని భారతీయులలో మిక్కిలి యపురూపము. బాల్యములోనే యలవడిన పాశ్చాత్య సభ్యతానుకరణము విదేశవాసమువలనను వైద్యవృత్తిమూలమునను

మఱింత ప్రబలి వేషభాషలందు భావములందు నిత్యజీవిత మందు మూర్తీభవించినది. కృష్ణధనుడు తన అర్ధాంగి యగు స్వర్ణలతాదేవియు తనవలెనో తన్నుమించియో నవనాగరికానుకర్తగా తద్రూపుదాల్చి ప్రవర్తించ వలయు నని ఎంతో ప్రయత్నించి ఆమెను దిద్ది తీర్చుచుండెడివా డట. అట్లు దిద్దితీర్చిన విలాసములలో, తనతో ఆమెను గూడ, గుఱ్ఱపుస్వారిలో కృతార్థురాలినిగా జేసి బహిరంగ ముగా షికారులకు తీసికొని పోవుట యొకటి. స్వర్ణలతా దేవి అతిసౌందర్యవతి, లావణ్యవతి. ఆమె రూపలావణ్య ములకు క్రొంగ్రొత్త వేషధారణమునకు రంగపూరు వాసులు ముగ్ధులై 'గులాబి', 'రంగపూరు రోజా' యని ముద్దు పేరిడి మెచ్చుకొనుచుండెడి వారట. కాని బాహ్య రూపమెంత విజాతీయముగ గాన్పించినను హృదయము మాత్రము భారతీయమే యని బీదల కొనరించిన వారి నిరుపమానసేవ, కార్యనిర్వహణాసామర్థ్యము, దోమల మయమై చలిజ్వర భూతమున కధిష్ఠానపీఠమై సర్వవిధ ముల ననారోగ్యముతో తాండవమాడుచుండిన నాటి ఖుల్నాపట్టణము నత్యంతయారోగ్యప్రదేశముగ పరివర్తన మందించి తత్స్థలమునబడసిన చిరకీర్తియు వేనోళ్ల జాటుచున్నవి. వీ రట త్రవ్వించిన కాలువ వీరిపేరుతో

నేటికిని స్మరణీయ మగుచున్నది. మరియు వీరికి వంగ వాఙ్మయమన్న ప్రేమాభిమానములు తీవ్రముగానుండెను. సంభాషణలలో పలుమారు బంకిం చంద్రుని రచనల నుండి వాక్యముల నుద్ఘాటించుచుండిరి. ఒకవిధముగా విదేశీయులకు ముఖ్యముగా నాంగ్లేయులకు భారతీయులకు నన్యోన్య సంబంధ బాంధవ్యముల సమకూర్చుచు సమ్మేళనోప కరణముగా సంధానకర్తగా వీరుండిరని చెప్ప నొప్పును.

స్వర్ణలతా దేవి కృష్ణధనఘోషు దంపతులకు నలుగురు పుత్రరత్నములు, నొక పుత్రికామణియు జన్మించిరి. కృష్ణధనుడు తన మేధా సంపత్తునకు నున్నత భావములకు నూతన ప్రవృత్తులకు దగినట్లే తన సంతానమునకు నామకరణ మొనర్చెను. ప్రథమపుత్రుడు వినయభూషణుడు, ద్వితీయుడు మనోమోహనుడు, ౧౮౭౨-వ సంవత్సరమున ఆగష్టు నెల ౧౫-వ తేది సుముహూర్తమున నీలోకమున కవతరించిన మన శ్రీ అరవిందులవారి తృతీయపుత్రరత్నము. జన్మించినది కలకత్తాయందు, థియేటరు రోడ్డులో తన తండ్రియొక్కయు తన తల్లితండ్రి యొక్కయు మిత్రులు, నాటి దేశనాయకులలో సుప్రసిద్ధులు నగు ఆనందమోహన్ ఘోషుగారి గృహమున.

గలవనుట మొదటిది. అప్పు డట్టి జబ్బులేమియు నాకు లేకుండెను. కాని ఎంతో కాలమున కావల నకస్మాత్తుగా నట్టిజబ్బులు కనబడి బహుకాలము నిడువకుండెను. రెండవది, నా భావికార్య కలాపములలో నొకనూతనాధ్యాత్మిక తత్త్వమును తత్సాధనను చేయ నెలకొల్పుగునని. అప్పటి కాలములో తత్త్వవిషయమునుగాని యోగ విషమునుగాని నాకేమియు దెలియకుండెను. మఱియు నీజ్యోస్య మే మాత్రము సంభవనీయమని యూహించగల మనఃప్రవృత్తిగాని అపేక్షగాని నాకుండెడిదిగాదు.

మఱియు జ్యోతిశ్శాస్త్రము భావి ఫలమును సూచించునేగాని స్పష్టముగా నిర్ణయించజాలదనియు మానవ ప్రజ్ఞ నతిక్రమించి దైవప్రజ్ఞను గాంక్షించు యోగసాధకునిపట్ల జ్యోతిశ్శాస్త్రముగాని మఱే యే భౌతికశాస్త్రముగాని కార్యకారులు కావనియు శ్రీ అరవిందు లొకచో వెల్లడించియున్నారు.

ఈ యరవిందనామ మంతవఱ కెవరును ధరించియుండని వినియెఱుంగని కృష్ణధనుని నూతనసృష్టియే. వీరు తన పుత్రు డపూర్వ మానవమూర్తియై వేదఋషులును బ్రయత్నించి యెఱుంగని పరమవిజ్ఞానమును—సూపర్ మైండు—ఆర్జించి తద్దివ్యశక్తిని తనలో నధిరోహింపజేసికొనుటయేగాక భూతలమున బ్రతిష్ఠించి అజ్ఞానము, బాధాయుతము, దుఃఖభాజనము నగు భూలోక

గలవనుట మొదటిది. అప్పు డట్టి జబ్బులేమియు నాకు లేకుండెను. కాని ఎంతో కాలమున కావల నకస్మాత్తుగా నట్టిజబ్బులు కనబడి బహుకాలము విడువకుండెను. రెండవది, నా భావికార్యకలాపములలో నొకనూతనాధ్యాత్మిక తత్త్వమును తత్సాధనను చేయ నెలకొల్పుదునని. అప్పటికాలములో తత్త్వవిషయమునుగాని యోగవిషయమునుగాని నాకేమియు దెలియకుండెను. మఱియు నీ జ్యోస్య మేమాత్రము సంభవనీయమని యూహించగల మనఃప్రవృత్తిగాని అపేక్షగాని నాకుండెడిదిగాదు.

మఱియు జ్యోతిశ్శాస్త్రము భావి ఫలమును సూచించునేగాని స్పష్టముగా నిర్ణయించజాలదనియు మానవ ప్రజ్ఞ నతిక్రమించి దైవప్రజ్ఞను గాంక్షించు యోగసాధకునిపట్ల జ్యోతిశ్శాస్త్రముగాని మఱే భౌతికశాస్త్రముగాని కార్యకారులు కావనియు శ్రీఅరవిందు లొకచో వెల్లడించియున్నారు.

ఈ యరవిందనామ మంతవఱ కెవరును ధరించి యుండని విని యెఱుంగని కృష్ణధనుని నూతనసృష్టియే. వీరు తన పుత్రు డపూర్వ మానవమూర్తియై వేదఋషులును బ్రయత్నించి యెఱుంగని పరమవిజ్ఞానమును—సూపర్ మైండు—ఆర్జించి తద్దివ్యశక్తిని తనలో నధిరోహింపజేసికొనుటయేగాక భూతలమున బ్రతిష్ఠించి అజ్ఞానము, బాధాయుతము, దుఃఖభాజనము నగు భూలోక

మును స్వర్గలోకముగను, దివ్యలోకముగను, మానవు
లను దేవతలనుగను, సర్వము సచ్చిదానందమయము
గను బరివర్తనమొనరించి సత్యయుగమును బునరుద్ధ
రించునని యెఱుంగకున్నను ఈ క్రొంగ్రొత్త నామముతో
తనపుత్త్రు నలంకరించిరి. నాల్గవసంతానమే పుత్త్రికామణి
యగు సరోజినీదేవి. విప్లవ బ్రహ్మయని బిరుదము
గాంచిన వారీంద్రుడు వారి కనిష్ఠపుత్త్రుడు. కృష్ణధనుడు
కాంక్షించి నట్లాయన సంతాన మేదోయొకవిధముగ
నాయనకుమించిన కీర్తిప్రతిష్ఠల జూరగొనినవారే కాని
తల్లికడుపుచేటుగ నుదయించిన వా రొక్కరును లేరు.
వీ రొకరికి వ్రాసిన ఉత్తరమునుబట్టిచూడగా తన రెం
డవ కుమారుడు మనోమోహన్ ఘోషు ఆంగ్లమున
మహా కవిగాను, శ్రీఅరవిందు లుత్తమోత్తమ పరి
పాలనాదక్షులుగాను కీర్తిగాంతురని విశ్వసించినట్లు
తెలియుచున్నది. వినయభూషణుడు కుచ్ బిహారు రాజ్య
మున రాజకుమారుల కాచార్యులుగాను సంస్థాన వ్యవ
స్థాపకులుగాను చిరకాల మున్నతపదవియందుండి కీర్తి
ప్రతిష్ఠల నార్జించియున్నవారు. మనోమోహన్ కలకత్తా
రాజధానీ కళాశాలలో నాంగ్లపండితులుగ నుండి యాంగ్ల
మున రసభరితములైన పద్యముల రచియించి పాశ్చాత్య



2

దేశమునందును కవిగ ప్రసిద్ధిగాంచి, ఇరువది సంవత్సరముల క్రిందటనే కీర్తిశేషులైరి. వారీంద్రుని త్యాగము సాహసకృత్యములు లోక మెఱింగినవే. ఏకైక పుత్రిక యగు సరోజినీదేవియు విద్యావతియై తత్త్వజ్ఞానాభిలాషియై ఆజన్మ బ్రహ్మచారిణియై తనకు నచ్చిన ఆధ్యాత్మిక జీవనమున గాలము గడుపుచు కులభూషణమై పుణ్యక్షేత్రమగు కాశీపట్టణమున నివసించుచున్నది. శ్రీఅరవిందులే యొక సందర్భమున 'నావిషయ మటుండనిచ్చినను తక్కిన సంతానముగూడ తండ్రి మనోభీష్టానుగుణముగ సుప్రసిద్ధమైనవారే' అని సెలవిచ్చియుండిరి. ఇక శ్రీఅరవిందునిగుఱించి పేర్కొనవలయునా? మాతామహుల విశాలదృష్టి, అద్భుతమేధాసంపత్తి, విచక్షణత, సత్యాన్వేషణ దీక్ష, తండ్రిగారి స్వార్థత్యాగము, పరోపకార పరాయణత్వము, కార్యనిర్వహణ సామర్థ్యము, స్థిరసంకల్పము మున్నగు గుణము లుగ్గుపాలతో నలవడి నేటి శ్రీఅరవిందుని యనంతగుణరాజములకు దోహదములైనవి.

## విద్యాభ్యాసము - విదేశవాసము

లోగడ సూచించినట్లు కేవలము పాశ్చాత్యానుకరణమునకు లోనై పాశ్చాత్యసభ్యత్వలబ్ధియే యాదర్శ

ముగా నిడుకొనిన డాక్టరు కృష్ణధనుడు తన బిడ్డలకు తోడిహిందువులవలె సామాన్య పాఠశాలలందు చదువు చెప్పించుట కిష్టపడలే దనిన వింత గాదు. కాన వీరు వ్యయప్రయాసలకు లక్ష్యపెట్టక, చిన్నబిడ్డయగు అరవిందుని దూరముగా డార్జిలింగున కంపి, 'లారెట్టో కాన్వెంటు స్కూల్'లను అచ్చటి మిషనరీల పాఠశాలలో ఏ,బి,సీ, లతో నక్షరాభ్యాసము గావించిరి. అచ్చట ఈచిన్నబిడ్డ తోడివా రందఱును ఇంగ్లీషు పిల్లలు. ఆంగ్లముననే విద్య నేర్పుట. అంతియగాదు, తోడిపిల్లలతో మాటాడుటగూడ ఆంగ్లమునందే. అంతయు నాంగ్ల వాతావరణమే. అదియు తృప్తికరముగాక డాక్టరుగారరవిందుని కేడేండ్లు వచ్చియు రాకమునుపే తన ముగ్గురు పుత్రులను, కుమార్తెను, ధర్మపత్నిని వెంట నిడుకొని బిడ్డల విద్యాభ్యాసమునకై ఇంగ్లాండునకు సకుటుంబముగా కాపుర మెత్తివెళ్లెను. అపుడు స్వర్ణలతాదేవి నవమాసముల నిండు చూలాలు. పాశ్చాత్య వ్యామోహమునకు దాసుడై కృష్ణధనుడు తన ఈ సంతానమేని ఇంగ్లాండులో జన్మించి తత్ పౌరత్వసత్త్వమును బడయవలయునని కాబోలు ఆ సమయముననే విదేశయాత్రకు ముహూర్తము నిశ్చయించెనని కొంద

లూహించవచ్చును. కాని అపు డామెనుగూడ గొనిపో వుటకు ముఖ్యకారణము ఆమెకుగల ఉన్మాదవ్యాధికి నిపుణులచే చికిత్స చేయింపనెంచుటయే యని తలంచుట సముచితము. స్వర్ణలతాదేవికి ప్రథమసంతానము కలిగి నప్పటినుండియు కొంచె మున్మాదవ్యాధి ప్రారంభమాయె ను. ఎన్ని చికిత్సలు చేయించినను గుణమిచ్చినదికాదు. పైపెచ్చు సంతానాభివృద్ధియగు కొలదియు ఈ పాడు వ్యాధియు తీవ్రరూపముదాల్చి వేపించినది. తుదకీ వ్యాధితోనే ఎన్నోసంవత్సరముల కావల నా సాధ్వీల లామ మరణించినది. ఇంగ్లాండులోనే కడగొట్టుకొమా రుడు వారీంద్రుడు జన్మించెను. ఇతడు జన్మించిన తరువాత కృష్ణధనుడు వినయభూషణ్, మనోమోహన్, అరవిందు లను మాంచెస్టరు పట్టణమునందు తన మిత్రుడగు 'డ్రూయట్సు' అను ఇంగ్లీషు కుటుంబమున దిగవిడిచి సరోజినీ వారీంద్రులను ధర్మపత్నిని తనతో తీసికొని వంగ దేశమునకు మరలివచ్చెను. ముందు కృష్ణధను డొక్కడే దేశమునకు తిరిగివచ్చెననియు నావల కొన్నిమాసములకు తనమిత్రుల సాయమున తన అర్ధాంగిని బిడ్డల నిద్దఱను దేశమునకు రప్పించుకొనెననియు మఱియొకరు వ్రాసి యున్నారు.

రంగపూరులో నున్నతోద్యోగులుగా నుండిన (Ackroyd) అక్రాయిడ్ దొరగారు కృష్ణధనునికి ప్రాణ మిత్రము. ఈదొరకును 'డ్రూయట్' కుటుంబమునకును మైత్రిరూపమున నేమి బంధుత్వరూపమున నేమి సన్నిహిత సంబంధము గలదు. అక్రాయిడ్ దొర మూలముననే డ్రూయట్ కుటుంబమువారు కృష్ణధనునకు పరిచితులైరి. 'అక్రాయిడ్' దొర మిత్రులుగావచ్చిన వా రగుటవలన గాబోలు డ్రూయట్ కుటుంబమువారును తదితరులును శ్రీఅరవిందుని 'అక్రాయిడ్ అరవింద ఘోషు' అనియే పిలుచుచుండిరి. ఇండియాకు వచ్చిన తరువాతగూడ చాలకాలమువఱకు ఎ. ఎ. ఘోషు (A. A Ghosh) అను పేరుతోనే వీరియొద్దనుండి యుత్తరములు శ్రీఅరవిందు లకు వచ్చుచుండెనట. ఆ మాంచెస్టరు పట్టణమందలి యాంగ్లేయ కుటుంబముననే అరవిందు లించుమించు ఐదు సంవత్సరములు (౧౮౭౯-౧౮౮౪) విద్యాభ్యాస మొనర్చిరి. ఆకాలముననే ఫ్రెంచిభాష నభ్యసించి మెప్పు గాంచిరి. డ్రూయట్ దొర లాటిన్ పండితుడు. వారే లాటిన్ భాషయందు శ్రీఅరవిందుని ప్రవీణునిగా నొన ర్చిరి. డ్రూయట్ దంపతులు మాంచెస్టరు పట్టణమును వదలి ఆస్ట్రేలియాకు వెళ్ళవలసి యుండినందున శ్రీఅర

విందులును ౧౮౮౪-వ సంవత్సరమున లండన్ పట్టణము లోని 'సెంట్ పాల్' వాఙ్మయ పాఠశాలయందు బ్రవేశించి తమ బుద్ధిచాతుర్యమువలన నుపాధ్యాయ వర్గము నుండి మన్ననల జూరగొనిరి.

ఐదుసంవత్సరము లచ్చట విద్య నభ్యసించి శ్రీ అరవిందులు ౧౮౯౦-వ సంవత్సరమునందు ఐ.సి.యస్. పరీక్షకు నిలిచి గ్రీక్, లాటిన్ భాషలలో నదివఱ కెవరును గడించని అత్యధిక ప్రవీణత సంపాదించి యుత్తమ తరగతిలో నుత్తములుగా నుత్తీర్ణులైరి. ఐ.సి.ఎస్. పరీక్షయైనతరువాత శిక్షణాభ్యాస (ప్రొబేషనరీ) కాలమగు రెండేండ్లలో శ్రీ అరవిందు లెనుబదిపౌండ్ల విద్యార్థి వేతనము గడించి కేంబ్రిడ్జియందలి 'కింగ్సు' కళాశాలలో రెండేండ్లు విద్య నభ్యసించి పాశ్చాత్య భాషలయందుత్తములుగా నుత్తీర్ణులయి 'ట్రైపాస్' పట్టభద్రమును బొందిరి. ఈ విద్యార్థివేతనమును గడించుటకై శ్రీ అరవిందులు పోటీపరీక్షకొక వ్యాసమురచించి పంపియుండిరి. విషయము మహాకవులగు షేక్సిపియర్-మిల్టనుల తారతమ్యమును గుఱించి. ౧౮౯౦-లో డాక్టరు కృష్ణధనుడు తమ బావమఱదియగు జోగీంద్రనాథునకు అనగా రాజనారాయణబోసుగారి కుమారునకు, వ్రాసిన లేఖ

నుండి కొన్నివిషయములు తెలియుచున్నవి. ఆ యుత్తరములో శ్రీఅరవిందులు తండ్రిగారికి వ్రాసిన వాక్యములుదాహరింపబడినవి. ఆ భాగమునుమాత్ర మిందుదాహరించు చున్నాము.

నిన్నటిరాత్రి కాలేజీ అధ్యాపకు లాకరు నన్ను కాఫీకి ఆహ్వానించియుండిరి. వారి గృహమున సుప్రసిద్ధులగు ఒస్కారు బ్రౌనింగు కవివర్యుని దర్శించితిని. వీరే చక్రవర్తిగారి కిక నాస్థాన కవులుగా వరింపబడువారు. స్పృత్యవిషయమునుండి పాండిత్య విషయమునకు దిగి సంభాషించుచు నన్నెక్కువగా వారు ప్రశంసించిరి. నాతో నిట్లనిరి. 'అసామాన్యమైన ఈ గొప్పపరీక్షలో నీవు విజయమందిన విషయము నీకు తెలియుననియే తలంచెదను. పదుమూడు పరీక్షలలో నెన్నో పత్రములను నేను పరీక్షించియున్నాను. ఇంత ప్రశస్తముగా నీవు రచించినట్టి పత్రముల వంటివి నే నింతకాలముగా నెన్నడును జూచియుండలేదు. నీ వ్యాస మత్యద్భుతము.'

మాటల సందర్భమున బ్రౌనింగుదొర నీ వెచ్చట నివసించు చుంటివని నన్ను ప్రశ్నించిరి. నే నా నివేశస్థానమును జెప్పగా 'ఆ దిక్కుమాలిన గొందిలోనా' యని యాశ్చర్యమంది అధ్యాపకులగు మహాఫీలెగారి వంకదిరిగి యిట్లనిరి 'మన పండితులపట్ల మన మెంత మోటుగా నమర్యాదగా ప్రవర్తించుచున్నాము! మహా మేధాసంపన్నులను మన మిచ్చటికి రప్పింతుము. ఆవల నాక్షుద్రస్థాన మను పెట్టెలో వారిని మనము బంధింతుము.'

ఈ వాక్యములవలన శ్రీఅరవిందు లాంగ్లసాహిత్యమున నెంత పాండిత్యము నార్జించినది, ఆంగ్ల కవుల పండితవర్యుల పోకడ్తల నెట్లు చూరగొనినది తెలియుచున్నది. బ్రౌనింగు వంటి కవిపండితుల సహృదయముతోపాటు శ్రీఅరవిందు లనుభవించిన దారిద్ర్యము గూడ నందు సూచితము. కేంబ్రిడ్జిలోనున్న ఈ కాలము శ్రీఅరవిందుల జీవితమును నూతన ఘట్టమునకు దారితీసినదని చెప్పనగును. అప్పటికే పంద్రెండేడ్లపాటు స్వాతంత్ర్యవాయువుల కొల్లగా బీల్చి స్వేచ్ఛ ననుభవించు వాతావరణముగల ఇంగ్లాండులో శ్రీఅరవిందు లుండుటవలన స్వాతంత్ర్యబీజము వారి హృదయమందు గట్టిగా నాటుకొని మొలకెత్తనారంభించినది. ఇండియన్లు ముఖ్యముగా విద్యాభ్యాసమునకై వచ్చిచేరిన యువకబృంద మచ్చట కేంబ్రిడ్జి మెజిలెస్ (Cambridge Mejlis) అను నొక సంస్థ నపుడపుడే స్థాపించియుండిరి. ప్రారంభమున నెట్లున్నను రాను రాను భారతదేశ స్వాతంత్ర్య సంపాదనార్థమే పనిచేయు తీవ్రరాజకీయ సంస్థగా నది పరిణమించినది. శ్రీఅరవిందు లాసంస్థలో సభ్యులై ప్రధానపాత్రను వహించెను. కార్యదర్శిగాగూడ కొంత కాల ముండెను. నానావిధోపన్యాసములను, ముఖ్యముగా

భారతదేశమునుగురించి, పలుమారు రోసంగుచుండిరి. భరతఖండమును పరాధీనతనుండి తప్పించి స్వతంత్రదేశముగా నొనర్చవలయునను తీవ్రసంకల్ప మీ కాలముననే ఉడుకురక్తము మెఱుఁగుచుండిన శ్రీ అరవింద యువకుని కుదయించినదనుట నిస్సంశయము. కీర్తిశేషులగు దేశబంధు చిత్తరంజన్ దాసును విద్యాభ్యాసమున కప్పుడచ్చటికి వచ్చుటయు ఈ 'మెజిలెస్'లో సభ్యుడై శ్రీ అరవిందుని పరిచయమును సంపాదించుటయు సంభవించినది.

౧౮౯౦-౧౮౯౧-వ సంవత్సరములలో భరతఖండపు పితామహు డని మన్ననల నందిన దాదాభాయి నౌరోజీ బ్రిటీషు పార్లమెంటునందు సభ్యత్వమును సంపాదింప బ్రయత్నించెను. ఈ ప్రయత్నమున భారతీయ యువకులు, ముఖ్యముగా శ్రీఅరవిందులు చిత్తరంజన్ దాసు, నౌరోజీపక్షము వహించి యెన్నో సభలలో నాంగ్లేయులను ముగ్ధులగున ట్లుపన్యసించి తీవ్రప్రచార మొనర్చి సాయపడిరి. కాని వర్ణవిద్వేష కారణముననే కాబోలు దాదాభాయికి జయము చేకూరినదికాదు. ఈ ఎన్నిక ప్రచారసందర్భమున నె లార్డు సాలిస్‌బరీ 'ఇండియా దేశపు ఆ నల్లని మనిషి' (that black man of India)

అని దాదాభాయిని నిందించి బ్రిటీషుజాతికిగల వర్ణ ద్వేషమును వెల్లడించెను.

మఱియు నాకాలమున ఐరిష్ దేశీయులు తమ స్వాతంత్ర్యసంపాదనమునకై గావించిన మహాత్యాగము, అనుభవించిన ఘోరకష్టములు, అర్పించిన ఆత్మబలి, ఐరిష్ హోమ్ రూల్‌బిల్లు (Irish Home Rule Bill) సందర్భమున వెల్లివిరిసిన నిర్బంధవిధానములు, మహా సంకులములు శ్రీఅరవిందుని మఱింత ఆకర్షించినట్లున్నది. అప్పటి ఐరిష్ దేశనాయకుడు చార్లెస్ స్టూవర్టు పార్నల్ (Charless Stewart Parnell) మృత్యువు వాతబడినపుడు శ్రీఅరవిందులు తన హృదయపరితాపమును ఆంగ్లపద్య రూపమున వెల్లడించియుండిరి. పార్నల్ పట్ల వీరికుండిన అసమాన గౌరవాదరముల నాపద్యమే చాటుచున్నది. ఈఐరిష్‌పద్ధతులనే దేశ కాల భేదములకు తగిన మార్పులతో ఇండియాస్వాతంత్ర్య సంపాదనమున కవలంబింప నుద్దేశించినట్లు ౧౯౦౬-౧౯౦౯-సంవత్సరములలో వీ రొనర్చిన రాజకీయోద్యమమున సూచితమైయున్నది.

ఇట్లు తీవ్ర రాజకీయభావములుగల శ్రీఅరవిందుని ఇండియాఆఫీసువారు కనిపెట్టియుండుట వింతగాదు. ఈ సందర్భమున నచ్చటి యున్నతోద్యోగు లొనరించిన

విపరీతచర్యలకు గూఢచారుల పీడనకు రోసి కాబోలు, ఐ. సి. ఎస్. తర్ఫీతు-ప్రొబేషనరీ-కాలాంతమున, బ్రిటీషు ప్రభుత్వమునం దుద్యోగము చేయరాదను నిశ్చయమున నేమి అంతర్వాణిప్రేరణమున నేమి, విధాయకమైన గుఱ్ఱపుస్వారి పరీక్షకు హాజరు గాక ఐ.సి.ఎస్.ను త్రోసి పుచ్చిరి. యథార్థ మిట్లుండ శ్రీఅరవిందులు గుఱ్ఱపుస్వారి పరీక్షలో నోడిపోయెననియు, నందువలన ఐ.సి. ఎస్. పదవి లభించలేదనియు నొక్క యొకవదంతి వ్యాపించినది. ఈ వదంతి నాధారము చేసికొనియే కాబోలు కొందఱు తమ వ్రాతలయం దీ యసత్యమును జొప్పించి యున్నారు. ఏ విషయమున నేని శ్రీఅరవిందులు నిజముగా సంకల్పించినయెడల కృతార్థుడు గాగలడనుట కొక నిదర్శనము నిట నుల్లేఖింప నగును. శ్రీచారుచంద్రదత్తుగా రనువారు శ్రీఅరవిందుల ప్రాణమిత్రులు, ఐ.సి. ఎస్. ఉద్యోగి. బొంబాయి రాష్ట్రమున పెక్కేండ్లు జిల్లా కలెక్టరుగా, న్యాయాధిపతిగా నుండిరి. ఒకనాడు శ్రీఅరవిందులు శ్రీదత్తుగారింటికి వెళ్ళుటయు, నపుడు తీవ్రముగా వర్షించుటయు, మాటల సందర్భములో రైఫిలుతో గురిపెట్టి కాల్చువిషయము ప్రస్తావనకు వచ్చుటయు నేర్పడినది. శ్రీదత్తుగారు రైఫిలును చేతి

కిచ్చి గురిపెట్టి కాల్చవలసినదిగా శ్రీ అరవిందులను గోరిరి. శ్రీఅరవిందులు తాను నెన్నడు రైఫిలు నుపయోగించలేదని చేతగాదని ఎంత చెప్పినను శ్రీ దత్తుగారు వదలిపెట్టక దూరముగా నొక అగ్గిపుల్లను(Match Stick) బెట్టి చివరనుండు నల్లనిభాగమును గురిపెట్టి కొట్టవలసినదిగా బలవంత మొనర్చిరి. అంత శ్రీఅరవిందులు గురిపెట్టి ప్రథమ పర్యాయమే సరిగా ఆ నల్లని భాగమునే కాల్చిరి. ఇట్లే పెక్కుమార్లు తప్పిపోకుండ రైఫిలును ప్రేల్చి తమ యసమాన నైపుణ్యమును బ్రదర్శించిరి. బాల్యమునుండియు దేశారాధనము ఈశ్వర సేవయు వీర యాదర్శములని వీరు తమ ధర్మపత్నికి ౧౯౦౫ లో వ్రాసిన లేఖయందలి '.........చతుర్దశ వర్షముల ప్రాయమునుండి బీజ మంకురింపదొడంగె. అష్టాదశవర్షముల ప్రాయమున నా ప్రతిష్ఠ దృఢమై స్థిరత్వము గాంచెను.' అను వాక్యములవలనను, ౧౯౦౭-లో కలకత్తా జాతీయకళాశాలను వదలి వచ్చుసందర్భమున, వీడ్కోలు సభయందు విద్యార్థుల కుపదేశించిన వాక్యముల వలనను స్పష్టము గాగలదు. ఈశ్వరేచ్ఛ బలీయము గదా!

విద్యార్థిగా శ్రీఅరవిందులు ప్రకటించిన నిరుపమాన మేధావిశేష మింతింతనరాదు. ఇంచుమించు

పాశ్చాత్యభాష లన్నింటియందు నపార పాండిత్యమును గడించిరు. దాంతె, (Dante) గేథే (Goethe) మున్నగు సుప్రసిద్ధ గ్రంథకర్తల భావవిశేషములను తత్త్వరీతులను ఆయాభాషలలోని మూలగ్రంథముల పఠించి క్షుణ్ణముగా గ్రహించగలిగినంత పాండిత్యమును ఇటాలియన్ జర్మనీ భాషలయందు సంపాదించిరి. తండ్రిగారియాజ్ఞయనియో యభిలాషయనియో వారికి సంపూర్ణసంతృప్తి కలుగునట్లు పూర్వ, మధ్య, ఆధునిక కాల ఐరోపియన్ సభ్యతను చరిత్రవిజ్ఞాన సాంఘికాది సంప్రదాయములను వీరు సాకల్యముగా బరిశీలించి గ్రహించిరి. ప్రత్యక్షముగా జూచి సారాసారముల దేల్చుకొనిన బ్రిటీషు పార్లమెంటరీ విధానము, తత్పరిపాలనా పద్ధతులనేగాక ఫ్రాంసు, రోమ్, అమెరికా మున్నగు దేశముల రాజ్యాంగ నిర్మాణ సూత్రములను, విధానములను, ఆదేశములలో గలిగిన రాజకీయ పరిణామములను, పరివర్తనములను గూడ క్షుణ్ణముగా బరిశీలించి యవగాహన మొనర్చుకొనిరి. వేయేల, పాశ్చాత్యవాఙ్మయమున వారు పరిశీలించని సాహిత్యముగాని, శాస్త్రముగాని, తత్త్వముగాని లేదు. కాని యొక చిత్రము గానవచ్చుచున్నది. ఫ్రెంచిరాజ్యమునకు ప్రధానపట్టణమగు 'పారిస్సు' ను,

ఇన్నేం డ్లింగ్లాండులో అంత సమీపముగా నున్న
ఎన్నడును వెళ్ళిచూచి యుండలేదు. అట్లయ్యు
ఇంగ్లండు కంటె పారిస్ పట్టణమే యెన్నో విధము
ఫ్రెంచివారి సాహిత్యము, లలితకళలు, స్థానిక పరిపాలన
విధానము సంస్కృతి సభ్యతలు మున్నగువానితో శ్రీ
అరవిందుని మఱింత యాకర్షించెననుట నిశ్చయము
జన్మించిన వంగదేశమునగాని మఱి యేదేశమునగా
గడపనంతటి సుదీర్ఘ కాలమును—సుమారు నలువ
వత్సరములుగా — ఫ్రెంచి రాజ్యమునకు సంబంధించి
'పుదుచ్చేరీ' పట్టణముననే గడపుటలో నే యంతరా
మిమిడియున్నదో తెలియదు. ఇంతకు స్వపర భే
మెఱుగని సర్వభూత హితులు రతులు నగు వారి
అన్ని దేశములును స్వదేశములే గదా! ఈ కాలము
నింగ్లాండునందుండగనే ఆంగ్లమున రసోత్తర పద్యము
రచించి కవిగా పేరెన్నికగన నారంభించిరి. ఆంగ్లకవిత
కన్య శ్రీఅరవిందుని పదునాలుగేండ్ల పసితనమున
వరించిన ట్లున్నది. ఆవయస్సులో ప్రకృతిసౌందర్యమున
గుఱించి రచించినపద్యములు కొన్ని గలవు. పదునెనివి
దవ సంవత్సరమున 'పార్నెల్' వీరునిపై రచించి
పద్యము సుప్రసిద్ధము. అరవిందునివలె నన్యభాషలలో

నింతటి ప్రావీణ్యముజూపిన విద్యార్థిలేడని ప్రసిద్ధిగలదు. నాటికి సరిగా పదునాలుసంవత్సరములకావల ౧౯౦౮-వ సంవత్సరమున, ఆలిపూరు బాంబుకేసునందు ఘోర దోషములక్రింద శ్రీఅరవిందులు బంధీకృతులై విచారణ జరుగుచుండగా వీరి విషయము లండన్ పత్రికలలో బ్రకటితమైనపుడు, వృద్ధులైయుండిన 'సెంట్‌పాల్' పాఠ శాలాధ్యక్షు డిట్లు వెల్లడించి యుండెనట: 'నాయొద్ద నిరువదైదు ముప్పది సంవత్సరములుగా విద్యాభ్యాస మొనర్చిన వేనవేలు విద్యార్థులలో అరవిందు లంతటి ప్రతిభాశాలిని, మేధా సంపన్నుని, సుగుణభూషణుని గాంచియుండలేదు.' జ్ఞానార్జనమే దీక్షగా గైకొని యన్య భాషలయం దనర్గళ పాండిత్యమును గడంచి యున్నను తండ్రిగారి పెంపకపు మాహాత్మ్యమున గాబోలు మాతృభాషయగు వంగభాషను మాత్రము మాటాడుట యరవిందులకు తెలియకుండెను! ఐ.సి.ఎస్. పరీక్షకాంగ్లేయు లెట్లు సంస్కృతమునో హిందూస్థానినో బలవంతముగా రెండుముక్కలు నేర్చి పరీక్షా సమయమున నప్పగించివేయుదురో యట్లు బెంగాలీ యక్షరములను శ్రీఅరవిందులు తన పదునెనిమిదవ సంవత్సరమున నభ్యసించవలసిన అవసరమేర్పడినది. మాతృ

భాషాభిమానముగల వీరు ఆ యవకాశమును జారవిడ
వక వంగభాషా పాండిత్యము చక్కగాగలదని పేర
మోసిన ఒకదొరవద్ద నాభాషను జదువుకొనెను
మాటాడుట సరిగా దెలియకున్నను, సంభాషించుట
కవకాశమే లేని విదేశములో నున్నను, అద్భుతమైన
మేధాసంపత్తిగల శ్రీ అరవిందులు బంకించంద్రుని
గ్రంథముల సొంతముగా పఠించి వంగవాఙ్మయమందలి
సారస్యమును గ్రహించగల సామర్థ్యమును గడించిరి.

డాక్టరు కృష్ణధను డమృతహస్తుడై వేలకొలది ధన
మార్జించుచున్నను ఆరువేల మైళ్ళదూరమున ధనమే
సర్వస్వముగా నెన్నబడు లండన్ పట్టణమున నున్న తన
ముగ్వురు పుత్రులకు వలయు ధన మంపజాలక, వారిని
దారిద్ర్యము ననుభవింప జేసిరనిన విచిత్రముగా దోపక
మానదు. స్వార్థమెఱుంగని కృష్ణధనుడు, దయాస్వరూ
పి, అమాయకు డగు కృష్ణధనుడు తన కన్నుల యెదుట
కట్టబట్ట తిన తిండిలేక యల్లాడుచున్న దరిద్రనారాయణు
లకు, 'దేహి' యని చేయిజాచిన యాచకులకు, తన
యాదాయమును వ్యయపఱచుచుండెను. నిత్యజీవనమం
దు నాహార వేషాదులందు శ్వేతజాతి ననుకరించువాడై
యుదారుడై నందున నాయనకు సొంతఖర్చులు కుటుంబపు

ఖర్చులు హెచ్చుగా నుండెను. దీనికితోడు పరులకష్ట
ముల గన్నులారజూచి సహింపజాలని ధర్మమూర్తి,
పరోపకారమం దానంద మనుభవించు పుణ్యపురుషుడు.
అందుననే తన కుమారులకు క్రమముగా కావలసిన ధన
మును బంపుటకు సాధ్యము గాక పోయినది. ఇందుల
కాతనిని, తనకుమాలిన ధర్మమొనర్చువాడని పోదు
పెఱుంగని పిచ్చివాడని దూబరియని యనేక విధముల
బరిహసించి నిందించిన బంధువులు మిత్రులును గలరు.
కాని నిరుపేదలు, దిక్కులేని యనాథులు, ఎందఱో
తమ్ము గాపాడిన ధర్మాత్ముడని చేయెత్తి నమస్కరించుచు
జోహారు లొనర్చుచుండిరి. ఎట్లయిననేమి ధనాభావము
వలన విదేశములో కొమారు లత్యంతకష్టముల ననుభ
వించినది మాత్రము వాస్తవము. శ్రీ అరవిందులు
అవసరమైన ఉడుపులు లేనికారణమున నెచ్చటికిని
వెళ్ళజాలక తన గదిలోనే కాలము గడపవలసివచ్చిన
దినములు గలవు. కడుపునిండ భుజించుటకును సాధ్యము
గాక యే యొకటి రెండు రొట్టెముక్కలతోనో, పాలు
చక్కెరలు లేని తేనీటితోనో ఆకలిబాధ నుపశమింప
జేసికొనిన సమయములు గూడ నుండెను. ఇందులకు
తోడు అప్పులవారి పీడనకు గురియై ఆ మనోవేదనగూడ

ననుభవించిన సందర్భములు లేకపోలేదు. మనో మోహక విద్యాభ్యాసమునకు కొంత అంతరాయమును గలిగినది.

పాపము! డాక్టరు కృష్ణధనునికి రాను రాను సంసార సౌఖ్యము సన్నగిలజొచ్చెను. ఉన్మాదవ్యాధికి గుఱియైన భార్యవిషయమే ఆయనకు మఱింత వ్యసన కారణమైనది. భర్తముఖము గనపడినంతనే ఆమెపిచ్చి చేష్టలు విషమించుచుండెను. కుదకు తానొకచోట ఆమె మఱొకచోట వేఱుగా నుండవలసిన స్థితి యేర్పడినది. ఇందుకు దోడు శ్రీఅరవిందులు ఐ. సి. ఎస్. డిగ్రీని కాలదన్నె ననువార్త కృష్ణధనుని మఱింత చీకాకుపఱచినది. ఈ యాఘాతముల నెదుర్కొనజాలక దుఃఖోపశమనమునకై త్రాగుడు నభ్యసించి ఆ వ్యసనమునకును బాలుగావలసివచ్చినది. ఈస్థితిలో శ్రీఅరవిందులు మాతృదేశమునకు రాదలంచి ఒకానొక స్టీమరులో ప్రయాణమై వచ్చుచున్నానని తండ్రిగారికి తెలిపియుండిరి. తన పుత్రుని గొనివచ్చు ఆ స్టీమరు ఎప్పుడు బొంబాయి చేరునది తెలిసికొనగోరి స్టీమర్ల ఏజంటు లగు (Grindlay & Co,.) గ్రిండ్లే కంపెనీ వారికి కృష్ణధనుడు టెలిగ్రాము నిచ్చెను. అందు కా కంపెనీవారు ఆస్టీమరు

దారిలో లిస్బన్ కావల సముద్రమున మునిగిపోయినదని టెలిగ్రాముద్వారా జవాబొసంగిరి. సరిగా ఆ టెలిగ్రాము వచ్చినపుడు కృష్ణధనుడు గుఱ్ఱపుబండి నెక్కనుండెనట. తన కుమారుడున్న స్టీమరు మునిగిపోయిన దను పిడుగు వంటివార్త వినినంతనే పుత్రశోకమున మనస్సు వ్యాకులత నొంది బండినెక్కుటలో తొట్రువడి యాయన క్రింద పడిపోయెను. ఆదుఃఖముతోనే ఆదెబ్బతోనే రెండు మూడు దినములలో ౧౮౯3-వ సంవత్సరారంభమున శ్రీ అరవిందులు దేశమునకు వచ్చుట కొకటి రెండు నెలలకు ముందే, యాయన మరణించిరి. తన పుత్రరత్నము లసాధారణ ప్రజ్ఞావంతులని వారి భవిష్యత్తు మహత్తరమని వారి నిమిత్తమై తా నొనర్చిన మహాత్యాగము వ్యర్థముగాలేదని యెంతో యుప్పొంగి పోవుచుండిన డాక్టరు కృష్ణధనుడు తన కొమారుల, ముఖ్యముగా, శ్రీఅరవిందుల భవిష్యత్ జీవనమును కన్నులారజూచు భాగ్యము నోచుకొనలేదు. ఇంతకు శ్రీఅరవిందులు తుదిక్షణమున ప్రయాణము మానుకొని నందున ఆస్టీమరులో ప్రయాణమే చేయలేదు. అంతకు ముందు వినయభూషణు డెట్లో స్వదేశముచేరి కుచ్ బీహారునం దుద్యోగము సంపాదించుకొని యెచ్చటనో

పెద్ద మొత్తమును ఋణముగా గైకొని తమ్ములకు బంపినట్లును ఆ ధనముతో నింగ్లాండునందలి ఋణముల దీర్చి మనోమోహనుడు విద్యాభ్యాసము పూర్తిగావించి ఇండియాకు మరలివచ్చినట్లును తెలియుచున్నది.

మఱియొక విషయము: శ్రీఅరవిందులు వారి సోదరులు కలసి విప్లవసంఘమును నెలకొల్పి యుండిరి. అనగా ఇంగ్లండులోని చివరి దినములలో వీరొక రహస్య సభను, లండనులోని హైందవులతోటి, 'కమలము-ఖడ్గము'అను పేరుతో నెలకొల్పియుండిరని తెలియుచున్నది.



# శ్రీ అరవింద జీవితము



## రెండవ తరంగము

## ఉద్యోగము - బరోడావాసము

శ్రీఅరవిందులు ఐ.సి.ఎస్.ను కాలదన్ని విదేశములో ధనాభావముచేత కష్టముల పాలగుచున్న కాలమున, ప్రాయశః ౧౮౯౨-వ సంవత్సరాంతమున బరోడామహారాజు ఇంగ్లాండునకు వెళ్ళుటయు నచ్చట భారతీయ విద్యార్థులలో ప్రతిభాశాలి యని పేరు మ్రోయుచున్న శ్రీఅరవిందుల గుణగణముల గ్రహించి యభిమానించుటయు సంప్రాప్తమైనది. ఈ సంస్థానాధీశ్వరునితో ఇరువదియొక్క సంవత్సరముల చిఱుప్రాయముననే విదేశములో శ్రీఅరవిందునికి పరిచయము గలుగుట నిజముగా నీశ్వరనిర్దేశమే! ఇట్లు పరిచయమొనర్చి తోడ్పడినవారు సర్ జేమ్సు కాటన్ దొరగారు. వీరు భారతీయుల ఆదరాభిమానములకు పాత్రులై 'కాంగ్రెస్సు' మహాసభ కధ్యక్షులు గూడనైన సర్

హెర్బర్టు కార్టర్‌గారి సోదరులు. బరోడా మహారాజు నొద్ద నుద్యోగము సంపాదించుకొని పదునాల్గు సంవత్సరములు విదేశవాసము చేసినతరువాత ౧౮౯౩-వ సంవత్సరమున ప్రాయశః ఫిబ్రవరి, మార్చి నెలల మధ్య కాలములో మహారాజుగారితోగూడ శ్రీఅరవిందులు భరతఖండమునకు తిరిగివచ్చి బరోడాయందు జేరిరి.

ప్రథమమున మహారాజున కాంతరంగిక కార్యదర్శిగా గొంతకాలమును, రివిన్యూశాఖయందు మఱి కొంతకాలమును, ఆవల విద్యాశాఖయందు కళాశాలలో నధ్యాపకులుగాను, తుదకు కళాశాలోపాధ్యక్షులుగాను శ్రీఅరవిందు లుద్యోగ మొనర్చిరి. కాశ్మీరయాత్ర చేసినపుడు బరోడా మహారాజుగారు తమ యాంతరంగిక కార్యదర్శిగా శ్రీఅరవిందుల నెన్నుకొని వెంటతీసికొని వెళ్ళియుండిరి. శ్రీఅరవిందులు 'నైనితాలు'లో గూడ మహారాజుతో కొంతకాల ముండిరి. ఒక పర్యాయము చరిత్ర ప్రసిద్ధిగాంచిన 'బాపట్' తగాదా సందర్భమున న్యాయవాదుల అభిప్రాయముల సేకరించి వ్యవహరించు నిమిత్తమై ప్రత్యేకముగా శ్రీ అరవిందులను ఉదక మండలమునకు మహారాజావారు పంపియుండిరి. అపుడే మద్రాసురాష్ట్రమున ప్రప్రథమమున శ్రీఅరవిందులు

కాలు మోపుట. ఇట్లుద్యోగిగా బరోడాలో నున్న కాల మున—౧౮౯౩ మొదలు౧౯౦౬-వరకు పదుమూడు సంవత్సరములు—భారతవర్షపు విజ్ఞానమహాత్మ్యముగాని ఆధ్యాత్మికోన్నతస్థితిగాని శాస్త్ర సంప్రదాయములుగాని ఏమాత్రము తెలియని లోపమును శ్రీ అరవిందులు పూరించుకొనిరి. సంస్కృతభాషయందుగల వాఙ్మయ మును మూలమునుండియే చదివి సమగ్రముగ నర్థ మెఱింగి వ్యాఖ్యానము చేయగల గట్టిపాండిత్యమును దేవభాషయందు గడించిరి. గుజరాతీ, మరాటీ, హిందీ మొదలగు దేశభాషలందును గొంత పరిచయమును సంపాదించిరి. శ్రుతి స్మృతి పురాణేతిహాసాది గ్రంథముల బఠించి భారతవిజ్ఞానము నా మూలాగ్రముగ గ్రహించిరి. వారి జ్ఞానపిపాస కంతము లేదు. ఆర్యావర్తపు సత్య స్వరూప మిదిగదా యని శ్రీ అరవిందులు తమ హృత్పీఠమున జిత్రించుకొనినది యీ కాలముననే.

ఇట్లార్యావర్తపు విజ్ఞాన సభ్యతా సంప్రదాయ ముల సాకల్యముగా జాటు ప్రాచీన భారతీయ వాఙ్మయా మృతమును గ్రోలుచుండినను, శ్రీ అరవిందులు అనుదినము నూతన సిద్ధాంతములను, విజ్ఞాన పరిశోధనలను, తత్త్వవిశేష ములను, శాస్త్రీయచర్చలను వెల్లడించు విదేశవాఙ్మయ

పరిశీలనమునకు విశ్రాంతి నొసంగలేదు. బొంబాయి పట్టణమందలి సుప్రసిద్ధ విదేశ గ్రంథవిక్రయ సంస్థాధికారులతో-అందఱవలె ఆయాగ్రంథముల నేరి యెప్పటి కప్పుడు తెప్పించుకొనక-విదేశములలో సుప్రసిద్ధులగు గ్రంథకర్తలు రచించు గ్రంథముల నన్నిటి నెప్పటి కప్పుడు తెప్పించి తనకు పంపవలసినదిగా నేర్పాటొకే పర్యాయము చేసికొనినట్లును, అందువలన వారు ముందుగా తెలుప నవసరము లేకయే అనుదినము నూతన గ్రంథముల బంపుచు మాసమున కొకసారి లెక్కల నంపి పెద్ద మొత్తముల వసూలు చేసికొని చుండినట్లును దెలియుచున్నది. శ్రీఅరవిందుని సంపాద్య మెక్కువగా గ్రంథముల గొనుటకే వినియోగ మగు చుండెడిదట.

శ్రీఅరవిందులు వస్తుతః కవి, రాజకీయవేత్త. ఇవి వారి స్వభావజన్య విశేషము లన్నను యథార్థము నకు భంగము గలుగదు. విదేశములో విద్యార్థిగా నుండినపుడే, లేబ్రాయముననే, రాజకీయపరిజ్ఞాన ప్రవే శానుభవములు వారికలవడె నను విషయము పూర్వరంగ మున గొంత సూచితము. ఆ రాజకీయాభినివేశమే, ఉద్యోగనిర్వహణమున బహు గ్రంథపఠనమున తీరిక

లేకుండినను, మాతృదేశముయొక్క రాజకీయపరిస్థితులను సంస్థలను దేశనాయకులను స్వదేశమునకు వచ్చిన రెండు మాసములలోనే చక్కగా నవగాహన మొనర్చుకొనుటకు బ్రేరేపించినది. భరతఖండపు పరాధీనతను నాయకుల భావదాస్యమును గమనించి తన్నివారణార్థమై దేశీయమహాసభను దిద్ది తీర్చవలయు నను ప్రయత్నమే తన మిత్రులు దేశపాండ్యగారు నిర్వహించుచుండిన "హిందూప్రకాశ" అను బొంబాయి వారపత్రికలో ప్రకటితమైన తొమ్మిది వ్యాసముల రూపమున వెలసినది. మొదటి వ్యాసము ౧౮౯౩ ఆగష్టు ౭-వ తేదిని, కట్టకడపటి వ్యాసము ౧౮౯౪ మార్చి ౬-వ తేదిని బ్రకటింపబడెను. 'ప్రాతదీపములకు క్రొత్తదీపములు' అను శీర్షిక క్రింద ఈ వ్యాసములు 'జీరో' అను సంతకముతో వెలువడినవి. ఈ వ్యాసముల సంగ్రహసారము నిట పొందుపఱచుచున్నాము.

'గుడ్డివాడు గుడ్డివానికి త్రోవజూపిన నుభయులును గోతిలో పడరా ?' అను గాలిషయర్ మహాశయుని సుభాషితము మన దేశీయ మహాసభకు(కాంగ్రెస్సుకు)చక్కగా నన్వయించును. కాంగ్రెస్సును నేను విమర్శించుట పలువురకు కంటకముగా నుండును. ఇది స్థాపితమై తొమ్మిదేండ్లైని నిండలేదనియు దేశీయుల నైక్యభావమును నెలకొల్పి ఎన్నో అద్భుతములైన ఘనకార్యము

లను ఒనరించినదనియు, ఒకవేళ లోపములున్నను - ఎందులో లోపములు లేవు? - విరోధులు విదేశీయులు మఱింత హేళన జేయుట కనువుగా, వానిని బహిరంగముగా చాటి విమర్శించుట దేశాభిమానము గలవారు చేయరాని చెడ్డకార్యమనియు నన్ను నిందించువారు పలువురు బయలుదేరుదురని నాకు దెలియును. కాని ఒకరిద్దఱేని దీర్ఘముగా నాలోచించి సత్యము నెఱుంగ నుపకరించ గలదను విశ్వాసముతో ఈ కార్యమునకు గడంగితిని.

దేశమున కనగా జనసామాన్యమున కీ సంస్థవలన గలిగిన లాభములేవి? పూర్ణానుస్వారమే. అసలు జనసామాన్యమున కింగు ప్రవేశమే నిషిద్ధము. విదేశములకువెళ్ళి డిగ్రీలనందివచ్చిన న్యాయవాదులు, డాక్టర్లు, మాంచెస్టరు వస్త్రములను విదేశ వస్తువులను దేశములో ముంచియెత్తి బీదవారిని మఱింత బీదలనుగా జేసిన వ్యాపారస్థులు, కంట్రాక్టుదారులు, పత్రికాధిపతులు, శ్రీమంతులు వీరిదే యీ మహాసంస్థ. వీరే దేశీయుల కందఱకు ప్రాతినిధ్యము వహించగలవారట! పైపెచ్చు వారు జనసమూహము నెట్లవమానపఱచి తమ యహంభావమును, అజ్ఞానమును ఎట్లు చాటుకొనినది యీ క్రిందిభావములు నిరూపించుచున్నవి.

బొంబాయిసింహమని ప్రఖ్యాతివహించినట్టియు కాంగ్రెసు మహానాయకులలో ముఖ్యులైనట్టియు ఫిరోజిషా మెహథా గారి భావ మిది: 'జనసమూహ మింకను దమకు గావలసిన నిర్దిష్టమైన రాజకీయపు కోరిక లేవైనది చెప్పకొనలేని కారణమున వారికష్ట ములను, అవసరములను ఇవియని కనుగొని, సరిగాగ్రహించి ఎట్లు సమన్వయ మొనర్చవలయునో, వీని నెట్లు చక్కగా ఢీకొని నివారించపలయునో ఆకర్తవ్యము, కార్యకలాపము విద్యావంతులు

జ్ఞానవంతులు నగు వారి నాయకులపై బడినది'.

వంగదేశీయులు సుప్రసిద్ధనాయకులు నైన మనోమోహనఘోషుగా రిట్లనిరి: 'ఇచ్చట నేడు సమావేశమైనవారు దేశమునకు ప్రతినిధులు. ప్రజల పక్షమున మాటాడుట కీ సంస్థకు హక్కుగలదు. ఇండియా జనసమూహముయొక్క ఆలోచనాశక్తి, చింతనాపటిమ వీరి మూలముననే ప్రతిధ్వనించగలదు. ఈ అజ్ఞానులను నడపించుట వీరి కర్తవ్యము. అందువలన నీసంస్థను జాతీయ మహాసభయని పేర్కొనుట ఎంతయు న్యాయము'.

'అన్ని యుగములలోను అన్ని దేశములలోను యోచనాపరులగు విద్యావంతుల వర్గమునకు జెందినవారే ఆలోచనాశక్తి లేనివారిని నడపించిన విషయమును చరిత్ర మనకు చాటుచున్నది. మన సంఘ మున్న యిప్పటిస్థితిలో స్వయముగా మన మాలోచించుటమాత్రమే గాక ఆలోచించలేని అజ్ఞానుల పక్షమునగూడ నాలోచించుట మనపనియే అయియున్నది'.

ఈ కాంగ్రెసునాయకుల పరమాదర్శము బ్రిటిషు వారి పార్లమెంటరీసభ. వీరు బ్రిటిషుదేశ చరిత్రమునుమాత్రమే పఠించినారు. వంగదేశమునకు కిరీటములేని రాజుగా పొగడ్తగనిన, మహావక్త, సురేంద్రనాథబెనర్జీ యిట్లు వాకొనియున్నారు: 'ధైర్యమునకు స్వాతంత్ర్యమునకు నాలవాలమై ప్రపంచములో మహోన్నతిగాంచిన బ్రిటిషువారి హౌస్ ఆఫ్ కామన్సే మనకాదర్శము.' ఈ వాక్యము దొర్లినంతనే సభ్యులందఱు కరతాళధ్వనులు మిన్నుముట్టునట్లొనర్చి తమ సంపూర్ణామోదమును వెల్లడించిరి. ఇంగ్లాండు దేశీయుడు, కవి, స్థైర్య ధైర్యములుగల మాచ్యూఆర్నాల్డు ఈ కామన్సు సభనుగుఱించి యే భావమును

వెల్లడించెనో గమనించుడు: 'అది (ఆసభ) మేధాసంపత్తిలేని భూస్వాముల జమీందారుల గూడు పురాణి. అనాగరికులకు, మధ్యతరగతివారికి వివేకశూన్యులగు కొందఱకు కేంద్రము.' మనమిపు డెవరిని విశ్వసించవలయును?

యూరోపునందలి యాధిక్యము రాజకీయోద్యమములతో పాటు సంఘసేవా సామాజికాభివృద్ధులకై కావించిన పలు విధములైన ప్రయత్నములు వీనిపై నాధారపడియున్నది. కాని ఇంగ్లీషువారికి ఉన్నతాదర్శములందు, సంఘసేవయందు, సన్నిహితమైన సాంఘిక సంబంధమందు అభిరుచి కుంటుపడియున్నది. బ్రిటీషువారి పరిపాలనాయంత్రము నిర్దుష్టమే కావచ్చును. కాని యంత్రమే. సాంఘికజీవనమునకు పరస్పరసంబంధమునకు నిది యుపకరించదు.

మన నాయకులు ప్రక్కనేయున్న ఫ్రాన్సుదేశ చరిత్రను గాని, రోము ఈజిప్టు అమెరికా మున్నగు దేశచరిత్రలనుగాని చదివిన పాపమునబోలేదు. ఫ్రాన్సులో పరిపాలనాయంత్రమంత నిర్దుష్టము గాకపోయినను సాంఘికవిధానము సజీవమై పరస్పర సంబంధబాంధవ్యములను బెంపొందించు చున్నది. వారి మునిసిపల్ నిర్మాణవిధానము, తత్పరిపాలనాయంత్రము ఆ దేశ జీవనము నుత్తేజితమొనర్చి జీవకళ నొలికించుచున్నది.

ఇంగ్లీషువారికి వ్యాపారమందు వ్యాపారవ్యాప్తికి వలయు యంత్రతంత్రములందు ప్రీతి మెండు. వారు నందే యెక్కువగా కాలము వినియోగింతురు. ఫ్రెంచివా రట్లుకాదు. వారికి సూక్ష్మదృష్టి గలదు. సంఘాభివృద్ధికే యెక్కువగా బ్రయత్నింతురు. కళలు, వినోదములు, స్థానికసంస్థలు వీని పరిపాలనము ఇవియే వారి

నెక్కువగా నాకర్షించును.

మననాయకు లూహించినట్లు క్రమక్రమముగా శతాబ్దముల తరబడి యెప్పటికో ఫలించును స్వాతంత్ర్యము సిద్ధించినదా? పదుమూడు శతాబ్దములు నానావిధములైన బాధల ననుభవించి తుదకు అయిదు సంవత్సరములలోనే రక్తపాతముద్వారా ఆ దేశీయులు విముక్తిని బడసినవిషయ మంద ఱెఱింగినదేకదా?

ఇంతకు దేశీయమహాసభలో ఈ మహానాయకులు గావించు తీర్మానము లెట్టివి? ప్రజాసమూహమునకు కార్షిక వర్గమునకు నుపకరించు ప్రయత్నము కించిత్తయిన గనబడదు. ఉభయత్ర, ఏకకాలమున సివిలు సర్వీసు పరీక్షలు, శాసనసభల విస్తృతి మున్నగునవి యన్నియు నున్నతోద్యోగములను ధనార్జనమును గాంక్షించు నాయకుల స్వార్థపరత్వమును దృష్టిపఱచుటకే. ప్రభువులను భట్రాజులవలె పొగడుట, యాచించుట, క్షుద్రాశయముల వెలిబుచ్చుట, ఇందులోనే వీరి బుద్ధి వైభవము, తర్కనైపుణ్యము, పిరికితనము వెల్లివిరిసినది. ఇట్టి నాయకుల యథార్థతత్త్వ మెఱింగిన బ్రిటిషుప్రభుత్వము కొన్ని యుద్యోగముల నెరగానిచ్చి కాంగ్రెస్సునాయకులను దాసులనుగా చేసికొనుట మనము గాంచుచునే యున్నాము.

ఈ నాయకులు స్వార్థపరులు. వీరికి ఋజువర్తనము లేదు. శక్తిసామర్థ్యములును గొరవడిన వనవచ్చును. ప్రజాప్రతినిధులు గాని యిట్టి వారికూటమిని దేశీయమహాసభయనుట, వీరు దేశీయులకు ప్రతినిధులనుట బూటకము. బ్రిటిషువారి హావ్సు ఆఫ్ కామన్సు సభను దృష్టాంతముగా జూపి సమర్థించ బ్రయత్నించెదరేమో. ఆ యుపమాన మిట నన్వయించదు. ఆసభ ధనవంతులు జమీందారులు

నగు స్వల్పసంఖ్యాకుల కూటమేయైనను శాసనానుగుణముగా అధికార యుతముగా నెలకొల్పబడినది. మన కాంగ్రెస్సు అట్టిదికాదు. కేవలము కల్పితము. ప్రజల ప్రాతినిధ్యముగాని ప్రభుత్వాధికారముగాని లేక ఏ పదిమందివ్యక్తుల హస్తగతమో అయియున్నది.

ఇంగ్లాండునుండి మనల బాలింపవచ్చెడు యుద్యోగు లతీతులని స్వర్గమునుండి వచ్చిన దివ్యపురుషులని మన నాయకులలో కొందఱు తలంచెదరు. మనకు వారిపట్లగల ఈపిచ్చియభిప్రాయమే వారి గర్వమును మఱింత హెచ్చించినది. ఎవరో మిక్కిలి కొద్ది మందిమాత్రమే గొప్పకుటుంబములకుచేరి కళాశాలలో నున్నత విద్యాసంపదబడసి చక్కని సంస్కృతి గలవారు. అధికసంఖ్యాకులు మంచి శిక్షణగాని ఉన్నత విద్యగాని లేనివారు. వారి కుటుంబ సంప్రదాయమును ఊనమైనదే. పాఠశాలలో కంఠపాఠమొనర్చి యెట్లో పరీక్ష అయినట్లు పరిగణింపబడిన ఈక్షుద్రాశయులైన యువకుల కున్నతోద్యోగములిచ్చి లక్షలాది జనసంఖ్యగల మండలములపై నధికారము చేయనిచ్చిన ఏమనవచ్చు? ఎట్లుండును?

స్వార్థపరత్వముతో నావంతయైన హుకుములకు ఉత్తరువులకు నెన్నడేని లొంగక ఉదారమైన విశుద్ధమైన దేశాభిమాన ప్రవృత్తిగలిగి, ఇంగ్లండు తన విస్తరినుండి విసరివేయు ఎంగిలి మెతుకుల కెగబ్రాక కుండ నున్నపుడే మన పురుషత్వము మానవత్వము సార్థకమగును. అదియే నిజమైన సోదరాభిమానము, దేశాభిమానము. తత్సిద్ధిని బడయుటకే తీవ్రముగా మే మొనర్చు కడపటి విజ్ఞప్తి.

కాంగ్రెస్సు ఉద్యమ మొక గొప్ప వాజ్యమువంటిదని వీరి యుద్దేశ్యము. ఇండియా - ఆంగ్లోఇండియా వీ రిరువురిమధ్య నే। ఈ

వ్యాజ్యము. ఈవ్యాజ్యమును కట్టకడపట పరిష్కరించగల న్యాయ స్థానము బ్రిటీషువారి న్యాయబుద్ధి. మెహతా, ఉమేశచంద్ర బెనర్జి ఇతర ప్రముఖులు వాదిపక్షమున న్యాయవాదులు. ఇంతటి ప్రతిభావంతులు, అనుభవపరులు, ఇంతమంది వాదిపక్షమున వాదించుటకు సిద్ధపడియుండగా తమవ్యాజ్యమును తామే నిర్వహించుకొందుమని భావించి భారతసంతానమని విఱ్ఱవీగు పామరజనము మొండిపట్టు పట్టుట యెంత తెలివితక్కువ! ఎంత అప్రశస్తము!

కాంగ్రెస్సును స్థాపించినవారిలో హ్యూము దొరగారొకరనుట తప్పుగాదు. వారు గౌరవకుటుంబమునకు చెందిన బుద్ధిమంతులు, మంచివక్త. సామర్థ్యముతో మనవారిని నడపించెను. మన దేశదారిద్ర్యము, పొట్టనిండ తిండిలేని క్షుద్బాధ, తమ్ముల మున క్రమ్ముకొను ఆందోళన వారికి తెలియనిదికాదు. అయినను వారీ దుస్థితి నివారింప ప్రయత్నించియుండ లేదు. వారి సంకల్పాను సారము, ఈమహాసంస్థ పెడదారినిబోకుండ నేర్పుతో నెట్లు వ్యవహరించవలయునో అట్లు దిద్దితీర్చినారు. ఈ క్రిందివిధముగా ప్రభుత్వమువారితో మొరపెట్టుకొనుటను నేర్పిన వీరి బుద్ధిచాతుర్యము మెచ్చుకొనదగినది: 'ఇండియన్ మధ్యతరగతికి చెందిన వారికి విద్యాబుద్ధులను గరప మీరేర్పాటుచేసియున్నారు. వారి సిరిసంపదలను మీరు వశపఱచుకొనియున్నారు. ఆ వర్గమునకు చెందిన మా ధనసంపత్తిని మీ రత్యంతము దుర్వినియోగ మొనర్చుచున్నారు. మే మిపుడు పెద్దవారమై విచక్షణజ్ఞానము కలిగి లెక్క చెప్పుడని మిమ్మడుగుచున్నాము. ఇక మా ఆస్తిపై మేమే పెత్తనము జేసికొనగోరుచున్నాము. మమ్ము కొంతకుగొంత తృప్తి పఱుప మీరు సహృదయులై రాజీకివచ్చిన మేము సిద్ధముగా లేక

పోలేదు. కాదేని తత్క్షణమే బ్రిటీషుపార్లమెంటు యొక్క న్యాయస్థానమునకు మేము దావా దాఖలుచేయక తప్పదు. మా యీ ప్రక్రియ సంపూర్ణముగా శాసన బద్ధమైనదనియే మీరు గమనించగలరు'. వృశ్చికమునకు విషము కొండిలో నున్నట్లు చివర వాక్యములోనే దొరగారి చాకచక్యము గలదు!

ఇంతకు శ్రీఅరవిందులు 'కాంగ్రెస్సు'ను తీవ్రముగా విమర్శించుచు వ్రాయదలంచిన వ్యాసపరంపరలు పూర్తిగాక మధ్యలో నిలిచిపోయినవి. ఈ తొమ్మిది వ్యాసములకే దేశీయులలో ముఖ్యముగా యువకబృందములో కలకల మేర్పడినది. కాంగ్రెస్సుమీద నాయకులమీద భక్తివిశ్వాసములు సన్నగిల్లుటయేగాక ఒకవిధమైన విద్వేషము రేకెత్త నారంభించెను. నాయకుల నీ వ్యాసములు ములుకులై చికాకు పఱచెను. ప్రభుత్వోద్యోగులు, భారతీయ ప్రముఖులుగూడ కేసుపెట్టెదమని ప్రకాశకులను బెదిరించిరి. ఎవరు వ్రాసినది తెలియక మఱింత విస్మయ విషాదోద్రేకము లుదయించెను. తుదకు బ్రహ్మాండ ప్రయత్నములొనర్చి న్యాయాధిపతి శ్రీ గోవిందమహాదేవ రానడేగారెట్లో, శ్రీఅరవిందు లీ వ్యాసముల రచించెనని గ్రహించగలిగిరి. అంత నుభయులకు మిత్రులైన వారిద్వారా శ్రీఅరవిందుల పిలిపించుకొని కాంగ్రెస్సుమీద నీ దండయాత్రను విరమించ

వలసినదని వారు సకలవిధముల శ్రీవారికి బోధించిరి. ఇట్టి విధ్వంసక కార్యమును విడిచిపెట్టి చక్కని నిర్మాణ కార్యమును గుఱించి తన యద్భుతశక్తిసామర్థ్యములను వినియోగించుడని, జెయిలు పరిపాలనలో ఎన్నో ఘోరము లున్నవని, తద్విషయమై పరిశీలించి సంస్కారవిధానమును సూచించుడని, అందుకు వలయు నేర్పాట్ల నన్నింటిని తాను జేసి సాయపడెదనని శ్రీరానడేగారు వీరిని గోరిరట. మిత్రులు దేశపాండ్యాగారు గూడ విమర్శన తీవ్రతను గొంచెము తగ్గించి వ్యాసముల వ్రాయుచుండ వలయు నని శ్రీఅరవిందులను ప్రార్థించినను శ్రీవారే మరల వ్రాయ విరమించినట్లును తెలియుచున్నది.

౧౯౦౯ లో శ్రీఅరవిందులు జెయిలు నుండి వచ్చిన తరువాత జెయిలుచరిత్రను గుఱించి అచ్చటగల ఘోరములను గుఱించి వ్రాయుచు, శ్రీ రానడేగారు నాడు చెప్పిన విషయము నీవిధముగా బేర్కొనియున్నారు.

నాడు రానడేగారుకోరిన కారాగృహ సంస్కరణ విధానము నేడి ట్లనుభవపూర్వకముగా గ్రహించవలసివచ్చునని యనుకొనియుండలేదు. నేను కాంగ్రెస్సునుగుఱించి చేసినవిమర్శనలకు వారిచ్చిన సమాధానములు నన్ను తృప్తిపఱచలేదు. నా వాద ధోరణి దుర్బలమైనదనిగాని, సహేతుకము కాదనిగాని వారు నిరూపించలేకైరి. అయినను వారు వృద్ధులు గొప్పవారునై అంతగా

ప్రతిమాలినందున తిరిగి వ్యాసముల వ్రాసి నొప్పించుట పాడిగాదని అంతటితో విరమించితిని.

శ్రీ అరవిందు లప్పుడు ఇరువదిరెండు సంవత్సరము లేని నిండని చిన్నవయస్సులో దేశీయ మహాసభను, నాటి నాయకాగ్రేసరులైన మెహతా, బెనర్జీ మున్నగు మహామహుల నిట్లు తూర్పారబెట్టి విమర్శించుట సాహస మనుట అత్యుక్తిగాదు. వీరి దేశాభిమానమును, ఆత్మవిశ్వాసమును వెల్లడించు ఈ వ్యాసము లెప్పుడేని ప్రకటితములు కాకపోవని నా యాశయము. ఈ వ్యాసములు శ్రీ అరవిందుల కానాడు 'సోషలిజము' పట్ల కొంత నభిమాన ముండెనని సూచించుచున్నవి.

ఇతరోన్నతోద్యోగుల నెట్లు చూచినను శ్రీ అరవిందులపట్లమాత్రము మహారాజెంతో ప్రేమాదరణముల భక్తివిశ్వాసముల వెల్లడించి మిక్కిలి గౌరవించుచుండెడివారు. రాజ్యపరిపాలనకు తిన్నగా నంత సంబంధములేని విద్యాశాఖయందు, నందును స్వల్పోద్యోగ్యమందే యున్నను వీరి నిరుపమాన ప్రతిభాసామర్థ్యముల నెఱింగినవారగుటవలన మహారాజు తన రాజ్యపరిపాలనా సంబంధమున తఱచు శ్రీ అరవిందునితో సంప్రతించుచుండె ననియు, ప్రభుత్వనివేదకలను, ముఖ్యమైన

పత్రములను, తా మొసంగవలసిన ప్రధానోపన్యాసములను తయారుచేయు సందర్భములందు శ్రీఅరవిందుల సాయ మపేక్షించుచుండెననియు, నత్యవసర కార్యముల నాలోచించుటకు మహారాజ భవనమునకు తఱచు వీ రాహ్వానింపబడుచుండి రనియు తెలుపవచ్చును. అట్లాలోచించుటకు మహారాజే శ్రీఅరవిందు లుండు గృహమునకు వచ్చినదినము లెన్నియోగలవు. మహారాజు వీరింటికివచ్చి గుఱ్ఱపు బండిలోనున్నపు డుద్యోగ లాంఛనముగా డాంబిక వేషమును ధరించక ఒకచే కట్టుధోవతితోడనే వారిని జూచి మాటాడుచుండెడివారు. ఒకటి రెండు పర్యాయము లుదయమున పెందలకడనే వాహ్యాళి వెళ్ళుచు నేదో యాలోచించుటకు గుఱ్ఱపు బండిలో మహారాజుగారు దయచేయగా శ్రీఅరవిందులు నిద్రించుచుండిరట. ఆ విషయ మెట్లో మహారాజు గుర్తించి 'వారిని లేపి నిద్రాభంగము గావించరా' దని యచ్చటివారికి గట్టియుత్తరు వొసంగి ఆవల నొకటి రెండు ఘంటలకు నిదుర లేచినతర్వాత తిరిగివచ్చి మాటాడి వెళ్ళిరట. ఇట్లంతటి యభిమానగౌరవము లే యితరోన్నతోద్యోగులును బడయ లేదనుట అతిశయోక్తి కాదు. మహారాజుగారు రాజమందిరమున నొసంగు

విందులకు - డిన్నర్లు, టీపార్టీలకు - శ్రీఅరవిందుల నెల్ల ప్పుడు నాహ్వానించు చుండెడివారు. కాని శ్రీఅరవిందు లే దేదోయొక మిషమీద, సాధారణముగా నట్టియాహ్వాన ములకు బోక, తప్పించుకొన బ్రయత్నించుచుండెడివారు. ఒక్కొక్కప్పుడు మహారాజుగారి యాంతరంగిక కార్య దర్శి 'తమ రీ యాహ్వానము నంగీకరించి విందుకు దయ చేయగలిగిన ప్రభువు లెంతో సంతసింతురు' అని యాహ్వానపత్రముతోపాటు ప్రత్యేకముగా నుత్తరము వ్రాసి పంపుచుండెడివారు. బరోడా మహారాజుపట్ల శ్రీ అరవిందులకు గూడ నెంతటి గౌరవముండెనో యీ క్రిందివాక్యములు సూచించుచున్నవి. *'మహారాజుగారి యంతటి శక్తిసామర్థ్యములు, రాజకీయపరిజ్ఞానము, పరి పాలనాదక్షతగల మహారాజు మరొకరు దేశములో గనపడరు. వీరు ఒక్క బరోడారాజ్యమునే గాక భరత ఖండము నంతను బరిపాలించగల సమర్థులు.'

బాల్యమాది చిరకాల విదేశ వాసమువలన శ్రీ అరవిందుల కాలస్యముగా నిద్రమేల్కొనుట అభ్యాస మయినది. కాని, రాత్రిపూట నందఱు నిద్రించిన తర్వాత ప్రశాంత సమయమున నేకాంతముగ గ్రంథ

* 'అరవింద ప్రసంగ' మను బంగాళీ గ్రంథమునుండి



శ్రీ అరవిందులు బరోడాలో నుండగా

పఠనమందో వ్రాతయందో నిమగ్నులై యించుమించు రాత్రియంతయు పనిచేయుచుండెడివారు. ఆ సుముహూర్తమునందు వారి హృదయమునుండి వెల్లివిరిసిన కవిత్వ మెంతయో గలదు.

ఈసమయముననే వంగభాషా పాండిత్యము నభివృద్ధి గొందించుకొనుటకు కలకత్తానుండి శ్రీదినేంద్రకుమారరాయి యను వారిని శ్రీ అరవిందులు బరోడాకు బిలిపించుకొనిరి. కాని వంగభాష నంతపట్టింపుగా వీరియొద్ద బఠించినట్లును గనపడదు. ఎపుడో వారమున కొకటి రెండు పర్యాయములు పఠించిన మరల రెండు మూడువారములవఱకును జదువకుండనే యుండెననియు తనకే ఫ్రెంచి జర్మనీ భాషల నేర్పుటకు శ్రీఅరవిందు లెంతో శ్రద్ధాదరముల వహించుచుండిరనియు రాయిగారు వెల్లడించియున్నారు. ఆవల కొన్ని సంవత్సరములకు 'అరవిందప్రసంగ' మను గ్రంథమును వంగభాషలో శ్రీరాయిగారు ప్రకటించిరి. శ్రీఅరవింద జీవితవిశేషములను, ముఖ్యముగా బరోడాలో నున్నసమయమునకు సంబంధించినవి చక్కగా వర్ణించి శ్రీ రాయిగారు కృతార్థులయిరి. శ్రీఅరవిందుల గ్రంథపఠనానురాగము, సుఖదుఃఖములు, శీతోష్ణములు, దూషణ భూషణములు

లోనగు ద్వంద్వములపట్ల వారికిగల సమత మున్నగు విషయము లెన్నో యిం దుల్లేఖింపబడినవి. పాఠకుల కుపకరించునని శ్రీ రాయి గారి గ్రంథమునుండి కొన్ని విశేషముల సంగ్రహముగా ననువదించి యీ క్రింద పొందుపఱచుచున్నాము.

దివారాత్రము లొకే స్థలమున కలసిమెలసి రెండేండ్లపాటు శ్రీఅరవిందులతో నివసించు మహాభాగ్య మబ్బినందున వారి హృదయమును కొంత ఎఱుంగగలిగితిని.

*

* *

శ్రీఅరవిందులు చిరకాలముగా ధనమును తుచ్ఛముగా భావించెడివారు. ధనమును గూడబెట్టుకొనుట వారికి గిట్టదు. ఆయన అపు డేకాకి; ఏ షోకులు, భోగవిలాసములు లేవు. ఆ దృష్టియే వారికిలేదు. విలువయిన బూట్లు, కాలర్, కోటు, హ్యాటు ఉన్నిబట్టలు మున్నగునవి వారికి లేవు. ఒకదినమేని హ్యాటు వారు ధరించినది లేదు. దేశవాళి మామూలుచెప్పులు, అహమ్మదాబాదు మిల్లుధోవతిలు, బరోడాలో వాడుచుండెడి నాటుటోపీలు, తల పాగా, సామాన్యమైన చొక్కా—కోట్లు ఇవియే వా రుపయోగిం చెదరు. తుదకు రాచదర్బారులకు విందులకు వెళ్ళవలసినపుడు గూడ ఈ మామూలువేషమే. ఒక కాసైన దుర్వినియోగము చేయరు. ఇట్లుండియు నెలాఖరున నొక్క—దమ్మిడియు చేతిలోనుండదు. ఎన్నో పర్యాయములు మిత్రులయొద్దనుండి చేబదుళ్ళ దీసికొనుచుండుట నే నెఱుంగుదును.

గ్రంథములకే వారిధన మెక్కువగా వ్యయమగుచుండెను. పోస్టుద్వారా వారి కెన్నడు గ్రంథములు వచ్చినదిలేదు. పెద్దపెద్ద జాజికాయపెట్టెలలో రైల్వేపార్శలుద్వారా వచ్చుచుండెను. అదియు మాసమునకు రెండు మూడుపర్యాయములు. పదిదినములలో వచ్చిన గ్రంథముల సాంతముగా పఠించివైచి క్రొత్తగ్రంథముల కెదురుచూచుచుండెడివారు. వీరివలె గ్రంథపఠనానురక్తి గలవారిని నేను చూచియుండలేదు. వీరు తల్లిగారికి మాత్రము వేతనమందగనే మొదట పైక మంపుచుండెడివారు. తల్లిగారిపట్ల వీరికిగల భక్తిప్రేమలు నిరుపమానము. 'మాతల్లి పిచ్చిది, పిచ్చితల్లి కొమారుడును పిచ్చివాడేగదా' యని యపుడపుడు నుడువుచుందురు.



శ్రీ అరవిందు లుదయముననే 'టీ' త్రాగి కవిత్వమల్ల నారంభింతురు. కలము త్రిప్పి వ్రాయ నారంభించుటకు పూర్వ మొకింత యాలోచించుచు కూర్చుందురు. అతిత్వరగా పద్యముల వ్రాయుదురని తోచదుకాని, వ్రాయ నారంభించెనా లేఖినికి విరామ మొసంగరు. మొదట చిన్నచిన్న కాగితములపై చిత్తువ్రాయుదురు. ఈ సమయముననే మహాభారతమునుండి యెన్నో యుపాఖ్యానముల నాంగ్లమున పద్యరూపమున ననువదించిరి. ఆంగ్లమున నానా ఛందస్సులలో నవ్యవైఖరులలో కవనమల్లిరి. ఆంగ్లభాషలో వారికి గల అసాధారణసారస్వతసంపత్తు అద్భుతము. ఏకాంతముగా తదేకదృష్టితో తన్మయులై కావ్యము రచించునపు డెవరును వారితో సంభాషించి భంగపఱచుట వారి కిష్టములేదు. ఎంతో కష్టముగా నుండును. కాని ఆ వైఖరి నన్యులెఱుంగజాలనట్లే సరస

ముగా వ్యవహరింతురు. ఈ శమనగుణము వారికి ఉగ్గుబాలతో నలవడినట్లున్నది.

ఇట్లు పదిఘంటలవఱకు వ్రాయుచునే యుందురు. వ్రాసిన దానిని తిరిగి చదివి, ఎచ్చటనేని ఒంటి రెండు పంక్తులలో నొకటి రెండు పదముల మార్చి వన్నె పెట్టుదురు. సాధారణముగా కొట్టివేత లుండవు. అంత స్నానమునకు వెళ్లి తిరిగి పదునొకండు ఘంట లకు వ్రాతబల్లయొద్ద కూర్చుండి కొంత వ్రాయుదురు. ఇంతలో భోజనము సిద్ధమైయుండును. భుజించుచునే వార్తాపత్రికల బఠిం తురు. శ్రీఅరవిందులు రాత్రులు ఒంటిఘంట వఱకు చదువుచునో వ్రాయుచునో ఉండెడివారు, టేబిలుమీద మూడు నాల్గు రూపా యల వెలగల ఒక చిన్న 'టైంపీస్' గడియార ముండెడిది. వారి వద్దగూడ నాల్గురూపాయల వెలగల చిన్నగడియార మెపుడు నుండెడిది.

శ్రీఅరవిందుల కాహారవిషయమై ఏకాతరలేదు. వంటవా డెట్లు చేసినను సరిపోవును. బరోడా భోజన పాకరీతి వంగదేశీయు లకు రుచించదు. ఆ వంటకము నొకనాడు విస్తరిలో చూచి నంతనే నాకు డోకు వచ్చుచుండును. కాని శ్రీఅరవిందులు మాత్ర మకుంఠితభావముతో వడ్డించినదంతయు, నదియెట్లున్నను, ఏసంకోచము లేక భుజింతురు. తుదకు వంగదేశమునుండి యెంతో కష్టముమీద నొక వంటవానిని రప్పించితిమి. వంట చక్కగా దెలిసినవా రింతదూరము రారు. ఎవడో దాపరించెను. ఎచ్చట నెవరును వంటపనికి వానిని పిలువనందుననే మాకు లభించె నను విషయము వెంటనే అనుభవమయినది. వంటయే వానికి తెలియదు. ఏదిచేసినను పాడుగానుండెడిది. ఒకపర్యాయము సుప్రసిద్ధ చిత్ర

కారకుడు శిశిరకుమారబాబుగా రింగ్లాండునుండి బరోడాకు మహారాజుగారి యాహ్వానమున వచ్చియుండగా, శ్రీఅరవిందులు వారిని భోజనమునకు బిలిచిరి. వంటవానికి తెలియునట్లు నా ద్వారా ఏయే పదార్థములు చేయవలసినదియు చెప్పించిరి. 'వీనిని చక్కగా చేయుటకు నీకు తెలియునా' యని యడుగగా వా డేజంకుగొంకు లేకుండ నిట్లనెను 'ఓ' నాకు బాగుగా తెలియును. కావలసిన సామగ్రి నిప్పించిన ఎందుకు చేయలేను?' అంత వాడు కోరిన వస్తువులనెల్ల తెప్పించి యిచ్చితిమి. ఇంతకు భోజనమునకు కూర్చుండుముగదా వంట అంతయు పాడుగానుండెను. ఒకపదార్థ మేని తినుట కిష్టము గాదాయెను. డబ్బాలోని నెయ్యిమాత్రము ఖాళీ అయినది. అంత జాగ్రత్తగా చేయవలసినదని ముందుగా చెప్పియు నిట్లు రసాభాసమొనర్చినందులకు నాకు వానిపైగలిగిన కోప మంతింతనరాదు. ఏమిచేయుదు? శ్రీఅరవిందులు పల్లెత్తి వాని నేమియు ననక వడ్డించిన పదార్థములను యథాప్రకారమే భుజించిరి.

*

* *

వా రుండినబంగళా మిక్కిలి ప్రాతది. మరమ్మతు ఏనాడును చేయించలేదు. సున్నమైన కొట్టించిన పాపమున బోలేదు. వేయేల సామాన్యసంపన్నుల గోశాలలుగూడ నిట్లుండవు. ఇంటిపై పెంకులుగూడ పగిలి వర్షకాలములో కురియుచుండును. ఎండ కాలములో మండుటెండలు, వేడిగాడ్పులు, వీనితో దుస్సహముగా నుండును. వర్షకాలములో వర్షము లచ్చుట విపరీతము. ఇక శీత కాలములో చలి యింతింతనరాదు. పగలు ఈగలబాధ, రాత్రులు

దోమలబాధ. ఏమానవుడును సహించలేడు. ఇట్లున్నను శ్రీఅరవిందులు బాహ్యజ్ఞాన శూన్యులై యోగమగ్నులైన మహాతపస్వివలె తదేకదృష్టితో ఘంటల కొలది యిటునటు కదలక గ్రంథావలోకన మొనర్చుచుండుట నా కాశ్చర్యముగా నుండెడిది. ఆ సమయమున నిప్పంటుకొని గది మండిపోవుచున్నను వారికి తెలియదనియే చెప్పవలయును. చలికి మనవలె వేటి కంబళ్ళు వారుపయోగించెడివారు కారు. తుదకు దోమ తెరయు వారికిలేదు.

*
* *

వ్యాసునికంటె వాల్మీకియే వారి కెక్కువ గౌరవపాత్రుడని చెప్పనొప్పును. భూలోకమున వాల్మీకి కవివలె మఱొకకవి లేడని వారి భావము. ఈ విషయమై ఆంగ్లమున నొక వ్యాసమును రచించినారు. దానిలో నొకపర్యాయ మిట్లనిరి: మహాకవి డాంటే కవిత్వముతో ముగ్ధుల మగుదుము. హోమరుని 'ఇలియడ్' పఠనమున బరితృప్తుల మగుదుము. యూరోపియన్ సాహిత్యమున వారతుల్యులే కావచ్చు. కాని కవిత్వమున వాల్మీకియే సర్వశ్రేష్ఠులు. రామాయణమునుబోలిన మహాకావ్యము పృథ్విలో మఱొకటిలేదు.'

*
* *

మహాభారతమునంతను, వరుసగా గాకపోయినను, ఇంచుమించు అన్ని ఉపాఖ్యానములను శ్రీఅరవిందు లాంగ్లమున పద్యరూపమున ననువదించియుండిరి. ఈరచన అంతయు బరోడాలో నుండినపుడే జరిగినది. అపుడపుడు మూలానుసారముగా నున్నదో లేదో చూడుడని సంస్కృతభారతమునుండి ఆ యా భాగములను

ముందుచదివి ఆవల వారి యాంగ్లానువాదమును నాకు వినిపించుచుండెడివారు.

*
* *

౧౮౯౯-వ సంవత్సరాంతమున మహారాజుగారి యాహ్వానమున కీర్తిశేషులగు రమేశచంద్రదత్తుగారు బరోడా వచ్చియుండిరి. శ్రీఅరవిందునితో వారికంతగా పరిచయము లేకున్నను వీరి ఆంగ్లపాండిత్యము కవిత్వమాధుర్యము కొంత తెలియుననియే చెప్పనగును. దత్తుగారంతకుపూర్వమే శ్రీమద్రామాయణ మహాభారతముల నాంగ్లమున పద్యరూపమున ననువదించి ఇంగ్లండులో ప్రకటించియుండిరి. వీరి యాంగ్లరచనలు ఆంగ్లేయ పండితుల పత్రికల ఆదరాభిమానములను గడించెను. గద్యపద్యములందు, ఉపన్యాసములందు, వ్యాసములందు, వారసమాన ప్రతిభావంతులని పేరు.

బరోడాలో నున్నపుడు శ్రీఅరవిందుల గృహమునకు దత్తుగారొకనాడతిథులుగా వచ్చియుండిరి. అపుడు శ్రీఅరవిందుని ఆంగ్ల పద్యములను వినిపించుమని ఎంతో యుత్సాహాభిమానములతో గోరిరి. తప్పించుకొనవలయునని చేసిన శ్రీ అరవిందుని ప్రయత్నములు విఫలమగునట్లు దత్తుగారు పట్టుపట్టి బీరువాలోని చిత్తువ్రాతప్రతులను బయటకు తెప్పించిరి. మహాభారతోపాఖ్యానముల ఆంగ్లపద్యానువాదములు గల ఆ కాగితముల నాంతముగా బఠించి ముగ్ధులై దత్తుగారిట్లనిరి. 'మీ యీ సకల కవిత్వమును చూచినతరువాత రామాయణ మహాభారతముల నాంగ్లమున బద్యకావ్యములుగా నే ననువదించి యెంత ధ్వంస

మొనర్చితినో నా కిపుడు బోధపడినది. మీ యీ దివ్యమైన యనువాదమును ముందుగా నేను జూచియుండినయెడల నే నా గ్రంథములను ఎన్నడును బ్రకటించియుండను. నే నెంత వ్యర్థ ప్రయాస గావించినది నా కిపుడు స్ఫురించి దుఃఖము గలుగు చున్నది. నా యీ వ్రాత పసిపిల్లవాని పనియేయని యిపుడు స్పష్ట మైనది'. కాని దత్తు మహాశయు నంతటి వా రట్లు ప్రశంసించు చున్నను శ్రీఅరవిందునిలో లవమేని హర్షోత్ఫుల్లతాది సూచనలు వైఖరులు గోచరించలేదు.

*
* *

బ్రహ్మచర్యనిరతి, పరదుఃఖకాతరత, ఆత్మత్యాగము ఇవి తప్ప మఱొకభావమే శ్రీఅరవిందులకు లేదు. జ్ఞానసంచయమే వారి జీవన వ్రతము. ఈ వ్రతోద్యాపన నిమిత్తమే కర్కశకోలాహల ప్రతిధ్వని పూరిత సంసారమున నివసించుచుండియు వారు కఠోరతపస్సున నిమగ్నులైరి. వేయేల, వీరు భూలోకమానవులు గారు. ఏదో శాపభ్రష్టుడైన దేవతయే.

*
* *

౧౯౦౧-వ సంవత్సరమున ఏప్రిల్ మాసమున కాబోలు, బరోడాలో నుద్యోగమున బ్రవేశించిన ఏడెనిమిదేండ్లకు తన ఇరువదితొమ్మిదవ సంవత్సరమున, శ్రీ అరవిందులు మృణాళినీదేవిని బరిణయమాడి గృహస్థాశ్రమున బ్రవేశించిరి. అప్పటికే యాధ్యాత్మిక

దృష్టియు నిశ్చిత కార్యసంకల్పమును గల వీరు వివాహ మాడుటయా మానుటయా యని యెంతోకాలము తర్కించుకొనుచుండినందునే ఇంత యాలస్యముగా వివాహమైనట్లు తెలియుచున్నది. శ్రీ అరవిందుల భావ మరది డాక్టరు శిశిర్‌బోసుగారు 'ఉద్బోధన్' అను బంగాలీ పత్రికలో శ్రీ అరవిందుల వివాహమునుగురించి రెండు మూడుసంవత్సరముల క్రిందటనే ఇట్లు వెల్లడించి యున్నారు.

పత్రికలో వివాహమాడుటకు వధువుకావలయునని శ్రీ అరవిందులు ప్రకటనచేసియుండిరి. మా తండ్రిగారి యావజ్జీవ మిత్రులు, కీర్తిశేషులు వంగవాసి కళాశాలాధ్యక్షులు నగు గిరీష్ చంద్రబోసుగారు వివాహకార్యసంధానము నొనర్చిరి. శ్రీ అరవిందులు స్వయముగా గిరీష్‌గారింటికివచ్చి నా సోదరిని చూచి తన పత్నిగా వరించియుండిరి. వివాహ మహోత్సవము కచ్చితముగా హిందూ సంప్రదాయపు పద్ధతుల ననుసరించియే జరిగినది. అరవిందులు బ్రహ్మసమాజ కుటుంబమువారై యున్నందున, నా సోదరి ఇంగ్లాండు వెళ్ళివచ్చిన హిందువుని పుత్రికయైనందున, వివాహమునకు ముందు ఉభయులును ప్రాయశ్చిత్తపూర్వకముగా పునీతు లొనరింప బడవలసి వచ్చెను. (శ్రీ అరవిందుల ప్రాయశ్చిత్తము కేవల లాంఛనమాత్రమే; పేరునకే.) మా పెత్తండ్రిగారే కన్యాదాన మొనర్చిరి. వివాహమునకు వచ్చిన అతిథులలో ముఖ్యులు కీర్తిశేషులగు సిన్హాప్రభువు, వ్యోమ్‌కేశ చక్రవర్తి,

ప్రధానాచార్యులు గిరీష్‌చంద్రబోసు, సర్ జగదీశచంద్రబోసు మున్నగువారు. కలకత్తాలో వైతాక్ ఖానా రోడ్డునం దొక బాడుగింట వివాహము జరిగినది.' వివాహము ౧౯౦౧-లో ఏప్రెల్ నెలయందు. వివాహమప్పటికి నా సోదరికి పదునాల్గేండ్లపుడే నిండి పదునైదవ సంవత్సరము వచ్చియుండెను. నా సోదరి జన్మదినము ౧౮౮౭ మార్చి ౬-వ తేది. వివాహమైన వెంటనే భార్యాసహితులై దియోఘర్ నైనితాలు మీదుగా శ్రీఅరవిందులు బరోడాకు తిరిగిపోయిరి.

శ్రీఅరవిందుల మామగారి కుటుంబమును మిక్కిలి ప్రసిద్ధమైనదే. మామగారగు భూపాలబోసు అకాలముననే విదేశముల కేగి విద్య నభ్యసించి మాసమునకు పదునాలువందల వేతనముతో ప్రభుత్వమునం దున్నతోద్యోగిగా నుండి తన ప్రజ్ఞావిశేషముల వెల్లడించి 'రాయబహదూర్' బిరుదమును బడసినవారు. ఆవల నుపకార వేతనము నందుకొనుచు అధ్యాత్మజిజ్ఞాసువులై శ్రీఅరవిందుని పూర్ణయోగమునందు దృఢ విశ్వాసము గలవారై సాధనచేయుచుండిరి. వారొక పర్యాయము ప్రస్తావనలో 'మున్నొకనాడు తండ్రితో సమానమగు మామగారను బాంధవ్యరీత్యా గౌరవము బొందిన మాట యెట్లున్నను నేడు వారిని - శ్రీఅరవిందుని-తండ్రిగా, గురువర్యునిగా, భగవానునిగా గొలుచు

భాగ్యము గలిగినది' యని తెలిపి తమ శిష్యత్వసంబంధమునకు సంతోషించిరి. శ్రీఅరవిందుల శిష్యుడైన బోసుగారు * పలుమారు రెంటరిగాను, ఒకటిరెండు పర్యాయములు భార్యాసహితులు గాను పుదుచ్చేరికి వచ్చి మాసముల పర్యంత ముండి సాధన చేయుచుండిరి.

శ్రీ అరవిందులు వివాహానంతరము అర్ధాంగి మృణాళినీదేవిని, ప్రియసోదరి సరోజినీదేవిని బరోడాకు బిలిపించుకొని కాపురము సాగించిరి. మృణాళినీదేవి బ్రహ్మసమాజపు కుటుంబమున జన్మించి యా వాతావరణమునందు పెరిగినదయ్యు నవనాగరపు నిగారింపులు, భేషజములు తెలియని యమాయకురా లని ధర్మాత్మురా లని వినయవతి యని యామెతో పరిచయము గలవా రందఱు నామెను గొనియాడుచుండిరి. కాపుర మొనర్చిన కాల మత్యల్పమయ్యు భార్యాభర్త లిరువురు నన్యోన్యప్రీతిమెయి గార్హస్థ్యధర్మము నుత్తమరీతి నిర్వహించి యాదర్శకులుగా నుండిరని చెప్పనగును. శ్రీఅరవిందులర్ధాంగియగు మృణాళినీదేవి గారికి వ్రాసిన లేఖలను బఱంచితిమేని ధర్మపత్నిపట్ల వీరు ప్రకటించిన పవిత్రప్రేమ, భర్తగా వహించ నెంచిన మహాభారము, ఆమె

* వీరు ౧౯౩౭ లో గతించిరి.

మన్నతపథమునకు గొంపోనెంచి చేసిన మహాప్రయత్నము, ఒసంగిన దివ్యోపదేశములే గాక, ఎంత సరళముగా నన్యోన్యముగా వారు మెలంగుచుండినదియు తెలియ గలదు. ఆ లేఖలనుండి కొన్ని భాగముల నిం దుదాహరించుచున్నాము.

అనేక దినములుగా ఉత్తరము వ్రాయనైతిని. అది నా చిరంతనాపరాధము. అంగలకు నీ మంచిచేత క్షమించకపోతివని నాకిక నుపాయ మేమికలదు ? .....

*

* *

......నిన్నుపేక్షజేసి నా పనులమీద నేనుంటి నని నీ వనుకొనగలవు, అట్లనుకొనకుము.

*

* *

......నాల్గువైపులనుండియు......ఒత్తిడి. ఈసమయమున నీవు ఆస్థిరురాలవగుదువేని నా చింతావ్యాకులత్వములుగూడ హెచ్చగును. నీవు ఉత్సాహముతోడను సాంత్వనముతోడను నింపి ఉత్తరము వ్రాయుదువేని నాకు మిక్కిలి శక్తి లభించును. ప్రఫుల్ల చిత్తముతో అఖిల విపత్తులను భయములను అతిక్రమింప సమర్థుడ నగుదును. దేవఘరులో ఒంటరిగానుండుట నీకు కష్టమని ఎఱుగుదును. అయినను మనసును గట్టిచేసికొని విశ్వాసముపై ఆధారపడితివేని దుఃఖము మనస్సుపై అంత అధికారము చెలాయించనేరదు. ఎపుడు నాతో నీ వివాహమయ్యెనో అపుడు నీ

భాగ్యమునం దీదుఃఖ మనివార్యము. మధ్య మధ్య ఎడబా తప్పదు. ఏలన, నేను సాధారణ బంగాళీలవలె కుటుంబము యొక్కయు స్వజనముయొక్కయు సుఖమే ముఖ్యోద్దేశముగ గ్రహింపజాలను. ఈ స్థితియందు నాధర్మమే నీధర్మము. నాకు నిర్దేశింపబడిన కార్యముయొక్క సఫలతయే నీసుఖముగా భావింప వేని నీకు వేఱుమార్గము లేదు......ఎవరితో నీ విపుడున్నావో అనేకులగువారు నీకును నాకును గురుజనులు. వారు పరుషవాక్య ములు పలికినను, అన్యాయపుమాటలాడినను వారలపై కోపగింప కుము. మఱియు వారల నోట వచ్చినదంతియు వారి హృదయము లోని మాటయే యని కాని, నిన్ను కష్టపెట్టుటకై పలుకబడినదని కాని తలపబోకుము. పెక్కుమారులు కోపముయొక్క వేగము నందు అనాలోచితముగానే మాటలు వెలువడుచుండును. వానిని గట్టిగా బట్టుకొనియుండుట మంచిదికాదు.



హిందూధర్మశాస్త్ర ప్రణేతలు......అసామాన్యము లగు చరిత్రలను, యత్నములను, ఆశలను కడు ప్రేమించిరి. వెట్టి కానీ, మహాపురుషుడు కానీ, అసాధారణజనులను మిగుల మన్నించిరి. కాని ఈ సకలమునందును స్త్రీలకు భయంకరమైన దుర్దశ తటస్థించునే, దానికై ఏమ యుపాయము? ఋషు లీ యుపాయ మును జక్కగా నిర్ణయించిరి. వారు స్త్రీజాతికిట్లు జెప్పిరి.— "పతిః పరమోగురుః". ఈ మంత్రమే స్త్రీజాతికి ఏక మాత్ర మగు మంత్రమని తెలియుము. భార్య భర్తయొక్క సహధర్మిణి, అతడే కార్యమును స్వధర్మముగా గ్రహించునో దాని కాపె

సాహాయ్య మిడును, మంత్రణ మిడును, ఉత్సాహ మిడును, అతనిని దేవతవలె మన్నించును. అతని సుఖమునందు సుఖము, దుఃఖమునందు దుఃఖము ననుభవించును. కార్యము నిర్ణయించుట పురుషుని యధికారము, సాహాయ్యమును ఉత్సాహమును ఇచ్చుట స్త్రీయొక్క అధికారము.

*
* *

......వెఱ్ఱివానిని వివాహ మాడితివి......వెఱ్ఱివానికి అనురూపమైన వెఱ్ఱిదానవగుటకు యత్నము చేయుదువా? ఎటుల అంధరాజుయొక్క మహిషి కందోయిపయి బట్టబిగించుకొని అంధతను యలవరచుకొనెనో అటుల. వేయి బ్రహ్మసమాజపు బడులలో జదివియుందువు గాక, నీ శరీరమందున్నది హిందూ పూర్వ పురుషుల రక్తము; నాకు సందేహములేదు. కడపట జెప్పిన బాటపైననే నీవు నడతువు.

*
* *

భార్య భర్తయొక్క శక్తి. నీవు ఉషయొక్క శిష్యురాలవై దొరల పూజామంత్రములను జపము చేయుదువా? ఉదాసీనురాలవై భర్తయొక్క శక్తిని కొలది పఱతువా? లేక, స్వాను భూతితోడను ఉత్సాహముతోడను ద్విగుణము చేయుదువా? నీ వనవచ్చును, 'ఈ గొప్పపను లన్నింటిలో నావంటి సామాన్యురా లేమిచేయ గలదు; నాకు మనోబలము లేదు, ఈ విషయముల నన్నిటిని తలచుటకే భయమగును' అని. దీనికి సులువైన ఉపాయము కలదు, భగవంతుని ఆశ్రయము కైకొనుము, ఈశ్వరప్రాప్తి పథమునం

దాకేసారిగా ప్రవేశింపుము, నీకేయే లేములుకలవో ఆతడు శీఘ్ర ముగా వానిని బూరించును. ఎవరు భగవంతునికడ ఆశ్రయము జెందుదురో భయము వారిని క్రమ క్రమముగా వదలిపోవును. మఱియు నాపై విశ్వాస ముంచగలిగితివేని, పదిమంది మాటలను వినక నామాటనే విందువేని, నేను నీకు నాబలమునే ఈయగల ను. దానివలన నాబలమునకు హాని కలుగక వృద్ధియే కలుగును. భార్య భర్తయొక్క శక్తియని మన మందుము; అనగా, భర్త భార్యయందు తన ప్రతిమూర్తిని జూచి, ఆపెకడ తన మహా కాంక్షయొక్క ప్రతిధ్వనిని విని ద్విగుణమైన శక్తినిబడయును.

'నేను మంచిబట్టలను గట్టుదును, మంచి ఆహారమును భుజిం తును, నవ్వుదును, ఆడుదును, తీరుతీరుసుఖముల ననుభవింతును' అని ఎల్లప్పుడును ఈభావమునందే నిలుతువా? ఇట్టి మనఃస్థితిని ఉన్నతి యనరు. నేటికాలపు మనదేశమునందలి స్త్రీల జీవనము అతి సంకుచితమును అతిహేయమును ఐన ఈ యాకారమును ధరించినది. నీ వదంతయు వదలివేయుము, నాతో రమ్ము; జగమున భగవంతుని పనిచేయుటకు వచ్చితిని, ఆపని నారంభింతును.

బరోడాలో నున్నపుడు శ్రీఅరవిందులకు నవ సారీ ప్రధాన మండలాధికారిగా నుండిన ఖాసీరావు జాదవ్‌గారితో గాఢస్నేహ మేర్పడినది. ఖాసీరావు కుటుంబము బరోడాలో నుద్యోగరీత్యాఏమి సాంఘి కౌన్నత్యసంబంధమున నేమి విద్యాబుద్ధులందేమి మిక్కిలి ప్రసిద్ధమైనది. ఇచ్చటికి పురప్రముఖులు పలువురు

తఱచుగా విచ్చేయుచు శ్రీఅరవిందులతో సంభాషిం చుట గౌరవప్రదముగా భాగ్యముగా భావించుచుండిరి. శారిష్టరు దేశపాండ్యాగారు లండన్ పట్టణమున విద్యార్థి దశలో నుండగానే శ్రీఅరవిందునికి పరిచితులు. వీరు శ్రీ అరవిందుని కడ కరుదెంచి యెన్నోవిషయముల గుఱించి సంభాషించుచుండెడివారు. స్వామి వివేకానం దుని పాశ్చాత్య శిష్యవర్గమున నుత్తమస్థాన మధిష్ఠించిన పుణ్యాచరిత సోదరి నివేదిత వీరికడకు వచ్చుచుండెడి వారు. శ్రీఅరవిందులు వ్యర్థసంభాషణముల నేవగించు వారని అతి మిత భాషి యని అనవసరపు సంభాషణల నొనర్చ రని పేరున్నను, ఈ చర్చాసమయములందు వారుపయోగించు సూటి మాటలకు, వెల్లడించు సర్వతోముఖ జ్ఞానాతిశయమునకు, నిరాడంబరముగా నిర్మాణశక్తిని బ్రకటించువారి వశీకరణ వ్యక్తిత్వ విశేష మునకు, ప్రౌఢతా చమత్కారముల నీను వారి హాస్య రసమునకు నందఱు ముగ్ధు లగుచుండెడివారట. అచ్చట నున్న పదుమూడు సంవత్సరములందును, *మహారాజు మెచ్చుకోలును గౌరవాదరణలను జూరగొనిన ఉద్యోగి గా, తమ యసమాన మేధా సంపన్నతకు దగిన బోధనా

---

* వీరు ౧౯౩౩-లో గతించిరి.

కౌశల్యమువలన, అపారపాండిత్య గరిమవలన 'గురవే నమః' యని విద్యార్థిబృందము భక్తిమెయి చేయెత్తి యొనర్చిన నమస్కారముల స్వీకరించిన ఆచార్యులుగా, పురమందలి నాయకులు, విద్యాధికులు, పెద్దలు పిన్నలు అందఱచే ప్రేమాభిమానములు గొనిన పౌరులుగా శ్రీఅరవిందులు కీర్తిగాంచిరి.

ఈ కాలమున బరోడాయం దుండగానే బల్లపీట మూలమున చనిపోయినవారితో సంభాషించు – టేబిల్ టాక్–నభ్యాసమును శ్రీఅరవిందులు విరివిగా సాగించిరట. వీరియం దంతర్గతమైన వీరి యాధ్యాత్మిక తృష్ణ, దేశస్వాతంత్ర్యాభిలాష వీరి నిందుకు ప్రేరేపించినట్లు వీరు గావించిన మృతజీవులతోడి సంభాషణావిషయములు సూచించగలవు. రామమోహన్, వివేకానంద, రామతీర్థ, నెపోలియన్, మాజినీ, గారిబాల్డీ మున్నగు ప్రసిద్ధ పురుషుల నాబల్లపీటసంభాషణముల కాహ్వానించి యెన్నియో ప్రశ్న లడిగి వారిభావముల స్వీకరించ బ్రయత్నించుచుండెడివారట. నెపోలియన్, మాజినీ, గారి బాల్డీ, గాంధారీ ధృతరాష్ట్రులు మున్నగువారి సంభాషణములు పెక్కులు పత్రికలలో ప్రకటితములై యున్నవి.

శ్రీఅరవిందులకు హైందవసంబంధమైన తాత్త్విక

పరిచయము ప్రథమమున శ్రీరామకృష్ణ పరమహంస యొక్క వాక్యామృతములు, వివేకానందస్వామి రచనలు ఉపన్యాసములు, వీనిమూలమున కొంత ఏర్పడిన దనవచ్చును. ఆకాలమున పరమహంసపట్ల వీరికి ఆదరాభిమానములు తీవ్రముగానుండెను. వివేకానందుని ఎక్కువగా మెచ్చుకొనుచుండెడివారు. కాని స్వామి వివేకానందుల లక్ష్యముగాని తత్త్వముగాని ఆదర్శముగా గైకొనవారి కంతగా నచ్చలేదు. స్వతస్సిద్ధముగా తన్ను గుఱించి యపుడపుడు తనలో నిగూఢముగ స్ఫురించుచు వచ్చిన అసాధారణ జ్ఞానవిశేషములు శ్రీఅరవిందుల కింగ్లాండులోనే లీనముగ పొడసూప దొడంగినవి. కొంత యోగసాధన చేయుచుండిన తమ మిత్రులు దేశపాండ్యగారు ఇంగ్లాండులో నుండగనే వీరినిగూడ సాధనచేయ గోరిరి. కాని యప్పుడు తన యనుభూతికిని యోగమునకును సంబంధమున్నదని గుర్తించక వారిమాట కియ్యకొనలేదు. మఱియు యోగము నిత్యజీవనమునుండి విడదీసి ఏకాంతుని ఏకాకిని గావించి నివృత్తికి గొంపోవునని తలంచెడివారనదగును. ఇంగ్లాండులో ప్రారంభమైన ఆ విశిష్టానుభూతులు ఇండియాలో కాలుమోపినంతనే మఱింత ప్రబలముగా నావిర్భవింప మొదలిడెను.

కాని ఇంతవఱ కంతర్గతమైయున్న ఆధ్యాత్మిక రాజకీయ తృష్ణ రూపుదాల్చి వారియందు నూతన పరివర్తనము గలిగింప నారంభించినది బరోడా యందే యని చెప్ప నగును. స్వాతంత్ర్యతృష్ణతో పరితపించు దేశారాధకుల, పెనవేసికొని జడలుగట్టిన శిరోజములతో ఏ నదీతీరము నందో పర్వత కాంతారములందో యోగాభ్యాస మొనర్చు సాధువుల, యోగుల పరిచయ మిచ్చుటనే ఎక్కువగా నేర్పడినది. నిజమైన సాధుపుంగవులను, తపోధనులను, యోగీశ్వరులను దర్శించి యోగ రహస్య ములను యోగ మహాత్మ్యములను నెఱుంగవలయునను పిపాస ఇచ్చుటనే ప్రబలమైనది. తదర్థమై పరిసర ప్రాంతము లందున్న యోగులవిషయమై అన్వేషించుచుండెడివారు. పలుమారు నర్మదాతీరమున నుండిన యోగి బ్రహ్మానంద స్వామిని దర్శించుటకు దేశపాండ్యాగారితో వెళ్ళుచుండి రట. ఈ యోగిమహత్త్వ మసాధారణము నపారము. వారిజన్మకాల మేదియో వారివయ స్సెంతో తెలియదు గాని అప్పటికి రెండువందల సంవత్సరములకు పైగా నర్మదా నదీతీరముననే తపస్సు చేసికొనుచుండినట్లు శ్రీఅరవిందు లొకసందర్భమున వెల్లడించియున్నారు. ఈ మహాయోగి నివసించు ప్రదేశమును 'ఛందోద్'

ఆశ్రమ మని పిలుచుచుండిరి. ఒక సాయంసమయమున శ్రీఅరవిందు లచ్చటికి వెళ్ళియుండగా ధురంధరులనువా రొకరు తీవ్ర జ్వరముతో బాధపడుచుండినట్లును, ఆ విషయ మెఱింగి బ్రహ్మానందస్వామి తన శిష్యుడగు కేశవానందుని మందీయవలసినదిగా నాదేశించినట్లును, అతడు వెంటనే ప్రవహించు నర్మదానదినుండి నిర్మలోదకమును గిన్నెడు తెచ్చి రోగికీయగా పావుగడియలో జ్వరము పలాయనమై అతడు స్వస్థత గాంచినట్లును దెలియుచున్నది. బ్రహ్మానందస్వామి నిరంతర మంతర్ముఖులై యుందురు. అరుదుగా సంభాషించునప్పుడైన శిరము వంచియే యుంచెదరు గాని తలయెత్తిచూచుట మిక్కిలి యపురూపము. అట్టి యోగిపుంగవు డొకపర్యాయము శిర మెత్తి శ్రీఅరవిందుని తేరిపారఁ దదేకదృష్టి నిగుడించి చూచిరనియు ఆదృష్టి ప్రసారమహత్త్వమే శ్రీఅరవిందునియం దంతర్గతమై యుండిన ఆధ్యాత్మశక్తికుజ్వలనము గలిగించి పరివర్తనమందించెననియు తెలిసినవారొకరు వ్రాసియున్నారు. ఈ యుజ్జ్వలనమే ౧౯౦౮-వ సంవత్సరారంభమున విష్ణుభాస్కర లేలే యనునొక మహారాష్ట్ర యోగిమూలమున మఱింత ప్రకాశించినది.

శ్రీఅరవిందులకు రాచకీయసంబంధము విద్యార్థి

దశనుండియే యున్నను బరోడాలో ౧౯౦౨-వ సంవత్స రమునుండియే యది మఱింత ప్రవర్ధమానమైనదని యూహించవచ్చును. ఉద్యోగమునందున్నందున ప్రత్యక్షముగా రాజకీయ సభావేదికలపై నెక్కి పాల్గొనకున్నను పెక్కు దేశీయ మహాసభలకు ప్రేక్షకులుగా వెళ్ళుచుండెడివారనియు, కొన్ని సందర్భములలో చాటున సలహాలొసంగి సాయపడుచుండెడివారనియు, సెలవులలో వంగదేశము వెళ్ళుచు నచ్చటి రాజకీయవ్యవహారముల బరిశీలించుచుండెడివారనియు దెలియుచున్నది. రాజకీయదృష్టియే మొట్టమొదట యోగాభ్యాసమునకు ప్రేరేపించినదేమో యని యనుమానించుట నిరాధారము కాజాలదు. శ్రీరామకృష్ణ పరమహంస సెలవిచ్చినట్లు యోగస్వీకరమునకు నానామార్గములను భగవంతుడు సూచించుచుండును. కొందఱు రాజమార్గమున ముఖద్వారమున బ్రవేశించుటయు మఱికొందఱు ప్రక్కవాటుగా పార్శ్వద్వారమున జొరబడుటయు గలదు. ఎట్లయిననేమి దేవాలయ గర్భగృహమునందు జేరుకొనుటయేగదా ప్రధానము. శ్రీఅరవిందులు తొలుదొల్త కొంతవఱకు కర్మార్థి యయియే—యోగమందు తపస్సునందు మానవాతీతమైన మహత్తమశక్తి గలదని

యు ఆ దివ్యశక్తిని, ఆధ్యాత్మికశక్తిని గడించి తత్సాహాయ్యమున మాతృదాస్య బంధముల ద్రెంచివేయనగునను ఉద్దేశ్యము తోడనే - యోగాభ్యాసమున బ్రక్కదారిని బ్రవేశించినట్లు ఒక సూచన గలదు. మహాపురుషులపట్ల మహా సంఘటనముల యందు భగవాను డిట్లు నిమిత్తమాత్రములగు కారణముల సంఘటిల్ల జేయుట మనము పలుమారు గాంచుచున్నాము.

నాడు దేశమును, ముఖ్యముగా వంగదేశము, నావరించియుండిన రాజకీయ వాతావరణము నిట స్థాలీపులాక న్యాయముగా గొంత స్మరించుట యప్రస్తుతము కాజాలదు. కాలపరివర్తనమున నేమి, దేశీయ మహా సభాసమావేశములందు బ్రకటించబడుచుండిన విషయ పరిజ్ఞానమున నేమి, ఆంగ్ల భాషా ప్రచారము కొంత విస్తరించి పాశ్చాత్య దేశీయులు తమ దేశస్వాతంత్ర్యమునకు బోరాడిన కథానకముల వర్ణించిన స్టూవర్టు మిల్లు, మాజినీ, గారిబాల్డీ మున్నగు స్వాతంత్ర్యాభిలాషుల గ్రంథపఠనమున నేమి, ఐరిష్ జాతి నాడు స్వాతంత్ర్య సమరమున జూపుచుండిన త్యాగదీక్ష వలన నేమి, ప్రకృతిసిద్ధములైన స్వాతంత్ర్యవాసనలు చల్లగా దేశమున నల్లుకొన నారంభించెను. అంతకుముందే రష్యా దేశమును

సంగ్రామమం దవలీలగా నోడించిన జవాను[illegible] దుందుభులు శ్వేతవర్ణులజేయులు, నతీతులు నమి[illegible] విధ్వంస మొనర్చుచుండెను. ఋషి బంకించంద్రుని 'ఆనంద మఠము', 'దుర్గేశనందిని' మున్నగు గ్రంథముల లోని స్వాతంత్ర్య వీరావేశ భావములు కొంత కదలిక పుట్టించుచుండెను. వీని యన్నింటికన్న ప్రభుత్వపరిపాలనా విధానమే, నాటి నిరంకుశాధికారులే, 'నావిష్ణుః పృథివీ పతిః' యను విశ్వాసముతో రాజభక్తికి పేరుమోసిన భారతీయులను పలువిధముల పీడించి రెచ్చగొట్టెను భావము వంగదేశమునం దంతటను వ్యాపించెను. నాటి రాజప్రతినిధి యగు కర్జన్ ప్రభువు తన యసమాన శేముషీ శక్తిసామర్థ్యముల నన్నింటిని దేశీయపీడనమునకు వినియోగింప నారంభించెను; 'రిప్పన్' ప్రభువు నాడు నెలకొల్పిన స్థానిక (మునిసిపల్) పరిపాలనా పద్ధతికి వ్యతిరేకముగా కలకత్తా మునిసిపల్ పరిపాలనమును విధ్వంస మొనర్చెను. విక్టోరియా మహారాజ్ఞి వాత్సల్యముతో ప్రసాదించిన ఉదార ప్రకటనమున కపార్థము గావించి భారతీయుల కాశాభంగము గావించెను. 'సత్యం వద' యను శ్రుతివాక్య ప్రమాణమునకు కీర్తి తెచ్చిన భారత పుత్రులను, ఈ రాజనీతి తంత్రజ్ఞుడు,

ఒకానొక సందర్భమున నుద్యోగవాంఛవలననో పదవీ వ్యామోహముననో తన వయస్సును మఱుగుపఱచి ఎక్కువ వయస్సని బొంకిన ఈ స్వార్థపరుడు, అసత్య వాదు లని జంకు గొంకు లేక పరిహసించి యవమా నించెను. 'విభజించి పరిపాలించుము', 'చీలదీసి చెండా డుము' అను రాజనీతిని సంపూర్ణముగా గ్రహించి వంగ దేశీయు లందఱు నేక కంఠముతో 'వలదు వలద'ని బ్రతిఘటించి మొఱబెట్టుకొనినను నిర్లక్ష్యముగా నిరంకుశ ముగా వంగదేశమును రెండుభాగములుగా విభాగింప కృత నిశ్చయు డాయెను. దీనికి ప్రతీకారముగా ౧౯౦౫ ఆగష్టు నెల ౭-వ తేదీన వంగీయులందఱును మహాసభ లొనర్చి విదేశ వస్తు బహిష్కార వ్రతమును బూన నిశ్చయించిరి.

ఈ సమయముననే, అనగా ౧౯౦౫-ఆగష్టు ౩౦ వ తేదీన శ్రీఅరవిందులు బరోడానుండి తమధర్మపత్ని మృణాళినీదేవిగారికి వ్రాసిన అద్భుతలేఖలోని కొన్ని విషయముల నీక్రింద బొందుపఱచుచున్నాము. భారత మాత దాస్యస్థితికి వీ రనుభవించిన హృదయ పరివేదన, కేవల మాత్మశక్తితోడనే పశుబలము నెదుర్కొని జయముగాంచనగునను వీరి నమ్మకము, సర్వము మాత

కర్పించ వలయునను వీరి త్యాగదీక్ష, ఈశ్వర సాక్షాత్కారము నందితీరవలెనని వీరొనరించిన ప్రయత్నము, దేశోద్ధరణమను మహావ్రత సాధనమునకయి వీరి తమ్మిటాలోకమునకు భగవానుడంపెనను వీరియాత్మ విశ్వాసము ఇవన్నియు (శ్రీ) అరవిందులు వ్రాసిన ఈ యుత్తరము వలన ధ్వనించుననుట స్పష్టమగుచున్నది.

నాకు మూడు వెఱ్ఱులు గలవు. మొదటి వెఱ్ఱి ఇది: భగవంతుడు ఏ గుణము, ఏ ప్రతిభ, ఏ ఉచ్చశిక్షణము, విద్య, ఏ ధనము ఇచ్చెనో అదంతయును భగవంతునిదే. ఎంత భార్యాపుత్రాదుల భరణపోషణమునకై వలయునో మఱియు నెంత అత్యంత ఆవశ్యకమో అది మాత్రము వ్యయముచేయుటే తన యధికారమని, ఏది మిగులునో అది భగవంతునికే తిరిగి యీయవలయునని నాదృఢవిశ్వాసము. నేను గనుక సర్వమును నాకై, సుఖము కొఱకై విలాసముకొఱకై వ్యయము చేయుదునేని చోరుడను. హిందూశాస్త్రము చెప్పుచున్నది—ఎవ్వడు భగవంతుని కడనుండి ధనము కైకొని భగవంతునికీయడో అతడు చోరుడు. ఈవఱకు భగవంతునికై రెండణాలిచ్చి పదునాలుగణాలు స్వసుఖమునకై వ్యయముచేసి లెక్కలు సరిపెట్టి సాంసారిక సుఖమునందు మత్తుడనైయుంటిని. జీవితములో సగపాలు వృథాయైపోయినది. పశువు కూడ తనయొక్క, తన కుటుంబముయొక్క ఉదరమును పూరించి కృతార్థమగుచున్నది.

ఇన్నాళ్ళనుండియు నేను పశువృత్తియు చౌర్యవృత్తియు జేయుచుంటినని తెలిసికోగల్గితిని. తెలిసికొనినమీద మిక్కిలి యను

తాపము, నాపై నాకు హేయభావమును కలిగినవి. ఇక వలదు. ఆ పాపమును ఈ జన్మమునకెల్ల వదలివేసితిని. భగవంతుని కిచ్చుట యనగా నర్థము ధర్మకార్యములందు వ్యయముచేయుట. సరోజినీకి గాని ఉషకుగాని యిచ్చిన పైకము విషయమై నాకే యనుతాపము లేదు. పరోపకారము ధర్మము, ఆశ్రితుల రక్షించుట మహాధర్మము; కాని కేవలము అన్నదమ్ములకును అక్కచెల్లెండ్రకును ఇచ్చినంతనే లెక్కసరిపోదు. ఈ దుర్దినములందు సమస్తదేశమును నా ద్వారముకడ వేచియున్నది. నాకు ముప్పదికోట్లు సోదరీసోదరు లీ దేశమందున్నారు; వారిలో ననేకులు తిండిలేక చచ్చిపోవుచున్నారు, పెక్కుమంది కష్టముల చేతను దుఃఖముల చేతను జర్జరితులై ఏ రీతిగానో ప్రాణములతో మిగిలియున్నారు. వారికి హితము చేయవలయును.

*

* *

నా రెండవవెఱ్ఱి యిప్పుడే తల కెక్కినది, వెఱ్ఱితనమిది, ఏదో రీతిగా భగవంతుని సాక్షాద్దర్శనమును లభింపజేసికొనవలయును. నేటి కాలపు ధర్మము భగవంతుని నామము మాటమాటకును నోటితో నందుకొనుట, అందఱియెదుటను ప్రార్థనము చేయుట, నే నెంత మతనిష్ఠ కలవాడనో చూడుమని లోకులకు ప్రదర్శించుట! అది నాకు వలదు. ఈశ్వరు డుండెనేని అతని అస్తిత్వము ననుభవము చేసికొనుటకును, అతనిని సాక్షాత్కారము గావించుకొనుటకును ఏదో ఒక బాట యుండును; ఆ బాట యెంత దురత్యయముకానీ, దుర్గమముకానీ, దానినంటి పోవుటకు నేను దృఢసంకల్పము చేసికొని యుంటిని. హిందూ ధర్మము చెప్పు

చున్నది, నిజశరీరమునందు నిజమనమునందు ఆ బాటకలదు. బాటపై నడచుటకు నియమములు కూడ జూపించినది; అవన్నియును బరిపాలించుటకు మొదలిడితిని; ఒకమాసములో ననుభవమునకు దెచ్చుకోగలిగితిని. హిందూధర్మము చెప్పుమాట మిథ్యకాదు, ఎయే చిహ్నముల సంగతి చెప్పినదో ఆ యన్నిటియొక్క ఉపలబ్ధియు గల్గినది.

*

* *

నా మూడవ వెఱ్ఱి యిది: ఇతరజనులు స్వదేశము నొక జడపదార్థముగా, గొన్నిబయళ్లు, క్షేత్రములు, వనములు, పర్వతములు, నదులుగా ఎఱుగుదురు; నేను స్వదేశమును తల్లియని యెఱుగుదును, భజింతును, పూజింతును. తల్లియెదపై గూర్చుండి ఒకరక్కసి రక్తపానము చేయగడగినచో గుమారు డేమిచేయును? నిశ్చింతభావముతో భుజింప గూర్చుండునా, భార్యాపుత్రాదులతో ననురక్తిజెందుచుండునా, లేక తల్లిని నిష్పీడితజేయుటకై పరుగిడునా?...... నే నెఱుగుదును, ఈ పతితజాతి నుద్ధరించుటకు బలము నాయందుగలదు, శారీరకబలము కాదు—కత్తిగాని తుపాకిగాని చేకొని నేను యుద్ధము చేయబోవుటలేదు—జ్ఞానబలము. క్షత్రి తేజ మొకటి మాత్రమే తేజముకాదు; బ్రహ్మతేజముగూడ గలదు, ఈ తేజము జ్ఞానమున బ్రతిష్ఠితము. ఈ భావము నూతనముకాదు, ఈ నాటిదికాదు, ఈ భావముతోడనే నేను జన్మించితిని, ఈ భావము నాకు మజ్జాగతము. భగవంతుడు ఈ మహావ్రతము సాధించుటకు నన్ను పృథ్విపై బంపినాడు. *

---

* 'శ్రీఅరవింద లేఖలు' అను గ్రంథము నుండి

తుదకు ౧౯౦౫-అక్టోబరు ౧౬-వ తేదీన వంగ దేశ విభజనము శాసనమై యమలులోనికి వచ్చెను. ఈ విభజనమును రద్దు గావించి తీరవలయునని 'రక్షా' బంధనము ధరించి దీక్ష వహించని వంగీయుడే లేనంతటి తీవ్రోద్రేక ముదయించెను. ఈ యుద్రేకమే నూతనోద్యమముగా రూపుదాల్చి ఆర్యావర్తనమున కంతకు నెగబ్రాకినది. ప్రజలు తమ వ్యతిరేకాభిప్రాయములను నానారూపముల వెల్లడించుకొలదియు ప్రభుత్వమువారు నిర్బంధ శాసనములను బ్రయోగింప నారంభించిరి. శ్రీ అరవిందు లీసమయమున నాటి స్థితిగతుల యథార్థరూపమును స్వయముగా నెఱుంగుటకు వంగదేశమునకు వచ్చియుండిరి. ప్రభుత్వమువారే సంకల్పముతో వంగ దేశమును రెండుగా విభజించి విడగొట్టినను ప్రజలలో మాత్రము తీవ్ర ప్రతిక్రియ లొనర్చుటకు కని విని యెఱుంగని యేకీభావ మేర్పడినది. అందుననే మితవాద నాయకుడగు గోపాలకృష్ణగోఖలే యాధిపత్యమున కాశీ పట్టణమున ౧౯౦౫-వ సంవత్సరము డిశంబరు మాసమున, సమావేశమైన దేశీయ మహాసభయందు ప్రభుత్వమువారి నిర్బంధ చర్యలను ఖండించుచు 'వంగదేశమును విభజించిన విపరీతచర్య కా స్థితిలో ప్రతీకార

ముగా వంగీయు లవలంబించిన బహిష్కారోద్యమము న్యాయము సమర్థనీయము'నను తీర్మాన మేకగ్రీవముగా నంగీకృతమైనది. దేశమంతయు ప్రతిదినమును సభల తో తీర్మానములతో నిండిపోయెను. వందేమాతరమను ధ్వనులు మిన్నుముట్టు చుండెను. బహిష్కారాయుధ ప్రయోగము ముఖ్యముగా బారిసాల్ మండలమునందు విషమస్థితిని దెచ్చిపెట్టినది. ఆ సమయమున, ౧౯౦౬-వ మార్చిలో, నచ్చట సమావేశమైన వంగరాష్ట్రీయ మహాసభ అధికారుల ఆగ్రహమునకు బలియైనది. ప్రతినిధులను సేవాదళమును పలువుర నధికారులు లాఠీలతో ప్రహరించిరి. మండలాధికారి యగు ఎమర్సన్ దొర సురేంద్రనాథు నంతటి మితవాదిని 'వంగదేశము నకు కిరీటములేని చక్రవర్తి' యని బిరుదమందిన నాయ కుని అవమానపఱచి, పై పెచ్చు కోర్టుధిక్కారమను దోషారోపణ మొనర్చి రెండువందల రూప్యముల యప రాధమును విధించెను. ఆ సభకు బారిసాలు వెళ్ళియుండి యీ భీభత్సప్రదర్శనము స్వయముగా జూచివచ్చిన శ్రీఅరవిందులు బరోడాలో నొక బహిరంగోపన్యాస మునందు నాటి విషమస్థితిని వివరముగా వెల్లడించి యుండిరి. దేశీయులు కన్నతల్లిని 'వందేమాతర' మని

ఎలుగెత్తి స్మరించుటయే నమస్కరించుటయే నేరముగా పరిగణింపబడెను. విద్యార్థులు సభలకు వెళ్ళరాదని నిషేధపు టుత్తరువులు సృష్టింపబడెను. ఈ విషాదదృశ్యమును గన్నులార జూచిన శ్రీఅరవిందులకు, వంగదేశమున గొదవిన యుత్పాతము, అపు డుద్భవించిన నూతనోద్యమము కేవలము పాలిత పాలకజన సంఘర్షణోద్భవము గాక ఈశ్వర నిర్దేశమనియే స్ఫురించినది. ఆధ్యాత్మిక దృష్టితో ప్రబోధితుడైన శ్రీఅరవిందులకు వంగమాత యాక్రందనము తన కాహ్వానమయి హృదయవిదారణము గావించినది. హృదయమం దుద్భవించిన 'తల్లి యాహ్వానము నందుకొని సేవచేయుము' అను అంతర్వాణి యాదేశము నాలకించి కాబోలు ౧౯౦౬-జూలై నెలలో శ్రీఅరవిందులు బరోడా కళాశాలలోని తొమ్మిదివందల రూప్యముల మాస వేతనముతో నున్న ఉపాధ్యక్ష పదవిని తృణప్రాయముగా త్యజించి వంగదేశమునకు వచ్చి చేరిరి!

ఎప్పటి నుండియో, భరతఖండమును మాతగా, దేవతగా, శక్తిస్వరూపిణిగా బూజించి సేవించెడి శ్రీఅరవిందుల కీ త్యాగము నిజముగా తృణప్రాయమే. తమ్ములు బరీంద్రకుమారులు, ౧౯౦౩-లో కాబోలు, 'ఉద్బోధినీ'

పత్రికయందు ప్రకటించిన వ్యాసములనుబట్టి ఈ క్రింది విషయములు తెలియుచున్నవి. శ్రీఅరవిందులకు బరోడా యం దుండినపుడే శక్త్యుపాసనయందు భక్తివిశ్వాసము లుదయించియుండెను. బంగారుతో చేయబడిన 'బగలా మూర్తి' విగ్రహము నొక దానిని తమయింట నుంచు కొనినట్లు, ఒడలంతయు విభూతినలముకొని జడధారియైన యొక తపస్వి, యోగి తమ గృహమునకు వచ్చి యా మూర్తిని బూజించుచు, సంస్కృతశ్లోకముల బఠించుచు ధ్యాన మొనర్చు చుండినట్లు వివరింపబడినది. ఆమూర్తి యాకార మతి భీకరము, స్థూలము; అది పీతవర్ణ, పీతాంబరధారిణి. ఒకహస్తమున ముద్గరము, పాశము, మరొక హస్తమున శత్రువును గదాఘాతమున బరిపీడితుని జేయుచు వాని జిహ్వాగ్రమును ధరించియుండెను.

బరోడా రాజ్యమునుండి వంగదేశమునకు రానున్న సమయమునందే శ్రీఅరవిందులు 'భవానీ మందిరము' నొకదానిని కొండల మధ్య నందఱకు నందరాని రహస్య ప్రదేశమున నెలకొల్పదలంచి యుండి నట్లు, ఆ విషయమును గుఱించి వివరముగా 'భవానీ మందిర' మను పేరుతో చిన్న కరపత్రమును రచించి నట్లు, దానిని తాను ముద్రించినట్లుకూడ వరీంద్రుడు

వ్రాసియున్నాడు. 'ఆనంద మఠము' ను యనుసరించినను, కేవలము రాజకీయదృష్టితో గాక ఆధ్యాత్మిక దృష్టి తోడనే దేశమునకై సర్వము నర్పించి, సంసిద్ధులై వచ్చిన యువకబృందమున కచ్చట శ్రీ అరవిందుల శిక్షణమొసంగ నుద్దేశించి యుండిరట.



*

# శ్రీ అరవింద జీవితము



## మూడవ తరంగము

### జాతీయ విద్యాసంఘము—తత్సంబంధము

వంగదేశము నావరించుచుండిన నూతనోద్యమము, అందు నెలకొన్న నిరంకుశ పరిపాలనము వీనిసంఘర్షణ సంజనితములగు స్వదేశీ-బహిష్కారములను సమగ్రముగా సాగించుటకు, ప్రభుత్వ పాఠశాలలకు ప్రత్యామ్నాయముగా జాతీయవిద్యాలయములను నెలకొల్పవలయు నను సంకల్పము జాతీయవాదుల కుదయించి తత్ప్రయత్నము లారంభమాయెను. ప్రభుత్వ విద్యావిధాన మిహ పర సాధనముగాక కేవలము విదేశప్రభుత్వమున కూడిగము చేయుటకు వలయు నుపకరణములను తయారుచేయు ఖార్ఖానాలుగా విద్యాలయములను పరిణమింప జేయుచున్నదను భావము వ్యాపింపజొచ్చెను. విద్యావంతుల కుద్యోగములిచ్చి తృప్తిపఱుపజాలకయో, జీవనాధారము

లేక యాశాభంగముతో, తన్కాలమున గలుగు ద్వేషభావముతో, ప్రభుత్వము వారిపై దేశీయుల నుసి కొల్పుచున్నా రని, విద్యావంతులను శాంతపఱచి యూరడించి సానుభూతి నందుటకో, మతేకారణము చేతనో, నాటి ప్రభుత్వవిద్యావిధానము లోపభూయిష్ఠ మనియు పరివర్తన మవసరమనియు ప్రభుత్వోద్యోగులు గూడ విమర్శించుట పరిపాటియైనది, గాని, జాతీయ వాదులు మాత్రమే విజాతీయ విద్యావిధానము వలని యనర్థములను గుర్తించి తన్నివారణోపాయముల నరయ నారంభించియుండిరి.

చరిత్రము, శాస్త్రము, సర్వము ఆంగ్లభాషయందు బోధించుట కాలహరణ మని, చిరుతవయస్కు లగు విద్యార్థుల మనోబుద్ధులు శారీరపాటవములు నశించి యెందుకును గొఱగాకపోవుచున్న వని, మాతృభాషల లోనే విద్యాబోధన మొనర్చవలెనని, పక్షభేదములు లేక దేశీయు లందఱు నంగీకరించసాగిరి. ఇందులకు తోడు విద్యార్థులు రాజకీయసభలకు బోరాదను నిషేధపు టుత్తరువులు తీవ్రరూపము దాల్చినవి. ఈవిషయమై వంగ ప్రభుత్వ కార్యదర్శియగు కార్లైల్ దొర గారు రహస్యపు తాఖీదులను మండలాధికారులకు

బంపుటయు, రంగపూరు మండలాధికారి యా మండలము లోని యున్నత పాఠశాల విద్యార్థులు రాజకీయసభలకు హాజరైరని ఎనుబది యాఱుగురు విద్యార్థులకు ఐదేసి రూప్యములవంతున నపరాధము విధించుటయు, నంత నా పాఠశాలలోని బాలు రందఱును సుమారు మూడు వందలమంది సమ్మె కట్టుటయు, దత్ఫలితముగా నాలు గైదు దినములలోనే మొట్టమొదటి జాతీయపాఠశాల స్థాపిత మైన దను అసమాన గౌరవ మా మండలము నకు దక్కుటయు నాటి రాజకీయ చరిత్రను దిలకించిన తెలియగలదు. ఉడుకు రక్తముతో నుత్సాహోద్వేగ ములతో సభలకు హాజరైన బాలురను విద్యార్థులను నానావిధముల శిక్షించి, తుదకు వారి భావిజీవితముకే భంగము గలుగునట్లు ప్రభుత్వ పాఠశాలలో ప్రవేశించి విద్యాభ్యాసము చేయరా దను కఠినశాసనము గావించి పాఠశాలలనుండి వెడలగొట్టుట ఆరంభమాయెను. ఇ ట్లెందరో వందలకొలది వెడలగొట్టబడిన విద్యార్థు లూరక తిరుగాడుట దేశానర్థదాయక మగునేమోయని పెద్దలందఱును గుర్తించిన ఫలమే జాతీయవిద్యాసంఘ స్థాపనము. సర్ గురుదాస బెనర్జి, రసవిహారిఘోషు, భూపేంద్రనాధబోసు, డాక్టరు నీలరత్నసర్కార్ మున్నగు

ప్రముఖులు సుమారు ముప్పదిమంది పరిపాలనా సంఘ సభ్యులై సంఘోద్దేశ విధానములను దెలుపుచు ప్రణాళికను బ్రకటించిరి. కలకత్తాలో జాతీయ కళాశాలను ౧౯౦౬-నవంబరు ౧౭-వ తేదిని స్థాపించిరి. ఈ కళాశాలకు ప్రధానాచార్యులుగా నుండి సాయపడవలసినదిగా బై విద్యాసంఘమువారు శ్రీఅరవిందుల నాహ్వానించిరి. భరతమాత సేవ చేయుటకే సర్వము త్యాగమొనర్చి సిద్ధముగానుండిన శ్రీఅరవిందులు, నేటిబాలురే విద్యార్థులే నిజమైన జాతీయవిద్య నభ్యసించి తన్మూలమున విజ్ఞానవంతులై శక్తిమంతులై దేశభక్తులై మాతృదేశము నుద్ధరించు భావిపౌరులు గాగలరని విశ్వసించుచుండిన శ్రీఅరవిందు లీ యాహ్వానమును వంగమాత యాదేశముగా నంగీకరించి యత్యల్ప గౌరవభృతితో-డెబ్బదైదు రూపాయలని పేరు, అదియు సాంతముగా స్వీకరించినట్లు లేదు-ఆచార్యపదవిని స్వీకరించిరి.

సుబోధచంద్రమల్లిక్ ప్రప్రథమమున, తా నంత శ్రీమంతుడు గాకున్నను, లక్షరూపాయ లా విద్యాసంఘమున కిచ్చి మార్గదర్శి యాయెను. మఱొక శ్రీమంతు డిరువదివేల వార్షికాదాయము లభించు స్థిరచరాస్థులను సమర్పించెను. వేఱొక శ్రీమంతుడు

రెండు లక్షల రొక్కమును కలకత్తాలో నొక దివ్య భవనమును దాన మొనర్చెను. ఇట్లు శ్రీమంతు లుదారులై భూరి విరాళము లొసంగుటవలన సంవత్సర మునకు ఏబదివేల రూపాయ లాదాయము వచ్చు మూలధనమేర్పడి విద్యాసంఘమున కార్థికబలము చేకూరినది. కాని శ్రీఅరవిందుల సేవాభాగ్యము మాత్ర మా కళాశాల కెక్కువకాలము లభించినదికాదు. విద్యా సంఘమును పాలించు నధికారము కైవశము చేసికొనిన మితవాదులకును-విజాతీయవిద్య నభ్యసించి ప్రభుత్వో ద్యోగమునందు పాశ్చాత్య వ్యామోహమునందు బుట్టి పెరిగిన పెద్దలకును-శ్రీఅరవిందులకును ఆదర్శవిధానము లందు భిన్నభావము లేర్పడి పొత్తు కుదిరినదికాదు. ఆధ్యాత్మికముగానేమి భౌతికముగానేమి ప్రపంచమునకు నాయక మణిగా నుండిన భరతమాతయొక్క తొల్లింటి వైభవస్వరూపమును హృత్పీఠమున జిత్రించుకొని యూహాగానము చేసినది జాతీయవాదులు. విజాతీయ సంపర్కమువలన నానావిధముల చెడి, దాననేర్పడిన దేశ దారిద్ర్యమునకు భావదాస్యమునకు దురపిల్లి, దేశ మును పునరుద్ధరించుటకు దీక్షవహించి సర్వము త్యాగ మొనర్చి బలిగా నిశ్చయించినది జాతీయవాదులు.

రెండు లక్షల రొక్కమును కలకత్తాలో నొక దివ్య భవనమును దాన మొనర్చెను. ఇట్లు శ్రీమంతు లుదారులై భూరి విరాళము లొసంగుటవలన సంవత్సర మునకు ఏబదివేల రూపాయ లాదాయము వచ్చు మూలధన మేర్పడి విద్యాసంఘమున కార్థికబలము చేకూరినది. కాని శ్రీఅరవిందుల సేవాభాగ్యము మాత్ర మా కళాశాల కెక్కువకాలము లభించినదికాదు. విద్యా సంఘమును పాలించు నధికారము కైవశము చేసికొనిన మితవాదులకును-విజాతీయవిద్య నభ్యసించి ప్రభుత్వో ద్యోగమునందు పాశ్చాత్య వ్యామోహమునందు బుట్టి పెరిగిన పెద్దలకును-శ్రీఅరవిందులకును ఆదర్శవిధానము లందు భిన్నభావము లేర్పడి పొత్తుకుదిరినదికాదు. ఆధ్యాత్మికముగానేమి భౌతికముగానేమి ప్రపంచమునకు నాయక మణిగా నుండిన భరతమాతయొక్క తొల్లింటి వైభవస్వరూపమును హృత్పీఠమున జిత్రించుకొని యూహాగానము చేసినది జాతీయవాదులు. విజాతీయ సంపర్కమువలన నానావిధముల చెడి, దాన నేర్పడిన దేశ దారిద్ర్యమునకు భావదాస్యమునకు దురపిల్లి, దేశ మును పునరుద్ధరించుటకు దీక్షవహించి సర్వము త్యాగ మొనర్చి బలిగా నిశ్చయించినది జాతీయవాదులు.

వీరి మనోభావములం దుండియే యుద్భవించి, వీరి నిరంతర ప్రయత్నము వలననే రూపు దాల్చిన జాతీయ విద్యాసంఘమునందు తమ యాదర్శానుగుణముగా వ్యవహారముల నిర్వహించుటకు స్వాతంత్ర్యము లేకపోవుటయు ధనవంతులను కారణముచే జాతీయవిద్యాస్వరూపమునే యెఱుంగని ఇతరులు సర్వాధికారము చెలాయింపఁ బూనుటయు సంభవించినది. స్వాతంత్ర్యమును గోల్పోయిన దేశమం దిట్టి విషమదశ పరిపాటి యగుటలోనే వింతయు లేదు.

శ్రీ అరవిందుల జాతీయవిద్యాదర్శము మహత్తమమైనది. వేదకాలపునాటి 'విద్యా' పద నిర్వచనమున కనుగుణమై, ఆధునిక భౌతికప్రపంచ విజ్ఞాన సమ్మిళితమై, భుక్తి ముక్తిదాయకమై యమోఘమైనది. అంతస్స్థితమై యున్న ఈశ్వరత్వమును బాహ్యజీవితమందు ప్రస్ఫుటమొనర్చి భగవల్లీలా విలాసమును బరిపూర్ణ మొనర్చుటయే విద్యవలన మహత్తమ ప్రయోజన మని శ్రీ అరవిందులు వెల్లడించియున్నారు. జాతీయవిద్య, జాతీయ విద్యాపద్ధతులను గుఱించి శ్రీ అరవిందు లా కాలమున రచించిన వ్యాసములను బఠించినవారికి వారి యాదర్శ విధానములు తెలియగలవు. ఆ వ్యాసము లిపుడు గ్రంథ

రూపమున వెలువడియున్నవి. జాతీయవాదులు ప్రభుత్వ పాఠశాలలకు ప్రత్యామ్నాయముగా జాతీయ పాఠశాలలుండవలయు నని సంకల్పించగా విద్యాసంఘములోని మితవాదులయొక్క ప్రభుత్వాధికారులయొక్క యాగ్రహమునకు గుఱియగుదుమేమో యను భయ సందేహములతో ప్రభుత్వ విద్యావిధానములోని లోపములను కొంతవఱకు తొలగించి, ప్రభుత్వ విద్యాలయముల కుపాంగములుగా దోహదములుగా నివి నుండవలయు నని వీరు నిశ్చయించిరి. వేయేల, తమ యాదర్శవిధానముల నన్నింటిని ప్రభుత్వమువారి కోపానలమునకు బలిగాకుండునట్లును, నాటి యొదుదుడుకు లుపశమించిన తరువాత నెప్పటికైనను ప్రభుత్వసంబంధ మేదో యొకవిధముగా సాధించి వారి డిగ్రీల నందుటకు వీలుగా నుండునట్లును కుదించి తగురీతిగ మార్చి జాతీయ విద్యను నేతి బీరకాయగా నామావశిష్టము గావించ నెంచిరి. ఈ స్థితిలో శ్రీఅరవిందులకు బరోడా కళాశాలలో నాంగ్లము, చరిత్రము బోధించుచుండినట్లే యిచ్చటను బోధించుట తప్ప తన యున్నతభావములకు విధానములకు ననురూపముగా వ్యవహారములను తీర్చిదిద్దుటకు వీలయినదికాదు. అందువలన వా రచిరకాలములోనే ఆచార్య పదవినుండి

విరమించి కళాశాలా సంబంధమును విసర్జించుకొనిరి.

కళాశాల విద్యార్థులకు నచ్చుటి అధ్యాపక వర్గమునకు వీరి యాచార్యత్వమును నాయకత్వమును గోల్పోవుట సంతాపకరమైనది. అపుడు విద్యార్థులు సమావేశమై శ్రీఅరవిందులను తమకు హితోపదేశ మొసంగుడని వేడుకొనిరి. అదియే వీడుకోలుసభ. అపుడు శ్రీ అరవిందు లొసంగిన ఉపన్యాసనుండి కొంతభాగము సంగ్రహముగా నిట నుల్లేఖించు చున్నాము.

నా యుద్యోగమును వదలుకొనిన విషయము మీకందఱకును దెలియును. ఈ సందిగ్ధసమయమున నాకేమో కష్టములు రానున్నవని భయపడుచు నిన్నటి మీసభలో నాపట్ల సహానుభూతిని వెల్లడించుచు తీర్మానించియున్నారు. రానున్న కష్టములను కష్టములుగా నేను పరిగణింపను. ఏలయన, నా బాల్యమునుండి నాపై వేసికొనిన నాకర్తవ్య నిర్వహణములో నాకిపుడు రానున్న కష్టానుభవము తప్పనిసరి యని పూర్వ మెన్నడో గుర్తించినదే. అందున నే నేవిచారమును నందక దాని నందుకొనుచున్నాను.

నాకష్టములలో మీ సహానుభూతి నాపట్ల గలదనిగాదు మీరు రూఢిగా బల్కవలసినది. ఏకార్యమును సేవించుటలో మీరనుకొను కష్టముల నే ననుభవింపబోవుచున్నానో ఆకార్యముపట్ల ఆ ఉద్యమముపట్ల మీకు సహానుభూతి యున్నదని నమ్మకముగా మీరు పల్కుటయే నేను గాంక్షించునది. ఈ యుద్యమము నిపు

డిపుడే మేల్కొను మీతరమువారు పైకొని నిర్వహించుదురని నాకు తెలియునేని, నే నెచ్చటికేగినను, నా కార్యనిర్వహణమును మీరు స్వీకరింతురని ఎఱుంగుదునేని నే నేమాత్రము పరితాపము జెందకుండ ఆ కష్టముల ననుభవింప దొఱంగెదను.

*
* *

ఏకార్యమునకు, ఏయుద్యమమునకు ఈ కళాశాల స్థాపితమైనదో దానిని నిర్వహించుడను హితవును మాత్రమే మీకిపుడు నే నియ్యగలది. ఈసరికి ఈ యుద్యమమేమైనది మీ రందఱును గ్రహించినా రనుటలో నాకే సందేహమును లేదు.

*
* *

ఏదో మీకు కొంత విషయజ్ఞానమును మాత్ర మొసంగుట, కేవలము జీవనోపాధికి మీ కవకాశము గలిగించుట గాదు మే మిచ్చట అపేక్షించునది. ఆవైన పనిచేసి కష్టము లనుభవించగల కొమరులను దేశమాతకొఱకు సృష్టించుట, ఇదియే మే మిచ్చట గాంక్షించునది. అందుకొఱకే ఈ కళాశాలను మేము నెలకొల్పితిమి. మిమ్ము గోరునది ఇకమీద మీ రా కార్యమునకే గడంగుడని.

*
* *

ఒక జాతి చరిత్రలో ఒక కార్యమును, ఒకలక్ష్యమును దైవము నిర్దేశించు ఘట్టములు, సమయములు గలవు. తక్కినవి యెంత మహత్తరములైనను, ఘనకార్యములైనను పరిత్యజించి ఆ యొక్కదానికే సర్వస్వము ధారపోయవలయును. అట్టిసమయమే

మన దేశమాత కిపు డాసన్నమైనది.ఆమె సేవకంటె ప్రియతరమైనది యేదియు లేదు. ప్రతిదియు తత్సిద్ధికే వినియోగించవలెను. మీరు చదువునట్లయిన ఆమెకొఱకే విద్యను గడించుడు. మీ ఆత్మను మనః ప్రాణశరీరములను ఆమెసేవ నిమిత్తమే సాధనచేసి పెంపొందించుడు. ఆమె కొఱకై మను నిమిత్తమే మీరు జీవనోపాధి నార్జించుడు. జ్ఞానార్జనములో దేశమునకు తిరిగివచ్చి ఆమె సేవ చేయుటకైయే మీరు దేశమువిడిచి విదేశములకు వెళ్ళుడు. ఆమె సంపదభివృద్ధికై పనిచేయుడు. ఆమె సంతృప్తికైయే కష్టముల ననుభవించుడు. ఈ హితోపదేశ మొక్కటియందే సర్వ మిమిడి యున్నది.

## 'వందేమాతరం' పత్రికాసంబంధము

ఆనాడు జాతీయపక్షమున దినపత్రిక లంతగా లేవు. తిలక్ లోకమాన్యుని 'కేసరి' యను మరాఠీ వార పత్రిక యొక్కటియే జాతీయవాద పక్షమును సంపూర్ణముగా నామోదించి ప్రచార మొనర్చుచుండినట్లు కన బడుచున్నది. నూతనోద్యమ సిద్ధాంతవిధానములను వెల్లడించుటకు, జాతీయ పక్షమున దేశమందంతటను ప్రచారము గావించుటకు ఆంగ్లమున దినపత్రికను స్థాపించవలసిన అవసర మేర్పడినది. అంతకుముందు కొలది దినముల క్రిందటనే బ్రహ్మబాంధోపాధ్యాయ స్వాములను ప్రతిభాశాలి, త్యాగమూర్తి, జాతీయవాది

యగు విపినచంద్రుని సాయముతో 'వందేమాతరం' అను వార పత్రికను స్థాపించియుండిరి. జాతీయపక్షనాయకు లగు తిలక్ లోకమాన్యుడు, శ్రీఅరవిందులు, అశ్వినీ కుమారదత్తు, సుబోధ చంద్రమల్లిక్ మున్నగువారు సుబోధచంద్రమల్లిక్ గారి గృహమందు సమావేశమై, నూతనముగా స్థాపితమైన ఆ 'వందేమాతరం' పత్రికనే జాతీయపక్షపరమున, జాయింటుస్టాక్ కంపెనీని స్థాపించి, ఆ సంఘమువారు దినపత్రికగా నిర్వహించవలయు ననియు, ఆ కంపెనీ మ్యానేజింగు డైరెక్టరుగా తత్పత్రికా ప్రధాన సంపాదకులుగా శ్రీఅరవిందులే యుండవలయు ననియు తీర్మానించిరి. శ్రీఅరవిందుల సంపాదకత్వమున వెలువడ నారంభించినది మొదలు 'వందేమాతరం'పత్రిక పత్రికాప్రపంచమున కని విని యెఱుంగని నూతన వాతావరణమును కలిగించ నారంభించెను. ఆ సేతు హిమాచల ఆర్యావర్త దేశమందేకాక పాశ్చాత్య దేశమందును తన దివ్యసందేశములను ముక్తకంఠముతో ననుదినము గానమొనర్చుచు నది వ్యాప్తిగాంచుచుండె ను. శ్రీఅరవిందులు జాతీయకళాశాలలో నే యేబది యఱువదిమంది విద్యార్థిబృందమునకో జాతీయ ధర్మ సూత్రముల నేర్పుటకు బదులు అఖిలభారతీయు లకు

జాతీయతాస్వరూపమును విప్పిచెప్ప నాచార్యుడాయెను.

ప్రప్రథమమున తనయానందమఠ మను నవలలో 'వందేమాతరం' మంత్రోపదేశ మొనర్చి గానము చేయించినది ఋషి బంకించంద్రులే అయినను ఆ మంత్రార్థమును వెల్లడించి భారతమాత కేవలము నదీ పర్వతారణ్య మయమైన వట్టిజడపదార్థముగాక సర్వశక్తి ప్రదీపితయగు శక్తిస్వరూపిణి యని, ధర్మపత్నికి వ్రాసిన లేఖలో వివరించినట్లు, యథార్థ స్వరూపమును బ్రస్ఫుట మొనర్చి, వందేమాతర మను గానమును సజీవమొనర్చి, భారతపుత్రులు పులకాంకితు లగునట్లు ప్రచారమునకు తెచ్చినది శ్రీఅరవిందులే. స్వరాజ్య సామ్రాజ్యసంబంధ ముల నాధ్యాత్మిక దృష్టితో విమర్శించి 'సంపూర్ణ స్వాతంత్ర్యమే' మన యాదర్శ మని నిర్భయముగా లోకమునకు చాటినది- శ్రీఅరవిందులే. ఐర్లాం డనుస రించుచున్న సిన్‌ఫిన్ విధానముంబోలిన స్వాతంత్ర్య సంపాదనావిధానమును భారత దేశమునకు జూపించి 'పరి పాలనాధికారము లేనంతవఱకు ప్రభుత్వముతో సహాయ నిరాకరణ మవలంభించవలయు'నని 'స్వసహాయ్యమున నే ఆధారపడి కార్యసిద్ధి గాంచవలయు' నని మున్ముందు హెచ్చరించినది శ్రీఅరవిందులే. ఈ సత్యము 'నా దేశీ

యుల కొఱక బహిరంగలేఖ' యను శీర్షిక క్రింద ౧౯౦౯ లో వారు ప్రకటించిన లేఖను బఠించిన తెలియగలదు. వారు చాటిన ప్రతి ఆదర్శ విధానమును ఆధ్యాత్మజ్ఞాన సంజనితమై, ధర్మశాస్త్ర సమ్మతమై, సద్ధర్మ పరిపాలనా సూత్రముల కనుగుణమై, ప్రతిపక్షులు ఖండింపజాలనంత హేతుబద్ధమై యుండెను. అందుననే శ్రీ అరవిందుల సంపాదకత్వమున వెలువడుచుండిన 'వందేమాతర' పత్రిక ఆంగ్లభాషా పరిచయముగలవారి కనుదినము పఠించు పారాయణగ్రంథమై యుండెను. ఆ పత్రికలోని సంపాదకీయవ్యాసము లిండియాలో యున్న పత్రికలందే కాక, లండను పట్టణములో, ప్రభుత్వములనే తారుమారు గావించగల 'టైమ్సు' పత్రికారాజమునందును పునర్ముద్రణము లగుచుండెను.

అంతవరకు 'భిక్షాం దేహి' యని తమకష్టములనే ఏకర పెట్టుకొనుచు, మఱికొన్ని యుద్యోగములిప్పించుడని, విద్య చెప్పించుడని, ఈ యా సాయముల జేయుడని, ప్రార్థనలతో తృప్తిచెందుచుండిన దేశీయ మహాసభలో నూతనశక మారంభింపగల అద్భుతపరివర్తనము దేశమందీ పత్రికామతల్లివలన నేర్పడినది. అందుననే ౧౯౦౬-వ సంవత్సరమున కలకత్తాలో సమావేశమైన

దేశీయమహాసభయందు భారత పితామహుడుగా బూజనీయుడై యుండిన స్వర్గీయ దాదాభాయి నౌరోజీ యధ్యక్షతక్రింద స్వరాజ్య-స్వదేశీ-బహిష్కార-జాతీయ విద్యలను గుఱించిన తీర్మానము లామోదితములై తన్మూలమున మితవాద నాయకులకు కన్నులుబ్బనై భిన్నపక్షములు విజృంభింప నారంభించెను. జాతీయపక్షమునకు నిజముగా శ్రీ అరవిందులే జీవగఱ్ఱయైనను పేరు ప్రతిష్ఠలను ప్రకటనాడంబరములను గాంక్షించని నిరాడంబరతా ప్రియుడగుటచే తానే తిలక్ లోకమాన్యుని జాతీయపక్ష నాయకునిగా ప్రతిష్ఠించి వారి కగ్రస్థాన మొసంగి తా నండనై యుండెను.

శ్రీ అరవిందుల లేఖినీ సూహాత్మ్యము వలన 'వందేమాతరం' పత్రికామతల్లి యనుదినము జాతీయ తత్త్వమును బోధించి స్వయంసాహాయ్యమున చేయగల కార్యవిధానమును స్పష్టముగా నాదేశించి దేశీయులను ముఖ్యముగా వంగీయుల నుత్తేజితుల గావించి వీరావేశమున ముంచివైచినది. విద్యాలయందు, పరిశ్రమలయందు భావములందు, నిత్యవ్యవహారములందు స్వదేశీతత్త్వము వెల్లడిగా నారంభించెను. విదేశవస్తు బహిష్కారమంత సంపూర్ణవిజయము గాంచదొడంగెను. ప్రభుత్వవిద్యా

లయములు బహిష్కరింపబడి దేశమం దెల్లెడల జాతీయ పాఠశాలలు స్థాపింపబడెను. ప్రభుత్వ న్యాయస్థానములు బహిష్కరింపబడి పంచాయతీ పద్ధతులవలన నాయా మండలములలోని పెద్దమనుష్యులు లక్షలకొలది విలువ గల వ్యవహారముల నుభయ కక్షులవారును శిరసా వహించునట్లు ధర్మముగా న్యాయముగా తీర్మానింప నారంభించిరి. ప్రభుత్వమువారి సాయము నపేక్షించరా దనుభావముతో ప్రతి ప్రదేశమునను స్వచ్ఛంద సేవక బృందమును నెలకొల్పిరి. వారే ప్రజాహిత కార్యము లందు రక్షకభటులై సేవచేసి పౌరుల ప్రీతివిశ్వాసము లను బడయుచుండిరి. ఇంతటి ఫలప్రదమగు కార్యవిధా నమును నిర్ణయించి దేశమునందు స్వాతంత్ర్య పిపాసతో ధైర్యోత్సాహములతో నూతన వికాసమును గలిగించు చున్న 'వందేమాతరం' పత్రిక ప్రభుత్వాధికారుల యాగ్రహమునకు బాత్రమైనదనుటలో విచిత్రమేమియు లేదు. అప్పటికిని నిజసంపాదకీయ వ్యాసములకంటె 'యుగాంతర్' 'సంధ్య' మున్నగు అతివాద దేశభాషా పత్రికలనుండి యెవరో యనువదించి ప్రకటించిన వ్యాస ములు రాజద్రోహకరములుగా నున్నవని శ్రీఅరవిం దుల పైని పత్రికాసంబంధముగల మఱి కొందఱిపైని

ప్రభుత్వము వారు దోషారోపణము గావించిరి. ఈ సందర్భముననే విపినచంద్రపాలు డంతకుమున్న కని విని యెఱుంగని నూతన మార్గమును త్రొక్కి బ్రిటిషువారి న్యాయస్థానములందు, ముఖ్యముగా రాజద్రోహ పు కేసుల విషయమున, సాక్ష్యమిచ్చుట మనస్సాక్షికి విరోధ మని సాక్ష్యమియ్య నిరాకరించి తన్మూలమున కోర్టు ధిక్కార దోషమునకుగా నాఱుమాసముల కారాగార వాస మనుభవించిరి. శ్రీఅరవిందులపై నారోపితమైన నేరము రుజువుగాని కారణమున నిరర్థకమై శిక్ష విధిం చుటకు వీలులేకపోయినది. ప్రభుత్వాధికారులు శ్రీ అరవిందులపై నెత్తిన ప్రథమ దండయాత్ర ఇట్లు భగ్న మైనది. కాని యీ యభియోగ సందర్భమున, కీర్తి శేషులగు, బారిష్టరు వ్యోమకేశ చక్రవర్తి, ఎనిమిది తొమ్మిదిమాసములుగా శ్రీఅరవిందులు 'వందేమాతరం' పత్రికకు వ్రాసిన వ్యాసరాజములకు గౌరవభృతిగా బొందినది ఏబదిరూపాయలు మాత్రమే యని రుజువు చేయుటవలన శ్రీవారి త్యాగమే మఱింత వెల్లడియైనది.

## సూరత్ కాంగ్రెస్సు

౧౯౦౭-డిసెంబరు మాసాంతమున దేశీయమహా

సభాసమావేశమునకు జాతీయ పక్షనాయకులుగా శ్రీ అరవిందులు సూరతుపట్టణమున కనేక ప్రతినిధులతో వెళ్ళియుండిరి. సూరత్ కాంగ్రెస్ విచ్ఛిన్నమునకు తిలక్-శ్రీఅరవిందుల-మెహతా-గోఖలేల వ్యక్తిగత విరోధములు, అన్యోన్య ద్వేషాసూయాదులు, జాతీయవాదుల తుందుడుకులు కారణములని పెద్దలు కొందఱానాడారోపించి యుండినను కొంచెము సూక్ష్మముగా పరిశీలించి జాతీయతత్త్వమును గ్రహించగలవారికి, ఇరుపక్షములందలి దృష్టిభేదములే సిద్ధాంతవిధానములందలి భిన్నభావములే ముఖ్యకారణము లని స్పష్టము కాగలదు. అఖిల భారత దేశమునకు ప్రజాప్రతినిధి సంస్థయై దేశీయులందఱభావముల గ్రహించి తదనుగుణముగా తీర్మానము లొనరించి దేశాభివృద్ధికి తోడ్పడవలసిన దేశీయమహాసభ నాటివఱకు మితవాద నాయకులగు ఏ మెహతా, గోఖలే, వాచా, కృష్ణస్వామి అయ్యర్ ఆదిగాగల ఐదాఱుగురి నిరంకుశ పాలమునకు లోనై కేవలము మితవాదుల కేంద్రమై యుండెను. ఈ నిరంకుశచర్యల నంతమొందించి నిజమైన ప్రజాప్రతినిధిసంఘముగా పరివర్తన మొందించ జాతీయవాదులు నిశ్చయించిరి. కలకత్తాలో నంతకుముందటిసంవత్సరమే దేశీయ మహా

సభలో పితామహ దాదాభాయి యధ్యక్షత క్రింద తీర్మా నింపబడిన స్వరాజ్య - బహిష్కార - తీర్మానములకు మిత వాదు లడ్డుదగిలి 'స్వరాజ్య' మను పదమునే త్రోసివైచి 'బ్రిటిషు ప్రభుత్వాధికారమునకు లోబడిన అధినివేశ పరి పాలనమే భారతీయుల ఆదర్శ' మని తీర్మానించుటకు దీక్ష వహించి కుట్రల నెన్నింటినో పన్నసాగిరి. బహిష్కార తీర్మానమునే రద్దుగావించిరి. తుదకీ రెండుతీర్మానములు దేశీయ మహాసభలో చర్చించుటకేని యవకాశ మియ్య రాదని దృఢసంకల్పులైరి. ఈ తిరోగమనము, ఈ నిరం కుశత్వము జాతీయవాదులకు హృదయ శల్యమై నాటి నది. స్వరాజ్య-బహిష్కార - స్వదేశ - జాతీయవిద్యలను గురించిన ప్రధానతీర్మానము లీనాలుగును మహాసభలో చర్చించబడవలయు నని, ఆమోద నిరాకరణము లచ్చ టనే నిశ్చయింపబడవలయు నని వీరు పట్టుపట్టి ప్రాణ మొడ్డిరి. ఇట్టి ప్రధాన విషయములందేకాక ఇతర విషయ ములలోను తీవ్రభేదము లేర్పడినవి. మొట్టమొదట నాగపూరులో దేశీయ మహాసభ జరుగునట్లు నిశ్చిత మైనను అచ్చట జాతీయ వాదులకు పలుకుబడి ప్రబల ముగా నున్నదని తమనాయకత్వము చెల్లదని కొన్ని తంత్రముల గల్పించి మితవాదులు దేశీయ మహాసభా

సమావేశము నచ్చుటనుండి తమయానుకూల్యమునకుగా సూరత్తునకు మార్చిరి. అపుడే దేశాంతరవాసశిక్షనుండి విడుదలయైవచ్చిన, పంజాబుకేసరి యని పేరుమోసిన, కర్తవీరుడని కొనియాడబడిన లాలాలజపతిరాయ్ సభాధ్యక్షులుగా నుండవలయునని జాతీయవాదులు ప్రతిపాదించగా దానిని నిరాకరించి మితవాదియగు రసవిహారిఘోషును సభాధ్యక్షునిగా మితవాదులు నిర్ణయించిరి. ఇట్లు మితవాద జాతీయవాద పక్షయు లుభయులు తమ తమ యభిమతముల నెఱవేర్చుటకు సన్నద్ధులై సూరత్ పట్టణమున సమావేశమైరి.

మహాసభకు పూర్వము రెండుమూడు దినములుగా నేదో యొకవిధమున సమాధానపడుటకు శ్రీఅరవిందుల సాయమున లోకమాన్యుడు విశ్వప్రయత్నమొనర్చెను. తుదకు రసవిహారిఘోషు సభాధ్యక్షులుగా నుండుటకును సమ్మతింతు మనియు ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము ముగిసినతరువాత, సభాధ్యక్షుని ఎన్నుకొను ప్రతిపాదన మొనర్చినతరువాత, సభాకార్యక్రమము ముపక్రమింపబడుటకుముందు, మహాసభలో తన జాతీయపక్షమువారి భావములను దెలుపుకొనుటకు తమ కవకాశ మిప్పించుడని లోకమాన్యులు ఒకటి రెండు

పర్యాయముల లిఖితపూర్వకముగా నాహ్వానసంఘము వారికిని, తదధికారులకును తెలుపుకొనిరి. కాని మితవాదులు, రాయబారుల సమాధాన ప్రయత్నములకు నవకాశమీయక, నిర్లక్ష్యముగా లోకమాన్యునికి ప్రత్యుత్తరమేని ఇయ్యలేదు. అందువలన సభాసమయమున తాను ముందుగా తెలిపిన విధమున సభాధ్యక్ష ఎన్నిక ప్రతిపాదనమైనతరువాత లోకమాన్యుడు సభావేదికపై నిలిచి మాటాడ నారంభించెను. మాటాడ నీయగూడదని కూర్చుండియున్న మితవాద నాయకులు తదనుచరులు భల్లూకపుపట్టు పట్టి నిరోధించుటయు, నంత కల్లోలము ప్రారంభమై ఇరుపక్షములవారును చేతికఱ్ఱలు, గొడుగులు, కుర్చీలు, తుదకు పాదరక్షలు మున్నగు వానితో గొట్టుకొనుటయు, ప్రతినిధు లనేకును 'బ్రతికియుండిన శుభముల బడయవచ్చు' నను నీతిని స్మరించుచు పలాయనమగుటతో కాంగ్రెస్సు విధ్వంస మగుటయు నందఱెఱింగిన దే. ఈ ప్రాణోపద్రవ సమయమున నేమాత్రము చలించక, ఆ త్వరక్షణోపాయము నిసుమంతయేని గమనించక, ప్రశాంత వదనముతో తనస్థానమునుండి కదలక కూర్చుండియుండిన వారొక్క శ్రీఅరవిందులే యని యపుడు గన్నులార జూచినవా రొకరు వ్రాసియున్నారు.

పక్షాభిమానము వలననే అదివరకెన్నడు కనివిని యెఱుంగనంత మిక్కుటముగా ఇరుపక్ష ప్రతినిధులసంఖ్య యుండెను. జాతీయవాదులు మాత్రమే యన్నిరాష్ట్రముల నుండి దాదాపు ఎనిమిది వందలు ప్రతినిధులు వచ్చి యుండిరి. సభావిధ్వంసమైన మఱునాడు మితవాదులు సభాప్రవేశమునకే కొన్ని నియమముల నిర్ణయించి, వానిని శిరసావహించిన వారే సభా ప్రవేశమున కర్హులని శాసించి, సభా సమావేశ మొనర్చి జాతీయవాదులను నిందించుచు తమ కనుకూలమైన తీర్మానముల గావించి తృప్తిపడిరి. ఆ మితవాదుల సభను విధ్వంసమొనర్చి, వారి తీర్మానముల నోడించి, తన జాతీయపక్షమువారి తీర్మానములే నెగ్గునట్లు చేయవలయునను సంకల్పముతో, కేవలము సభాప్రవేశముద్దారకుటకు, పేరుకు మితవాదులు నిర్ణయించిన నియమముల నంగీకరించినట్లు సంతకములు చేసి, సభలో బాల్గొనలయునని లోకమాన్యుడు సూచించెను గాని శ్రీఅరవిందు లందుల కంగీకరించ లేదు. అందున జాతీయవాదులు ప్రత్యేకముగా సభను జరిపి ఆ మహాసభకు శ్రీఅరవిందులను అధ్యక్షులుగా నెన్నుకొని, విధ్వంసకారణములను విస్పష్టమొనరించి, జాతీయపక్షాశయములను వెల్లడించి, తదనుగుణముగ

తీర్మానముల గావించి దేశీయుల కర్తవ్య మిదియని చాటించిరి. జాతీయపక్షసమావేశమున కధ్యక్షులుగా నెన్నుకొనబడిన శ్రీ అరవిందులు జాతీయవాదుల యాదర్శవిధానములను, నాటి దేశపరిస్థితులను, దేశీయుల కర్తవ్యమును ప్రబోధించుటకు ఉత్తరదేశ సంచారమును సాగించిరి. ఎన్నోవిధముల నిట్లు చరిత్ర ప్రసిద్ధమైన సూరత్ కాంగ్రెస్సునుగుఱించి, కాంగ్రెస్ పక్షమున సత్యాన్వేషిగా, మహాత్మగాంధిగారి ప్రియానుచరుడుగా, భాష్యకారుడుగా, పేరుపొందిన డాక్టరు భోగరాజు పట్టాభిశీతారామయ్యగారే అధికార పూర్వకముగా రచించిన 'కాంగ్రెస్ చరిత్ర' మను గ్రంథమం దేదియు గానరాదు! ఎందఱిపేర్లనో ధారాళముగా వా రుల్లేఖించి యున్నను శ్రీఅరవింద నామము మాత్రము పేర్కొనియుండలేదు! సూరత్ సభ కావల దేశీయమహాసభాదర్శము 'బ్రిటిషు సామ్రాజ్యాంతర్గత స్వపరిపాలనము' అని మితవాదులు తీర్మానించిన తరువాత శ్రీఅరవిందు లట్టితీర్మాన మే విధముగ నాపత్కరమో చూపెట్టి ఖండించుచు 'స్వాధీతయొక్క అర్థము' ను గుఱించి వ్రాసిన వ్యాసము నీ క్రింద నుదాహరించు చున్నాము.

# స్వాధీనతయొక్క అర్థము

స్వాధీనత మన రాజకీయోద్యమముయొక్క ఉద్దేశ్యము. కాని స్వాధీనత అనగా నేమి? ఈ విషయమున అభిప్రాయభేదము లనేకములు గలవు. ఇది స్వాయత్తశాసనమని కొందఱు; కొందఱు ఉపనివేశముల స్వరాజ్యమని; మఱికొందఱు సంపూర్ణ స్వరాజ్యమే 'స్వాధీనత' అనుచున్నారు. లౌకికమును ఆధ్యాత్మికమును అగు సంపూర్ణస్వాధీనత మఱియు తత్ఫలితమైన అఖండానందము, దీనినే ఆర్యఋషులు స్వారాజ్యమనిరి. రాజకీయ స్వాతంత్ర్యము స్వరాజ్యముయొక్క ఒకానొక అంగము; దానికి బాహ్యస్వాతంత్ర్యము ఆంతర స్వాతంత్ర్యమని రెండువైపులు. విదేశీయ శాసనమునుండి సంపూర్ణముగా విమోచనమందుట బాహ్యస్వాతంత్ర్యము. ప్రజాతంత్రమైన ప్రభుత్వము ఆంతరస్వాతంత్ర్యముయొక్క ఉత్తమ వికాసము. పరుల శాసనముకాని రాజత్వము కాని ఎన్నాళ్ళు నిలిచియుండునో అన్నాళ్ళే జాతియును స్వరాజ్యమును బడసిన జాతియని గాని స్వాధీనయుతమైనజాతియని గాని పలుకుటకు వీలు లేదు. ఎంతవఱకు ప్రజాతంత్రము స్థాపింపబడదో, అంతవఱకు జాతియం దంతర్గతమైన ప్రజను స్వతంత్రులనుటకు వీలులేదు. మనకు సంపూర్ణస్వాతంత్ర్యము కావలయును. విదేశీయుల ఆజ్ఞా నిబంధముల నుండి సంపూర్ణమైన విముక్తి, స్వగృహమందు ప్రజలకు సంపూర్ణమైన ఆధిపత్యము, ఇదియే మా రాజకీయాశయము.

ఈ వాంఛకు గారణము సంక్షేపముగా చెప్పుదుము. పరాధీనత ఏజాతికైనను మృత్యువుయొక్క దూత, మృత్యువుయొక్క ఆజ్ఞా ప్రదాత. స్వాధీనతయందే జీవితమునకు రక్షణము, స్వాధీ

నత యందే ఉన్నతి కవకాశముగలవు. స్వధర్మము, అనగా స్వభావ నియతమైన జాతీయ కర్మమును, జాతీయచేష్టయును జాతీయోన్నతికేకమార్గము. విదేశీయులు దేశముపై అధికారమును బడసి, వారు చాల దయాళువులే హితేచ్ఛగలవారే కానిండు, మనతలపై పరధర్మముయొక్క భారమును మోపక వదలరు. వారి యుద్దేశ్యము మంచిదే ఐనను చెడ్డదేఐనను వారి ఈచేతచే అహితముతప్ప హితము మనకు కలుగదు. పరస్వభావనియతమైన మార్గమందు నడచిపోవుటకు శక్తిగాని ప్రేరణగాని మనకులేదు. ఆ బాటయందు నడచినచో, మనము మిక్కిలి అందమైన తీరున పరానుకరణము చేయవచ్చును, పరుల ఉన్నతియొక్క చిహ్నములతోడను వేషభాషలతోడను కడు నేర్పుతో మన అవనతిని కప్పుకొనవచ్చును. కాని పరీక్షాకాలము రాగా, పరధర్మ సేవచేకల్గిన మన దుర్బలతయు నిస్సారతయు బయల్పడును. ఆ అసారతయొక్క ఫలముగా మనము వినాశమును చేరుదుము. 'రోము' యొక్క ఆధిపత్యము క్రంద చేరినట్టియు 'రోము'యొక్క నాగరికతను స్వీకరించినట్టియు ప్రాచీన 'ఐరోపీయను' జాతులన్నియు సుఖముగా స్వచ్ఛందముగా చాల కాలము గడపెననుమాట నిజము. కాని వారి కడపటిదశ మిక్కిలి బీభత్సమైనదయ్యెను. మనుష్యత్వమే నశింపగా వారికి ఘోరమైన దుర్దశవాటిల్లెను; పరాధీనతయందు నిమగ్నమైన ప్రతిజాతికి అట్టి మనుష్యత్వవినాశమును ఘోరదశయు అనివార్యములు. పరాధీనతకు మూలకారణము జాతియొక్క స్వధర్మనాశనము, పరధర్మ సేవ. పరాధీనదశయందు స్వధర్మమును రక్షించుటకు లేక పునర్జీవిత మొనర్చుటకు సమర్థులమైతమేని, పరాధీనతయొక్క బంధనము తనంతట తాను జారి వీడిపోవును. ఇది

అలంఘనీయమైన ప్రకృతి నియమము. కావుననే ఏ జాతియైనను స్వదోషముచే పరాధీనతయందు పడినచో, అవికలమైనట్టియు సర్వాంగపూర్ణమైనట్టియు స్వరాజ్యము దాని ప్రథమోద్దేశ్యమును రాజకీయాదర్శమును అగుట యుక్తము. ఉపనివేశముల స్వాయత్త శాసనము స్వరాజ్యము కాదు; కాని మినహాయింపులు వినా దాని పూర్ణాధికార మీయబడునేని, అంతేగాక జాతి తన ఆదర్శము నుండియు స్వధర్మము నుండియు భ్రష్టము కాదేని, అయ్యది స్వరాజ్యమున కనుకూలమైన పూర్వదశ కావచ్చును. బ్రిటిషు సామ్రాజ్యమునకు వెలుపల స్వాతంత్ర్యమును బడయు ఆశను పోషించుట ధార్ష్ట్యమును తెలుపుననియు, రాజద్రోహమును సూచించుననియు, మఱియు ఉపనివేశములకున్న స్వాయత్తశాసనముతో సంతుష్టులు కానివారు నిశ్చయముగా రాజద్రోహులనియు, రాష్ట్రవిప్లవకారకులనియు, అన్ని విధముల రాజకీయ కార్యముల నుండియు వెలివేయదగినవారనియు కొందఱు పలుకుచున్నారు. కాని ఈవిధమైన ఆశతో లేక ఆదర్శముతో రాజద్రోహమున కెట్టిసంబంధము లేదు. ఆంగ్లేయుల ప్రభుత్వముయొక్క ఆరంభము నుండియు గొప్ప గొప్ప ఆంగ్లరాజనీతివేత్తలు ఇట్టి స్వాధీనత ఆంగ్లప్రభుత్వముయొక్క లక్ష్యమని చెప్పుచువచ్చిరి. ఇప్పుడును, స్వాతంత్ర్యాదర్శమును ప్రచారముచేయుటయు స్వాతంత్ర్య ప్రాప్తికై సక్రమమైన ప్రయత్నము జేయుటయు శాసనసమ్మతమనియు దోషరహితమనియు ఆంగ్ల న్యాయాధికారులు గూడ విస్పష్టముగ వాక్రుచ్చుచున్నారు. కాని మన స్వాతంత్ర్యము బ్రిటిషు సామ్రాజ్యముయొక్క వ్యవస్థను మార్చి దానియందు నిలిచిన భారతీయులకు పైనిర్దేశించిన స్వరాజ్యమును సాధ్యపడ

జేయునేని, ఆపద ఏమున్నది? మే మాంగ్లజాతియెడ ద్వేషముచే స్వరాజ్యమునకై ప్రయత్నించుటలేదు, దేశరక్షణకై చేయుచున్నా ము; కాని మేము సర్వాంగపూర్ణమైన స్వరాజ్యము వినా అన్యా దర్శములను స్వీకరించి, దేశవాసులకు బూటకపు రాజనీతియు, దేశ రక్షణ కపమార్గమును చూపుటకు సంసిద్ధులము కాము. కావుననే కాంగ్రెసు 'క్రీడ్' విషయమున జాతీయవాదుల కాపత్తి. *

శ్రీ అరవిందుల తమ్ములు వారీంద్రుని స్వీయ చరిత్రమును జదివినవారికి అతడు రాజసగుణ ప్రధాను డనియు, అనుకొనినది అనుకొనినయట్లు వెనుకముందు లారయక యనుష్ఠించు ఉద్వేగియనియు తెలియగలదు. కాని దేశస్వాతంత్ర్యమునకు 'ఆనందమఠము' లోని విధానమును సన్న్యాసివేషముల ననుకరించుటయు మంచి దనియు, సన్న్యాసులయొద్ద యోగులయొద్ద మహత్తర శక్తులు గలవనియు వాని నెట్లయిన సంపాదించవలయు నను సంకల్పముతో సన్న్యాసులకై యోగులకై వీరు పలుప్రదేశములు తిరిగి యన్వేషించిరనియు తెలియు చున్నది. ఈ యన్వేషణ సందర్భమున గుజరాతులోని నొక యోగపురుషుని - సన్న్యాసికాదు, సంసారినే- కనుగొని కొంత యుపదేశము నందినట్లును వారీంద్రుని ఆత్మ చరిత్రము తెలుపుచున్నది. శ్రీ అరవిందుల

---

* 'శ్రీఅరవింద వ్యాసావళి' నుండి.

కాంధ్యాత్రికతృష్ణ తీవ్రముగా గలదని చక్కగా నెఱింగిన వారీంద్రుడు, సూరత్ మహాసభకు ప్రతినిధిగా వచ్చి యుండిన వారీంద్రుడు 'విష్ణుభాస్కరలేలే' యను ఆ యోగిని, సమీపమున బరోడాలో నున్నవానిని, ఒక పర్యాయము చూచి మాటాడి యథార్థమును కనుగొన వలసినదిగా జెప్పి శ్రీవారిని ప్రోత్సహించెను. అందు వలన సూరత్ పట్టణమున నుపన్యసించిన పిదప శ్రీ అరవిందులు ౧౯౦౮-జనవరి ప్రారంభమున బరోడా పట్టణమునకు వెళ్ళియుండిరి. బరోడా మహారాజునుగూడ దర్శించి మాటాడియుండిరి. అచ్చటి కళాశాలోపాధ్యక్షు లేకారణముననో, విద్యార్థులెవరును శ్రీ అరవిందుని దర్శించి సన్మానించరాదని కఠినముగా నుత్తరువొసంగి యుండిరట. కాని శ్రీఅరవిందు లామార్గమున కళా శాల సమీపముగా వెళ్ళుట నెట్లో విద్యార్థులు కనిపెట్టి గుంపుగా, కళాశాలను ఉపాధ్యాయవర్గమును ఆ అధ్య క్షునకే విడిచిపెట్టి, పరువెత్తివచ్చి శ్రీ అరవిందుని దర్శించి నమస్కరించి, బండికి గట్టియున్న గుఱ్ఱములను విప్పివైచి తమ కోమల హస్తములతో బండిని లాగి యూరేగించి, యుత్సవమొనర్చి గురువర్యులపట్ల తమకు గల ప్రేమభక్తులను వెల్లడించియుండిరి.

శ్రీఅరవిందులు లేలేగారిని దర్శించి యోగ తత్త్వవిషయముల గుఱించి మాటాడిరి. లేలేగారు యోగాభ్యాసమున శ్రీఅరవిందులకు సాయపడ నుత్సహించి మునుమున్న 'యోగశ్చిత్తవృత్తిర్నిరోధః' యన్నట్లు చిత్తమునందే భావపరంపరలు కాని యుదయించి కలత కలుగనీయకుండునట్లు ప్రశాంతినందుట కేకాంతముగా ధ్యానము-మెడిటేషన్-చేయుడని సాధన మార్గమును సూచించుచు నిట్లు తెలిపియుండిరట: 'ధ్యానమున గూర్చుండుము, కాని యే యాలోచనయు జేయకుము. మీ మనస్సునందుమాత్రమే దృష్టినుంచుడు. అపుడు మనస్సులోనికి తలంపులు వచ్చుచుండుటను మీరు గుర్తింతురు. అవి మనస్సులో ప్రవేశించుటకు ముందే, మీమనస్సు సంపూర్ణముగా నిశ్చల నీరవస్థితి నందగలుగునంతవఱకు, వానిని అనగా ఆ భావములను దూరముగా త్రోసివేయుడు.' బాహ్యప్రపంచమునుండి భావము లిట్లు రూపుదాల్చి మనస్సులో ప్రవేశించునని తా మంతకు ముందెన్నడు వినియుండనట్లు ఈ విషయమును దెలిపినందులకే లేలేపట్ల తాము కృతజ్ఞులై యుండవలసినట్లు శ్రీఅరవిందులు వెల్లడించియుండిరట. మఱియు లేలేగారిట్లు చెప్పినవుడు, దాని సత్యాసత్యముల

గూర్చిగాని సాధ్యాసాధ్యతల గుఱించిగాని శ్రీఅర విందు లేమాత్రము నాలోచించక వెంటనే వారు చెప్పిన ప్రకారమనుష్ఠించినట్లును, ఒకక్షణములోనే. ఉన్నతపర్వత శిఖరాగ్రమున నివాతము బోలె నిశ్చల నీరవమైనట్లును, బాహ్యప్రపంచమునుండి యొకటి వెనుక నొకటిగా రెండు తలంపులు రూపెత్తి వచ్చు చుండుట తమకు గోచరమైనట్లును, వెంటనే యవి మనస్సులో బ్రవేశించి నిలద్రొక్కుకొనుటకు ముందే, వానిని దూరముగా ద్రోసివేసినట్లును శ్రీ అరవిందు లొకానొకసందర్భమున సెలవిచ్చియున్నారు. ఈసాధన మూలముననే మూడు దినములలో శ్రీఅరవిందులకు, మామూలుగా యోగపరిభాషలో బేర్కొనబడు మానసాక్షాత్కారము, పరాశాంతి, నిర్వాణము సిద్ధిం చినవట. ఈ సమయమునుండియే వారిలోని మనోమయ పురుషుడు, ఈదృశ్య సామ్రాజ్యమున, భావసామ్రాజ్య మున తనయిచ్ఛవచ్చినట్లు దేనినేని స్వీకరించుటకుగాని నిరాకరించుటకుగాని స్వతంత్రుడాయెనట. ఇట ముక్తి. నిర్వాణము, భగద్దర్శనము, ఈ పదముల భావమును గుఱించి సూక్ష్మముగా రెండుమాటలలో వివరించుట సమంజసము. శ్రీశంకరులు సగుణమును అనగా భగ

వానుని త్రోసిపుచ్చి, నిర్గుణము కేవలము నగుబ్రహ్మమునే విశ్వసించి రూఢమొనర్చిరి. ఇక శ్రీ బుద్ధుడన్ననో మహాలోకమెట్టు ముందుకురికి సర్వము క్షణికమేగాని శాశ్వతముగా నున్న దేమియులేదని భగవానునేగాక బ్రహ్మమునుగూడ త్రోసిపుచ్చి రెంటిని నిరాకరించెను. ఖండానుభవజన్యములైన ఈ అస్తి నాస్తి పదముల ననుసరించియే ముక్తి నిర్వాణపదముల విభేదము. ఇపుడు శ్రీఅరవిందులకు సాక్షాత్కారమైనది తద్బ్రహ్మమేగాని భగవద్దర్శనము గాదేమోయని యూహించ నవకాశము గలదు. వారికి లభించిన శ్రీకృష్ణభగవానుని దర్శనము గుఱించి ముందుముందు మన మెఱుంగగలము. కాని శ్రీఅరవిందుల కిపు డీదశలో అనుభవమైన నూతన విషయ మొండుగలదు. కర్తాకర్తల స్థితి—అనగా నేక కాల మున నే నిశ్చలనీరవస్థితియు, కర్త కలాపము లొనరించు తీవ్రక్రియాస్థితియు. మూడుదినములలో మనస్సెట్లు అద్భుతముగా శూన్యమైపోయినపుడు శ్రీఅరవిందులు 'బొంబాయిలో నే నుపన్యసించవలసియున్న దే, నే నెట్లుపన్యసించగల' నని యడుగగా 'మీ రేమియు చేయ నవసరము లేదు. మీయందున్న హృత్పురుషుడగు భగవానుడే ఉపన్యసించు' నని లేలే చెప్పియుండిరట. అదే

ప్రకారము బొంబాయిలో నేర్పాటుచేయబడిన మహాసభలో తమ స్వప్రయత్నమున స్వబుద్ధితో గాక తమ వాక్కుమూలమున నెవరో ధారాళముగా నుపన్యసించినట్లు శ్రీ అరవిందుల కనుభవ మయ్యెనని తెలియుచున్నది. ఆనాడు, భావముగాని శైలిగాని నవీన పథమున దొర్లినవట. ఇంతకు శ్రీఅరవిందులకు, నిమిత్తమాత్రమే గానిందు, గురువుగా పేర్కొనబడిన లేలే విద్యాబుద్ధులలో శక్తిసామర్థ్యములలో నంతగా గణింపదగినవారు గారు. ఆధ్యాత్మికానుభవ సంపత్తులలోగూడ పూర్ణత్వమునుగాని ఔన్నత్యమునుగాని గడించని వారేయని చెప్పవలసి యున్నది. వేయేల నాటికే వీరికిని శ్రీఅరవిందులకును అండ బ్రహ్మాండమున కున్నంత తారతమ్యము గలదు. ఇట్లుండియు శ్రీఅరవిందు లేమాత్రము సంకోచింపక వట్టియంత్రముగా లేలే చెప్పినట్లెల్ల ననుష్ఠించి వారిపట్ల ప్రకటించిన ఆత్మసమర్పణము నిరుపమానము. గురువుల యోగ్యతాయోగ్యతలకంటె, శిష్యుడు గురువును భగవానుని ప్రతినిధిగా, గురురూపముననున్న భగవానునిగా త్రికరణశుద్ధిమెయి విశ్వసించి ఆత్మసమర్పణమును సంపూర్ణముగా కొనర్చుటలోనే ధన్యుడు గాగలడను సత్యమును శ్రీఅరవిందులు మరొకసారి లోక

మునకు చాటినవారైరి. లేలే వెనుక పరోక్షమున నొకశక్తి తమకు గోచరించినదనియు, తత్సాహాయ్యము నపేక్షించి తమంతట తామే ఆశక్తి కాత్మార్పణ మొనర్ప నిశ్చయించితి మనియు, ఈ సంపూర్ణసమర్పణమును, ఆమహాశక్తి దర్శనము లేలేమూలమున నైనందున, వారికే సమర్పణ మొనర్చి 'తు,చ' తప్పకుండ యంత్రమువలె వారి యుపదేశాను సారముగా ననుష్ఠించితిమనియు శ్రీఅరవిందులే, యోగ విధానమందుగల సమర్పణమును-ప్రపత్తిని-తన్మాహాత్మ్య మును బ్రశంసించుచు తెలిపియున్నారు. శ్రీవారి నిరుపమాన సమర్పణసామర్థ్యమునకు లేలే అత్యంతాశ్చర్యపడి 'ఇంత సంపూర్ణముగా నేయనుమానము తర్కభావము లేకుండ సమర్పణ మొనర్పగలవారి నింతవఱకు నేనెన్నడు చూడలే' దని పలువురతో చెప్పి ప్రశంసించియుండిరట. మఱియు శ్రీఅరవిందుల సాధనలో ఇంతటి ప్రపత్తి మూలమున లభ్యమైన, ఎంతో తీవ్ర ప్రవృత్తిగల పరివర్తనానుభవములతీరు లేలే గుర్తించజాలక 'మానవ మాత్రుడనైన నాకొనర్చనగ్లే మీయందుగల హృత్పురుషుని కిక ఆత్మ సమర్పణమొనర్చి శరణు చొరు' డని శ్రీఅరవిందులకు తెలిపిరట. నాటినుండియే హృత్పురుషుడగు భగవానుడే శ్రీఅరవిందుల గురువు.

ఇట్లు భగవంతుడగు నంతఃస్థితపురుషునివలన నుపదేశ మందు భాగ్యము మహాపురుషులకుగాని సామాన్యులకు లభింపదు. ఆవల కొంతకాలమునకు ప్రాయశః ౧౯౦౮ మార్చిలో విష్ణుభాస్కరలేలే వారీంద్రుని యాహ్వానము ననుసరించి కలకత్తాకు వచ్చినట్లును, అపుడు వారు శ్రీఅరవిందులను జూచి 'సాధన చేయుచున్నావా? నీ సాధన ఎట్లున్నది?' అని ప్రశ్నించినట్లును అందులకు 'నే నే సాధనయు జేయుటలేదు. భగవానుడే సర్వము చేయించుచున్నాడు. అతని యాదేశానుసారముగానే నాజీవిత వ్యవహారము నడచుచున్నది.' అని శ్రీఅరవిందులు ప్రత్యుత్తర మిచ్చినట్లును తెలియుచున్నది. అంత లేలేగారొకటిరెండు పర్యాయము లేదో యుపదేశ మొసగ ప్రయత్నించినను. శ్రీఅరవిందులు స్వీకరించక తప్పించుకొనినట్లు చెప్పనగును. ఆనాటినుండియు అనగా మామూలుగా బేర్కొనబడు జ్ఞానసిద్ధి లేక నిర్వాణ మును బొందినప్పటినుండియు సర్వకార్యములు, ఉపన్యాసములు, వ్రాతలు తన ప్రయత్నమున గాక భగవత్ ప్రేరితములై స్వతఃప్రేరణ (ఇంట్యూషన్) మూలమున నిర్వహింపబడు చున్నవనియు, నా స్థితిలో వెల్లివిరిసినదే తమ వాఙ్మయ మనియు శ్రీఅరవిందు లొకానొక

సందర్భమున వెల్లడించినట్లును తెలియుచున్నది. సూరత్ కాంగ్రెస్ నుండి కలకత్తాకు వచ్చిచేరినతర్వాత శ్రీ అరవిందులు తమ ధర్మపత్నికి వ్రాసిన యొక లేఖవలన పైవిషయము మఱింత స్పష్టము గాగలదు. అందుండి కొన్ని వాక్యములను మాత్ర మిందుదాహరించు చున్నాము.

* జనవరి ౮-న నేను వచ్చెదనంటిని, కాని రాలేకపోతిని, అది నాయిచ్ఛవలన ఘటించలేదు. ఎటకు భగవంతుడు తోడ్కొని పోయెనో అటకే నేను పోవలసివచ్చెను. ఈసారి నేను నాపనిమీద బోలేదు, అతనిపనిమీదనే పోయితిని. ప్రస్తుతము నామనస్సు యొక్క అవస్థ క్రొత్తరూపును దాల్చినది. ఆ విషయ మీయుత్తరములో వెల్లడించను............ఇప్పుడు ఈ విషయముమాత్రమే చెప్పనగును. ఈపైని నేను నిజేచ్ఛ కధీనుడనుగాను, ఎచటికి నన్ను భగవంతుడు గైకొనిపోవునో అచటికి కీలుబొమ్మవలె పోవలయును, ఏది చేయించునో అది కీలుబొమ్మవలె చేయవలయును.

*

* *

కాని ఇపుడు నాకింక స్వాధీనతలేదు; దీనిని నీవు గ్రహింపవలయును. నా సర్వకార్యములును నాయిచ్ఛపై నాధారపడక భగవంతుని ఆదేశమువలననే జరుగును. నీవు వచ్చినప్పుడు నా తాత్పర్యమును నీవు తెలిసికొందువు.

---

* 'శ్రీఅరవింద లేఖలు' అను గ్రంథము నుండి.

*
* *

ఈ ఉత్తరము నెవ్వరిని జూడనీయకుము, కారణ మేమన ఈ చెప్పిన విషయ మెంతయు గోపనీయము, నీకుదక్క ఇంకెవరి కిని చెప్పలేదు, చెప్పుట నిషిద్ధము.

*
* *

బరోడానుండి పునహా, బొంబాయి పట్టణము లందు, అమరావతి, నాగపురము మున్నగు ప్రదేశము లందును శ్రీ అరవిందు లుపన్యసించుచు, జాతీయవాద దుందుభుల మ్రోగించుచు, నూతనోత్సాహమును బుట్టించి, తన సంభాషణముల వినగలిగినవారి నెల్ల దేశారాధన తత్పరులనుగావించి, దిగ్విజయముగా యాత్ర సాగించి ౧౯౦౮-జనవరి నూంతాంతమునకు కలకత్తా వచ్చి చేరిరి. శ్రీ అరవిందులు, బెనర్జి, పాల్ మున్నగు వారివలె వక్తృత్వపటిమలో బ్రసిద్ధి బడయకున్నను వారి వాక్యములు హృదయమునుండి వెడలి తిన్నగా శ్రోతల హృదయమున నాటి పరివర్తన మందించునట్టి పవిత్రతా ప్రతిభగల అపూర్వభావగర్భిత పదజాలము లు. ఆ దివ్యవాక్కునందు సూదంటురాయివలె శ్రోతల నాకర్షించు శక్తి గలదు. ఇట్టి తమ యుపన్యాసముల

మూలమున శ్రీఅరవిందులు దేశమును ముఖ్యముగా వంగదేశము నుఱ్ఱూతలూగించిరి. ఈ సమయముననే శ్రీ అరవిందుల ప్రతిభావిశేషములకు, కార్యదీక్షకు, అపూర్వ జాతీయ భావములకు, త్యాగమునకు ముగ్ధుడై ఆసియాఖండ కవిచక్రవర్తియని ఖండాంతరములందును కీర్తినిగాంచి దివంగతుడైన రవీంద్రుడు 'నమస్కార' మను శీర్షిక క్రింద వంగభాషయందు రసవత్తరమైన గీతమును రచియించి 'ఓ అరవిందా! రవీంద్రుని వందనముల నందికొమ్ము' అని గాన మొనర్చియుండెను.

ఇపుడే, అనగా ౧౯౦౭-వ సంవత్సరాంతముననో ౧౯౦౮-వ సంవత్సరారంభముననో సుప్రసిద్ధరచయిత, అనేక విదేశ పత్రికలప్రత్యేక విలేఖరిగానుండి యిటీవలనే గతించిన హెన్రీ. డబ్ల్యు. నెవిన్సన్ గారు శ్రీఅరవిందుల ను దర్శించియుండిరి. వారు (The new Spirit in India) 'ఇండియాలోని నూతన శక్తి' యనుపేర నొక ఉద్గ్రంథమును గూడ రచించియున్నారు. అందు నాటి శ్రీఅరవిందుల రాజకీయవిధానము, జాతీయపక్షము, ఆంగ్లో ఇండియన్-పత్రికల దురాగతములు మున్నగు విషయములగుఱించి వివరించియున్నారు. శ్రీఅరవిందుల ను దర్శించుటకు ముందుగా ఏనాడెపుడు తానువచ్చునది

తెలుపుచు ఉత్తరమును వ్రాసియుండిరట. ఆయుత్తరము గూఢచారులచేతిలో బడినందున శ్రీఅరవిందుల కందకుండుటయు నెవిన్సన్‌గారిని అకస్మాత్తుగా కలియవలసి వచ్చుటయు సంభవించినది. ఇంచుమించు తమ యుత్తరము లన్నింటికి ఈదుర్గతియే పట్టుట పరిపాటి యైనదని శ్రీఅరవిందులు చెప్పగా నెవిన్సన్‌గా రిట్లనిరి. "ఇటీవలనే ఇంగ్లాండునుండి యత్యంత ప్రముఖులు, మహనీయులు, నాయకులు నైన వారిలో నొకరు రాజప్రతినిధి కార్యనిర్వాహక సభ్యులైన వారి కొకరికి వ్రాసిన యుత్తరమే బొంబాయిలో గూఢచారుల పరిశోధనకు పాలయినది. ఇంటినుండివచ్చెడి తమ యుత్తరములు గూడ నిట్లే పరిశోధింపబడుచున్నవని కలకత్తాలో ఇండియనులకు మిత్రులుగానున్న ఇంగ్లీషువారును నాకు చెప్పియున్నారు." శ్రీఅరవిందులకు విప్లవ పక్షపత్రికయగు 'యుగాంతర్' తో నేమాత్రము సంబంధము లేదనియు, వందేమాతరం పత్రిక వారి దేయనియు తెలుపుచు వారివాణి, వ్రాత, మతము ఆధ్యాత్మికభావములనే వెల్లడించుచుండుననియు, వారి జాతీయత, రాజకీయాదర్శమునకు భారతీయాభివృద్ధికి అతీతమైన పవిత్రధర్మసంజాతమనియు కీర్తించియున్నారు. మఱియు నప్పటి ఆంగ్లో

ఇండియన్ పత్రికలు కులద్వేషమును వర్ణద్వేషమును పెంచుచుండిన విషయమును గుఱించి, 'సంధ్య', 'యుగాంతర్' లోనగు హైందవపత్రికలు దుందుడుకుగా ద్వేష పూరితముగా రాజద్రోహకరముగా ప్రకటించిన వ్రాతలకు, తత్పత్రికాధిపతులను కారాగారములం దుంచియు, అపరాధముల విధించియు ముద్రణశాసనము ననుసరించి అసలు ముద్రణాలయములనే స్వాధీనపఱచి కొనియు ప్రభుత్వము శిక్షించెననియు, ఆంగ్లోఇండియన్ పత్రికలు ప్రకటించిన దుష్టము, ద్వేషజనకము, హింసాకరము నగు వ్రాతలతో బోల్చిచూచిన పై పత్రికలెంతో నయమనియు, నట్లుండియు ఈ పత్రికలను ప్రభుత్వమేమియు ననక ఆదరించుట ఆశ్చర్యదాయక మనియు వ్రాసియున్నారు. అప్పటి ఏషియన్ (Asian) అను ఆంగ్లోఇండియన్ వారపత్రిక ౯-౫-౧౯౦౮ ప్రకటించిన విషపూరితము హింసాప్రేరకము నగు వ్యాసమునుండి కొంతభాగమును గూడ నెవిన్సన్ గారు తన గ్రంథమున నుదాహరణార్థము ప్రకటించియున్నారు.

సూరత్ కాంగ్రెస్సు విధ్వంసమై మితవాద నాయకత్వము పతనమైన నాటినుండియు జాతీయపక్షమును నిర్మూలింప మితవాదులు నానా విధముల బ్రయ

త్నింప సాగిరి. ప్రభుత్వాధికారులు మితవాదులను జేర దీసి జాతీయవాదులు తలలెత్తకుండ జేయుటకు వలయు కఠినశాసనముల బ్రయోగించుట, గృహముల శోధించి ముద్రణాలయముల శోధించి ధరావత్తుల విధించి జాతీయవాదులను నానావిధముల శిక్షించుట, వందే మాతరమని కేకలు వేసిన పసిబాలుర కొరడా ప్రేటు లకు బాల్పఱచుట, నిర్బంధ విధానములవలన దేశమందు మహత్తరభయ మేర్పడి దిక్కుదోచకుండుట మున్నగు నాటి రాజకీయ పరిస్థితుల వివరముగా వెల్లడించు కార్యము భావిచరిత్రకారునిదిగాని పరాదిగాదు. ఆధ్యా త్మిక ప్రపంచమున నూతనపథము ద్రొక్కి మానవ ప్రకృతినే పరివర్తన మొనర్చి దేవజాతిని భాగవతజీవ నను నెలకొల్పుటయే ప్రధానాశయము గాగల శ్రీఅరవింద జీవితమునం దీవిషయముల కంత ప్రాముఖ్య మిచ్చుట ధర్మముగా తోపకపోవచ్చును. కాని, శ్రీఅర విందుల యోగము కృత్స్నము. ఆ కృత్స్నదృష్టితో జూచునపుడు రాజకీయ, సాంఘిక, ఆర్థిక, కళాభాషాది విషయక వికాసములు సర్వస్వము భగవానుని ఆవిష్కారమే కాగలవు. ప్రేమ, సౌందర్యము, జ్ఞానము, శక్తి, శాంత్యానందములు మున్నగు ననంతవికాసములు

ఆత్మ సామ్రాజ్యమున ప్రతిష్ఠితమైన పిదప బాహ్య సామ్రాజ్యమున నావిష్కరించబడవలయును. ఈ వికాసమునకు పరిమితు లేర్పరుపబూనుట, పృథగ్ దృష్టితో రాజకీయములు, మతములు, తత్త్వము, ఆధ్యాత్మికానుభవములు వేర్వేరని పరస్పరసంబంధము లేనివని భావించుట మన యవివేకము. ఈ కృత్స్నదృష్టి గలవారగుటచే ప్రపంచ కళ్యాణమునకై భాగవత జీవన స్థాపనకు భారతదేశమే కేంద్రమగుననియు, భారతదేశౌన్నత్యము, తద్దేశముయొక్క యథార్థ స్వాతంత్ర్యము తప్పనిసరి యనియు శ్రీ అరవిందులు వెల్లడించియున్నారు. ఈ స్థితిలో నీవిషయముల సూక్ష్మముగా సూచించుట యసమార్థ్యము గాకపోదని తలంచెదము.

ఇట్లు శాసనబద్ధమైన ఆందోళనమున కంతరాయములు దొర్లి, రాజమార్గమున నోరెత్తి హృదయవేదనను వెల్లడించుటకును ఏ కార్యము చేయుటకును వీలులేని విషమస్థితి యేర్పడినకొలది రాజసగుణ ప్రేరితులగు కొందఱు యువకులు చిత్తశాంతి గోల్పోయి పాశ్చాత్య పద్ధతులనే శరణ్యముగాగొని పశుబలముతో ప్రభుత్వము నెదుర్కొనవలయునని నిశ్చయించ నారంభించిరి. రష్యా చక్రవర్తి జార్ నిరంకుశ చర్యలకు పీడనమునకు ప్రతీ

కారముగా రష్యాదేశీయు లవలంబించిన విప్లవమార్గములే ఈ యువకవర్గమున కాదర్శప్రాయము లైనవి. తదాదర్శానుగుణముగా విధానముల నాలోచించి విప్లవ సంఘముల నతిరహస్యముగా నెలకొల్పుటకును, విదేశములకు గొందఱనంపి 'బాంబు' - ప్రేలుడుగుండు - లను మారణసాధనములను తయారుచేయ నభ్యసించుటకును వలయు నన్నిపన్నాగముల పన్నిరట. కొరడా దెబ్బలతో ఏకాంతవాస నిర్బంధములతో శిక్షితులైన యువకులు ప్రభుత్వోద్యోగులను దొరలను రహస్యముగా హతమొనర్పవలయునని ప్రమాణపత్రముల నెత్తురుతో వ్రాసికొని దీక్షబూనిరట. గవర్నరులు ఉన్నత ప్రభుత్వోద్యోగులు ప్రయాణమొనర్చు 'రైలుబండ్లను ప్రేలుడుగుండ్లతో ధ్వంసమొనర్చి వారి ప్రాణముల నిలువున తీయుటకు కుట్రలు పన్నసాగిరట. ఉద్యోగులను రహస్యముగా నేమఱపాటున నొంటరిగా జిక్కించుకొని హతమొనర్చుటకు యువకు లన్వేషింప దొడంగిరట. భయానకమగు నీ విప్లవకారుల కార్యములన్నియు కుట్రలన్నియు ప్రభుత్వమువారు ప్రకటించిన 'రౌలట్' నివేదికయందు వివరముగా బేర్కొనబడి యున్నవి.

అన్నెము పున్నె మెఱుంగని 'కెన్నడీ' దంపతు

లను తమ్ము శిక్షించిన 'కింగ్సుఫోర్డు' దంపతులుగా భ్రమించి కొందఱు యువకులు హత్యగావించిరి. ఈ దారుణహత్యాపాపమే ఆలిపూరు బాంబు కుట్ర కేసుగా పరిణమించినది. ఈవిప్లవమునకు నాయకుడుగా నెన్నబడిన వారీంద్రుడు శ్రీఅరవిందులకు తమ్ముడను కారణముననో, జాతీయవాదము నూరిపోసి స్వాతంత్ర్య దర్శమును వెల్లడించి దేశీయులకు శివమెత్తించిన నాయకుడను కారణముననో, మఱేకారణముననో ఈ కుట్రకంతకును సూత్రధారి శ్రీఅరవిందులేయని యభిప్రాయపడి ౧౯౦౮-వ సంవత్సరమున మే నెల ౨-వ తేది ఉషఃకాలమున నైదుఘంటలకు పోలీసు కమీషనరు, మఱియితరోన్నతోద్యోగుల సాజమాన్యమున, శ్రీఅరవిందులు నివసించుచుండిన గృహమును ముట్టడించిరి. అపుడు పోలీసువారు శ్రీఅరవిందులను బంధించి వీరింటిలోని ప్రతిగదియు ప్రతిపెట్టెయు ప్రతివస్తువును శోధించిరి. అట్లు పరిశీలించి కొనిపోబడిన పెక్కు కాగితముల నుండియే, శ్రీఅరవిందులు ధర్మపత్ని మృణాళినీదేవికి వ్రాసిన దివ్యలేఖలు కోర్టువారిమూలమున మనకు లభించినవి. మూడుదినములు లొకటిరెండు పోలీసు స్టేషనులందును ఆవల మే నెల ౫-వ తేది ఆలిపూరు జయిలు నందును

వీరిని బంధించియుంచిరి. ౭-వ తేది మేజస్ట్రేటు కోర్టులో విచారణ ప్రారంభమైనది.

ఇట్లకస్మాత్తుగా ఘోరమైన హత్యారోపణక్రింద బంధింపబడుటను గురించి, కారాగారవాసములో తనకు కలిగిన సకలానుభవములను గురించి, నరకతుల్యమైన జయిలు తత్పరిపాలనా విధానములను గురించి, యేకాంత వాసమున తా ననుభవించిన భగవద్దర్శనమునుగురించి, జయిలు పరిపాలనా విధానమే నిందనీయముగాని ఉద్యోగధర్మమును నెఱవేర్చు వ్యక్తుల లోప మంతగా గాదనువిషయమున కుదాహరణముగా జూపిన జయిలు యుద్యోగుల ధార్మికబుద్ధి, దయాసానుభూతులు వీనిని గురించి, భగవాను డెందునిమిత్తము ఈ యభియోగ వ్యాజమున తన్నేకాంత కారాగారమున నుంచినది, తన కందు లభించిన శ్రీకృష్ణసందర్శనాదేశముల గురించి అతి విపులముగా శ్రీఅరవిందులు ౧౯౦౯-లో జయిలు నుండి విడుదలయై వచ్చినతరువాత 'ఉత్తరపర' లో నొసంగిన మహోపన్యాసమునందును * వంగభాషలో రచించిన 'కారాకాహిని'-జయిలు కథ-అను గ్రంథము

*ఉత్తరపరోపన్యాసముమాత్రము 'శ్రీఅరవిందోపన్యాస' మను పేర గ్రంథరూపమున తెలుగులో బ్రకటితమైనది.

నందును బేర్కొనియున్నారు. ఈ మహత్తర విశేషములను ప్రత్యక్షముగా శ్రీఅరవిందుల వాగ్జాల మూలముననే యెఱుంగుట మేలని యీ రెండు గ్రంథములనుండి కొన్ని భాగములను సంగ్రహముగా నిందు బొందుపఱచు చున్నాము.

మే నెల ౧-వ తేది శుక్రవారము రాత్రి నిశ్చింతతో నిద్రించితిని. ఉషఃకాలమున ప్రాయశః ౫-ఘంటలపుడు నా సోదరి భీత హృదయయై నా గదియొద్దకు వచ్చి నన్ను పేరుపెట్టి పిలిచెను. నేను మేల్కాంటిని. మరుక్షణముననే నా చిన్నగది సశస్త్రులైన పోలీసులతో నిండిపోయెను..........మఱికొంతమంది ఇన్స్పెక్టర్లు, ఎఱ్ఱతలపాగావారు, గూఢచారులు, శోధనచేయవలసినపుడుండవలసిన సాక్షులను వెంటనిడికొని చేత పిస్తోళ్ళు పట్టుకొని వీరదర్పముతో పరుగెత్తి వచ్చుచుండిరి—తుపాకులతో ఫిరంగులతో సురక్షితము నభేద్యమునగు నొక కోటను స్వాధీనపఱచుకొనుటకో యనునట్లు—ఒక శ్వేతాంగ వీరపురుషుడు నా సోదరి వక్షస్థలముకేసి పిస్తోలును గురిపెట్టి బెదరించినట్లును వింటిని.

అపుడును అర్ధనిద్రావస్థలో పడకమీద గూర్చుంటిని. క్రేగన్ ఇట్లు ప్రశ్నించెను. "అరవిందఘోషు ఎవరు!" నేనే అరవిందఘోషు నంటిని. తత్క్షణమే నన్నుపట్టుకొనుడని యొక పోలీసునకు వారుత్తరవుచేసిరి. అపుడు క్రేగన్‌దొర ప్రేలిన క్షుద్రవాక్కులపై నొకక్షణము మాకు వాగ్వాదము జరిగెను. శోధనచేయు వారు పడసిన అధికారపత్రమును - శోధనపు ఉత్తరువును (Search warrant) జూపించగోరితిని. దానిని చదివి

చేవ్రాలు చేసితిని. వారంటులో జేర్చబడిన బాంబువిషయమును దిలకించి ఈ పోలీసుసైన్య మిట్లావిర్భవించుట ముజఫర్‌పూర్ హత్యాసంబంధ మని గ్రహించితిని. కాని నాయింట బాంబులను గాని మఱి యితరోపద్రవకరమైన స్ఫోటకపదార్థములను గాని కనిపెట్టుటకు ముందే బాడీవారంటు (శరీరమును బంధించుటకు వలయు నుత్తరువు) లేకుండగనే నన్నెందులకు పట్టుకొనిరో ఏమాత్రము తెలిసినదిగాదు. అయినను తత్సంబంధముగా నే నే వ్యర్థాటంక మొనర్పలేదు. ఆ వెనువెంటనే క్రేగన్‌దొరగారి యాజ్ఞపై పోలీసులు నా చేతికి సంకెళ్ళు తగిలించిరి. మొలకు త్రాడు చుట్టిరి. ఆ త్రాటిని హిందూస్థానీపోలీసొకడు పట్టుకొని నా వెనుక నిలుచుండెను.

*

*  *

పోలీసు ఉన్నతోద్యోగులలో నొకరగు వినోదకుమారగుప్త నన్నుగుఱించి క్రేగన్‌దొర కేమో తెలుపఁ బ్రయత్నించినట్లున్నది. తదనంతరము క్రేగన్ నన్నిట్లు ప్రశ్నించెను.

'నీవు బి. ఏ. ప్యాసయితివా? ఇటువంటి బాడుగింటిలో నెట్టి సామానులు (గృహాలంకారమునకు వలయు రకరకముల సామానులు), పరుండ పడక గూడ లేకుండ నున్నావే? ఇట్లు నివసించుట నీబోటి విద్యాసంస్కృతిగలవారిపట్ల లజ్జాజనకము కదా?'

నే నిట్లని ప్రత్యుత్తర మిచ్చితిని. 'నేను బీదవాడను; బీద వారివలెనే యుందును.'

ఆ దొర వెంటనే తీవ్రముగా నిట్లు వాకొనెను. 'అట్లయిన

నీవు ధనవంతుడవగుటకే ఈసకల కర్మకాండను గావించితివా?'

దేశహితేచ్ఛ, స్వార్థత్యాగము, దారిద్ర్యవ్రతము వీని మహాత్మ్యములగురించి స్థూలబుద్ధులగు ఇంగ్లీషువారికి తెలియజెప్పుట దుస్సాధ్యమని తలంచి నే నందులకు గడంగలేదు.

*

* *

పరిశోధనా సందర్భమున నుదాహరించగల విశేషము లేవియులేవు. కాని చిన్న అట్ట పెట్టెలో దక్షిణేశ్వరమునుండి తెచ్చిపెట్టిన మట్టిముద్ద పదిలపఱచబడియుండెను. క్లార్కుదొర గారు దాని నత్యంత సందిగ్ధభావముతో వీక్షించి పరీక్షించెను అతని కది యేదో యొక నూతనము భయంకరము తేజోవిశిష్టము నైన స్ఫోటకపదార్థమని సందేహ మేర్పడెను.........తుట్టతుద కది వట్టిమట్టితప్ప మతేమియు కాదని రాసాయనిక పరిశోధనాధి కారి యొద్దకు బంపుట యనావశ్యకమని సిద్ధాంత మాయెను. సోదా సందర్భమున పెట్టె తెఱచుటతప్ప మతేసౌఖ్యము నే కలిగించుకొన లేదు. నా కేకాగితమునుగాని లేఖనుగాని చూపించలేదు. వినిపించను లేదు.........అపుడపుడు ఎదో కాగితములను బరీక్షించి 'అతి ముఖ్యమైనది.' 'అత్యావశ్యకమైనది' యని వినోదబాబు గొంతెత్తి బిగ్గఱగా చెప్పుచు క్రేగణదొరకు సమర్పించుచుండెను. ఈ యవసరమైన కాగితము లేవో నే నెఱుంగజాలను. నా కావిష యమై యభిలాషగూడ లేకుండెను. కారణము, నా యింట ప్రేలుడుపదార్థముల సిద్ధమొనర్చు ప్రణాళికపత్రము గాని కుట్ర సంబంధమైన ఏ కాగితముగాని యుండుట యెన్నడు సంభవము గాదని నే నెఱుంగుటయే.

# మూ డ వ త రం గ ము

*

* *

౧౯౦౮-వ సంవత్సరము మేనెల ౧-వ తేది శుక్రవారము నాడు 'వందేమాతరం' కార్యాలయమున కూర్చుండియుంటిని. * శ్రీయుత శ్యామసుందర చక్రవర్తిగా రపుడు ముజఫరపురము నుండి వచ్చిన యొక టెలిగ్రాము నాచేతికిచ్చెను. దానిని జదువగా ముజఫర్ పూర్ నందు బాంబుగుండ్లు ప్రేలినవని యూరోపియన్ స్త్రీ లిద్దఱు మరణించిరని తెలిసినది. నాటి 'ఎంపయిర్' పత్రికలో పోలీసు కమీషనరు తన కా హత్యాకాండలో నెవ రెవరికి సంబంధమున్నది తెలియునని వారు త్వరలో బంధింప బడుదురని చెప్పినట్లు ప్రకటితమైనది. కాని ఇట్లనుమానింప బడినవారిలో నా పేరే ముఖ్యస్థానము వహించినదని, పోలీసువారి దృష్టిలో నేనే ప్రధాన హత్యాకారకుడను యని, రాష్ట్ర విప్లవ కారులగు యువకమండలికి నేనే మంత్రదాతనని, గుప్తనేతనని నాకపుడు తెలియదు. ఈ దినమే నాజీవితమం దొక యంకములో తుదిరంగమని, నాముం దొక సంవత్సర కారాగారవాస మున్నదని, అంతకాలమును మానవ జీవనముతో నా కున్న సంబంధమంతయు శిథిలమగునని, మానవ సంఘమున కావల నేడాదిపాటు బోనులో పశువువలె నుండవలసియుండునని నాకు తెలియదు. మీదు మిక్కిలి మరల నేను కర్మక్షేత్రమున ప్రవేశించునపు డీపూర్వ పరిచితుడైన అరవిందఘోషుగాగాక నూతన పురుషుడనై నూతన ప్రవర్తనము, నూతనబుద్ధి, నూతన మనఃప్రాణముల గైకొని నూతన కర్మభారమును వహించి ఆలిపూరు ఆశ్రమమునుండి బయల్పడుదు

---

* వీ రిపుడు మరణించినారు.

వనియు నాకు తెలియదు. ఈ ఒక సంవత్సర కారావాసము నొక వత్సర మాశ్రమవాసమని చెప్పవలసియున్నది.

*

* *

అనేకదినములుగా హృదయస్థుడైన నారాయణుని దర్శించు నిమిత్తము తీవ్ర ప్రయత్న మొనర్చితిని. జగద్ధాతయగు పురుషోత్తముని సఖ్యభావమున దాస్యభావమున బొందుటకు మహత్తరమైన ఆకాంక్షతో నుంటిని. కాని వేలకొలది ప్రాపంచిక వాసనల యాకర్షణము వలన, నానావిధకర్మానురక్తివలన, అజ్ఞాన జన్యమైన ప్రగాఢాంధకారమువలన నది సాధ్యమైనది కాదు. తుదకు పరమదయాళువు సర్వమంగళమయుడునగు శ్రీహరి ఆసకలశత్రువుల నొక్కదెబ్బతో సంహరించి, నా యాకాంక్షను సుసాధ్య మొనర్చెను, యోగాశ్రమమును జూపించెను; మఱియు గురు రూపమున, సఖిరూపమున ఈ క్షుద్రసాధనాకుటీరమున నాతో నివసించెను. ఆయాశ్రమ మింగ్లీషువారి కారాగారము. నాజీవిత మందీ యాశ్చర్యవైపరీత్యమును, అనగా నా హితాభిలాషులగు మిత్రు లేమాత్రము నా కుపకార మొనర్పలేరని, అనిష్టకారులగు శత్రువులే నా కధికోపకార మొనర్చిరని పలుమారు గుర్తించితిని. ఎవరిని శత్రువులని బిలుతును? — నా కెవరును శత్రువులు లేరు- వారు నా కనిష్ట మొనరింపగోరగా నాకది హితమే అయినది. బ్రిటీషుగవర్నమెంటు వారి కోప దృష్టియొక్క ఏకమాత్ర ఫలము నేను భగవానుని బొందుటయే.

*

* *

విచారణ ప్రారంభమగుటకు ముందీ యీదినములలో పోలీసు శాఖలోని ఉన్నతాధికారులు, గూఢచారులు, ఇతరులతోపాటు శ్రీ అరవిందుల వద్దనుండియు, కేసుజాడలదీసి, ఒప్పుదల వాఙ్మూలమును గ్రహించవలయునని చేసిన ప్రయత్నము లనేకములు, చిత్రములు. గూఢచారకృత్యములో నతినిపుణుడైన మాల్వీశాఅసులే ఆల్ మెగారు ధర్మమును గుఱించి మహోపన్యాస మిచ్చి తనభావమును మార్చి తన దోషము నొప్పింపగోరి చేసిన మహా ప్రయత్నమును గుఱించి శ్రీఅరవిందులే యిట్లు రచియించియున్నారు.

మాల్వీసాహెబు ధర్మసంబంధమైన యొక మహోపన్యాసమును నాకు వినిపించెను. "హిందూ ధర్మమునకు ఇస్లాం ధర్మమునకు నొకటే మూలమంత్రము. హిందువుల ఓంకార త్రివర్ణములు అ. ఉ. మ; ఖొరానుయొక్క మొదటి మూడక్షరములు అ.ల.మ. భాషాతత్త్వ నియమానుగుణముగా 'ల'కు బదులు 'ఉ' వ్యవహృతమైనది. అయినను స్వధర్మముయొక్క విశిష్టతను అక్షతముగా నుంచవలెను. ముసల్మానులతో హిందువులు భుజించుట నిందనీయమే. సత్యవాదియైయుండుట గూడ ధర్మము యొక్క ప్రధానాంగము. 'అరవిందఘోషు హత్యాకారివర్గమునకు 'నేత' అని దొర లందురు. భారతదేశముపట్ల నిది మిక్కిలి దుఃఖకరము, లజ్జాకరమైన విషయము. ఇపుడు సత్యవాదితను బోషింపగలిగిన యెడల ముప్పు తప్పును." విపినచంద్రపాలు శ్రీ అరవిందఘోషు

వంటి ఉచ్చచరిత్ర విశిష్టులైన మానవు లేవి చేసినను దానిని ముక్త కంఠముతో నొప్పుకొనెదరని మాల్వీగారి దృఢవిశ్వాసము!

*
* *

ధర్మభావమునం గున్నత్తుడై యున్నను, పాపము మాల్వీ సాహెబు తన గూఢచారితనమును విడిచిపెట్టలేదు! వారొకమారు నన్నిట్లడిగిరి: 'మీ తమ్మునికి బాంబులు చేయు నిమిత్తము తోట నిచ్చుటలో గొప్ప తప్పొనర్చితివి; ఇది బుద్ధిమంతులపని గాదు'. ఆతని సంభాషణోద్దేశ్యమును గ్రహించి చిరునవ్వునవ్వి నే నిట్లంటిని: 'మహాశయా, తోట నాకెంతో నాతమ్మునికిని అంతే; నే నతని కిచ్చితినని, అథవా ఇచ్చినను, బాంబులు తయారుచేయుట కిచ్చితినని తమ రెచ్చటినుండి సంగ్రహించితిరి?' మాల్వీసాహెబు తత్తరపడి యిట్లు సర్దుకొనెను "లేదు, లేదు, నీ వట్లు చేసితివా యనియే నే నడిగితిని."

*
* *

శైలేంద్రుని నన్ను లాల్ బజారు పోలీసుస్టేషన్ రెండవ అంతస్తులో, నొక గదియం దుంచిరి. మా యాహారము కొద్ది తినుబండారములే. కొంచెము సేపటికి ఇంగ్లీషు వారిద్దఱు మా గదిలో ప్రవేశించిరి. అం దొకరు సాక్షాత్ పోలీసుకమీషనరగు హ్యాలిడే దొరయని ఆవల తెలిసినది. మే మిద్దఱ మొకటిగానుండుట చూచి హ్యాలిడేదొర సార్జెంటుపై మండిపడెను. నన్ను నిర్దేశించి 'జాగ్రత్త! ఈతనితో నెవరును కలిసియుండుటగాని మాటాడుటగాని కూడదు' అని సార్జెంటుతో చెప్పెను. తత్క్షణమే శైలేంద్రుని మఱొక గది

లోనికి గొంపోయి బంధించిరి. తక్కిన వారందఱు వెళ్ళిపోయిన తరువాత హ్యాలిడే నన్నిట్లు ప్రశ్నించిరి 'ఈ కాపురుషోచితమైన దుష్కార్యలో సంబంధమున్నందులకు నీ కేమియు సిగ్గులేదా?'

'నే నిందు లిప్తుడనని మీ రూహించుటకు మీ కేయాధారమున్నది?' అని నే నడిగితిని. ఇందుకు ప్రత్యుత్తరముగా వారిట్లనిరి. 'నే నట్లూహించుటగాదు, నా కంతయు దెలియును.' నే నిట్లంటిని 'ఏమి తెలియునో ఏమి తెలియదో మీకుమాత్రమే యవగతము. ఈ హత్యాకాండతో సకలసంపర్కమును సుతరాం నే నంగీకరించను.' హ్యాలిడే మరేమాటయు ననలేదు.

నన్ను బంధించుటకు ఒకటిన్నర నెలకుముందు అపరిచితుడైన యొక పెద్దమనిషి నా కగపడెను. ఆయన ఇట్లనెను 'మహాశయా, నన్ను తమకు తెలియదు. కాని తమపట్ల భక్తియున్నందున తమకు జాగ్రత్తగా నుండుడని తెలుపుటకు వచ్చినాను. తమరు కొన్నగర్‌లో నెవరెవరితో నేమేమి మాటాడినదియు, నచ్చటికి తమ రెపు డెందులకు వెళ్ళినదియు, నచ్చట మీ కేనేని యిల్లున్నదియు తెలియగోరుచున్నాను. 'ఇల్లులేదు, ఒక పర్యాయము కొన్నగర్ వెళ్ళియుంటిని, కొందఱితో మాటాడుటగూడ జరిగినది.' అని నే నంటిని. అంత నతడిట్లు విన్నవించి యుండెను. 'ఇక నేమియు చెప్పనవసరములేదు, ఇపు డికమీద కొన్నగర్ వాసుల నెవరిని గూడ చూడవలదయ్యా తమరు. తమకు తమ సోదరులు వారీంద్రునకు విరుద్ధముగా దుర్మార్గులు కుట్రపన్నుచున్నారు, త్వరలో వారు మి మ్ముభయులను విపత్తులో ద్రోయుదురు. దయచేసి యింకేమియు నన్నడుగవలదు బాబూ.' నే నపు డిట్లడిగితిని. 'మహాశయా! ఈ యసంపూర్ణసంభాషణము వలన నా

కే యుపకారము కలుగునో నే నెఱుంగలేకున్నాను. కాని నాకు సాయమొనర్పవచ్చితిరి. అందులకు ధన్యవాదములు. నే నిక నేమియు నెఱుంగ గోరుటలేదు. భగవానునిపై నాకు సంపూర్ణ విశ్వాసము గలదు. ఆయనయే నన్నెల్లపుడును రక్షించును. ఈ విషయమున స్వయముగా ప్రయత్నించుటగాని జాగ్రత్తపడుట గాని నిష్ప్రయోజనము.'

ఏమియు భయపడవలదని, నానిర్దోషత్వము సంపూర్ణముగా రుజువగునని మాయింటిలో చెప్పవలసినదిగా ఆనాడు కోర్టుకు వచ్చియుండిన బంధువులతో నే నంటిని. ఇట్లగుననియే నామనస్సునందు దృఢ విశ్వాస ముదయించెను. మొదట నిర్జనకారావాసమున మనస్సు చలితమైనది గాని మూడుదినములు ప్రార్థనలో ధ్యానములో గడిపినదానికి ఫలితముగా నిశ్చలశాంతి, అచంచల విశ్వాసము హృదయమున నావిర్భూతమైనవి.

*

* *

నా నిర్జనకారాగారపుగది తొమ్మి దడుగుల పొడవు. ఐదారడుగుల వెడల్పు. దానికి కిటికీయే లేదు. ముందుభాగమున పెద్ద ఇనుపకమ్ముల తలుపు. నాకు నిర్దిష్టమైన వాసస్థాన మీ పంజరమందే. గదికిముందు కొద్దిపాటి ఖాళీస్థలము. నేల రాళ్ళతో పఱచబడినది. చుట్టును పెద్ద ఇటుకరాతిగోడ. దీని కొక కొయ్యతలుపు. పైభాగమున మనుష్యుడు నిలువబడగా వాని కన్నులంతయెత్తున దీనికి గుండ్రముగా చిన్నరంధ్రము లున్నవి. తలుపు మూసియున్నపుడు సెంట్రి-జయిలుకాపరి-ఈ రంధ్రములందు నేత్రములుంచి ఖయిదీ యేమిచేయుచున్నదియు నపుడపుడు చూచుచుండును. కాని ఆ

ఖాళీస్థలముననున్న గోడగదితలుపు సాధారణముగా తెఱువబడియే యుండును. ఈ విధమైన గదులు ఆఱు వరుసగా నుండును. ఆ గదుల నారింటిని డిక్రీలందురు. డిక్రీల యర్థ మధికముగా శిక్షితులైనవారి గదులనియే......ఇందునను ఎక్కువ తక్కువలు గలవు. అధికశిక్షకు పాలైనవారి విషయములో గదికి ముందు ఖాళీస్థలములో నున్న ప్రహరీగోడతలుపు బంధింపబడి యుండును. మానవ సంఘమునుండి సంపూర్ణముగా వేఱుచేయబడి 'సెంట్రీ'ల కన్నులు, రెండుపర్యాయము లాహారము పెట్టిపోయెడి ఇతరఖయిదీల ఆగమనము, ఇవియే ప్రపంచముతో వీరికిగల ఏకసంబంధము.

*

* *

ఇక మాకు కావలసిన నిత్యోపకరణముల విషయములో గూడ సహృదయులగు మా పరిపాలకోద్యోగు లతిథిసత్కార లోపమొనర్చలేదు. ఒక పళ్ళెరము భుజించుటకు; త్రాగుటకు గిన్నె; రెండును పింగాణివి. రెండు జయిలు కంబళ్ళు. ఇవియే మా సర్వస్వము. పళ్ళెమును గిన్నెను చక్కగా తోమిన తళతళ మెఱయుచు గది కలంకారముగా నుండును. ఈ దృశ్యముతో హృదయమానందమగ్నమై పోవును. నా యీ యానందమును గ్రహించి, నేల చదరముగా లేక మిట్టపల్లముతో పాడుగానున్నందున, భోజన సమయమున నా పళ్ళెముగూడ గుండ్రముగా దిరుగుచు నృత్యము నచేయును. ఒకచేతితో భుజించుచు రెండవచేతితో గట్టిగా పళ్ళెమును బట్టుకొనియుండుటకన్న గత్యంతరములేదు. లేకున్న పళ్ళెము తిరుగుచు అందుండు పిడికెడన్నమును అంతర్ధానమగును. పళ్ళెముకంటె మఱింత నుపయుక్తము, ప్రియకరమునైనది గిన్నె. బ్రిటిషు

సివిలియన్ ఏట్లో యట్లే జడపదార్థములో నీగిన్నెయు. అతడొక్క మండలకరగ్రాహి, న్యాయాధిపతి, స్థానికపరిపాలనాధ్యక్షుడు, రక్షకభటాధికారి, ఇవి యవి యననేల, సకలపదవుల నలంకరించి సర్వాంతర్యామిగా పరివర్తన మొందగలడో ఆట్లే నా గిన్నెయు నానావస్థలలో నానారూపము లెత్తి నా కుపకరించగలదు. గిన్నెకు జాతిలేదు, విచక్షణలేదు. ఈ గిన్నెలోనే నీళ్ళు తీసికొని శౌచక్రియ నొనర్తును. ముఖము గడుగుకొనుటకు స్నానము చేయుటకు ఆగిన్నెయే యాధారము. భోజనసమయమున ఆ గిన్నెలోనే పప్పు, లేదా కూర వడ్డించబడును. దానితోనే జలపాన మొనర్చవలెను, ఆచమన మొనర్చవలెను. ఇట్లు సర్వకార్యసమర్థతగల అపూర్వము నమూల్యము నగు వస్తువు ఇంగ్లీషు వారి జయిళ్ళలో మాత్రమే లభింప సంభవము! ఈ గిన్నెయే సాంసారికోపాయకరముగాను యోగసాధన స్వరూపముగా గూడను అయినది. ఘృణమును బరిత్యజించుట కిటువంటి సాహాయ్యకారి యుపదేష్ట నాకెచ్చట లభించును?

*

* *

గదిలోపలనే కోల్తారు పూసిన రెండుడబ్బాలు శౌచక్రియకు. ఉదయము మధ్యాహ్నము రెండు వేళలందు 'తోటి' వచ్చి వీనిని శుభ్రముచేయును. కాని ఇతరసమయములందు ఉత్సర్జన మవశ్యమాయెనో ప్రాయశ్చిత్తముగా ఘంటలకొలది యీదుర్గంధము ననుభవించవలసినదే. ఇట్టి చిన్నగదిలో ఈ దుర్గంధములో ఆహారము భుజించుట, రాత్రి నిద్రించుట, ఈ యనుభవమును వర్ణించ నవసరములేదు.

## మూడవ తరంగము

*
* *

అది గ్రీష్మకాలము, నా చిన్నగదిలోనికి ఇంచుమించే మాత్రము గాలిరాకుండ నిషేధింపబడినది. ఆ మే నెల యందు తీవ్రమైన మాడ్చివేసెడు సూర్యకిరణములుమాత్రము నిరభ్యంతరముగా ప్రవేశించును. గదిలోనుండు వేడిమికి ఆవిరి లీనుచుండును. అపుడు నోరెండికొనిపోవు తీవ్ర పిపాసను శమింపజేసికొనుటకు తగరపుడబ్బాలోని వేడి వేడి నీళ్ళెయాధారము. ఎన్నిమార్లో త్రాగుదును గాని నోరెండిపోవుట మాత్రము తగ్గదు. పైపెచ్చు ఒడలెల్ల చెమటలో నిండి మఱుక్షణమే దాహ మినుమడించెడిది. కొందఱి గదులముంగు మట్టికుండలతో జల ముండును. అట్టివారు తమ పూర్వజన్మకృతతపస్సును స్మరించి చరితార్థులైనట్లు తలంతురు. ఇందువలన తీవ్రపురుషకారవాదులుగూడ నదృష్టమనుటను విశ్వసించక తప్పదు.

ఈ యదృచ్ఛాలాభమున నేను సంతుష్టిగాంచినను, నా యీ జల కష్టము సుహృదయుడగు జయిలుడాక్టరునకు దుర్భరమైనది. ఆయన నాకై మట్టిపాత్రను సంపాదింప బ్రయత్నించెను. ఆ వ్యవహారముతో నాతనికి సంబంధము లేదుగాన చాలదినములాయన తన ప్రయత్నములో కృతార్థుడు కాలేదు. చివరకాతనిమాటమీద నే ప్రధానజమేదారు డెచ్చటనుండియో మట్టి పాత్ర నొకటి సంపాదించి తెచ్చియిచ్చెను.

*
* *

రాత్రులందు ఒక కంబళిని నేలపైపఱచి మఱొక కంబళిని

దిండుగా మడిచి తలక్రింద పెట్టుకొని నిద్రింతును. వేడితాపము దుస్సహమైనపుడు కంబళ్ళ నుపయోగించుట కేమాత్రము సాధ్యము గాదు. అపుడు వట్టి నేలమీద పొర్లాడుదును. శరీరమునకు చల్లదనము గలుగగా నూరట జెందుదును. మాతయగు వసుంధర యొక్క శీతలోత్సంగస్పర్శ మెంతసుఖమో అపుడు గ్రహించితిని. కాని జయిలులో నీ స్పర్శసుఖ మంత రసవంతము గాదు. దీనివలన నిద్రాభంగమగును. తిరిగి కంబళి నే ఆశ్రయించవలయును. వర్షము కురిసిననాడు మా కానందము. అపుడుగూడ నొక బాధయున్నది. గాలివాన వచ్చినపుడు వాయుదేవుడు ధూళి ధూసరములతో, ఆకలములతో తాండవమొనర్చినతరువాత నా గది యొకచిన్న జలప్రళయమైపోవును. అపుడు రాత్రిపూట తడికంబళిని తీసికొని గదిమూల కుఱుకుటతప్ప గత్యంతరములేదు. ప్రకృతియొక్క లీలావిశేష మంతరించినను గూడ జలప్లావితమైన నేల ఆరునంత వఱకు నిద్రాశను వదలుకొని చింత నాశ్రయము నందవలసి యుండును. శౌచక్రియాపరికర ముండుచోటుమాత్రమే కొంత పొడిగానుండును. కాని ఆ ప్రదేశమున కంబళిపఱచుటకు నాకు మనస్కరించలేదు. ఇట్టిబ్బందిగానున్నను గాలివాననాడు మాత్రము కావలసినంత గాలి లోపలికివచ్చి, మండుటెండలకు కుంపటిలోనుండి యీవిరివచ్చునట్లుండు గది చల్లబడుచున్నందున, గాలివానకు మేమెల్లపుడు నాదరపూర్వకముగా స్వాగత మిచ్చుచుందుము.

ఉదయము నాలుగుఘంటల పదునైదు నిముసములకు ఘంట కొట్టెదరు. ఖయిదీలను లేపుట కిది మొదటిఘంట. కొన్ని నిమిసములైన తరువాత తిరిగి ఘంటవాయింతురు. అటుపిమ్మట ఖయిదీలు 'సైలు' లో బయటికి వచ్చెదరు. కాలుసేతులు ముఖము

కడుగుకొని 'లఫ్సీ' తిని పనుల ప్రారంభింతురు. అన్నిఘంటలు కొట్టుచున్నప్పుడు నిద్రించుట అసంభవముగాన నేనుగూడ లేచెదను. నేను కాలుసేతులు ముఖము శుభ్రము చేసికొని మరల గదిలో వసింతును. అల్పకాలములోనే 'లఫ్సీ' నా తలుపుముందు ప్రత్యక్షమగును. కాని దానిని మొదటిదినమున నేను భుజించలేదు. కేవలము కన్నులపరిచయము మాత్రము దానితోనైనది. కొన్నిదినము లయినతరువాత మొదటి పర్యాయము ఆ పరమాన్నమును భుజించితిని. 'లఫ్సీ' అనగా గంజితోకలిపిన అన్నము. ఇదియే నిజపేదల చోటాహజారీ. 'లఫ్సీ' త్రిమూర్తిగా లేదా త్రివిధావస్థాన్వితగా నుండును. మొదటి దినము 'లఫ్సీ' యొక్క ప్రాజ్ఞభావము అమిశ్రిత మూలపదార్థము, శుద్ధ-శివ-శుభ్రమూర్తి. రెండవదినమున 'లఫ్సీ' హిరణ్యగర్భము, పప్పుతో కలగలుపు. 'కిచ్చిడి' పేరుతో నభిహితము, పీతవర్ణము, నానార్థసంకులము. మూడవనాడు, 'లఫ్సీ' విరాట్‌మూర్తి. కొంచెముగా గుడమిశ్రితము, ధూసరవర్ణము. కొంతకుకొంత మానవు లుపయోగించ యోగ్యమైనది. ప్రాజ్ఞ హిరణ్యగర్భ సేవనము సాధారణ మర్త్యలోకపుమానవున కతీతమైనందున నేను బరిత్యజించితిని. ఒక్కొక పర్యాయము 'విరాట్టు' నుండి రెండు ముద్దల నుదరస్థమొనర్చుకొని బ్రిటిషు రాజ్యముయొక్క నానాసద్గుణములను, పాశ్చాత్య సభ్యతయొక్క మహత్తరమైన మానవహితానురక్తిని ఆలోచించుచు నానందమగ్నుడ నగుదును. ఈ 'లఫ్సీ' యే బంగాళీ ఖయిదీలకు పుష్టికరమైన ఏకమాత్రపు ఆహారమనియు తక్కిన దందయు సారశూన్యమనియు తెలుపుట యుచితము. అట్లయ్యును ఏమిచేయనగును! ఇట్టి యాహారమును వారు కడుపుకాలి యాకలి

మంట లెగయునపుడే తిననగును. అప్పుడైనను బలవంతముగా తీసికొని మనస్సునెట్లో సమాధానపఱచిన తరువాతనే దానిని తినవలయును. దానిరుచి యటువంటిది!

నిర్జనకారావాసమందు విచారణ దశలోనున్న ఆసామీలను శిక్షారూపమైన కష్టముల పాల్సేయుట శాసనవిరుద్ధమే. కాని 'స్వదేశీ,' 'వందేమాతరం' ఆసామీలకీ నియమ మన్వయించదు.

నా నిర్జనకారావాస సమయమున డాక్టరు డేలే, సహాయ సూపరిండెంటు, ఉభయులు సాధారణముగా ప్రతిదినము నా గదికివచ్చి నాతో కొంత సంభాషించిపోవుచుండిరి. మొదటినుండి వారి విశేషానుగ్రహమును సహానుభూతిని బొందగలుగుచుంటిని. ఎందులకో తెలియదు. వీరితోగూడ విశేష మేమియు మాటాడెడి వాడను గాను; వారే దడిగిన దానికి ప్రత్యుత్తర మిచ్చుచుంటిని, వారే విషయమును గుఱించి ప్రసంగించినను దానిని నెమ్మదిగా వినుటయో, లేదా యొకటి రెండు మాటలు సామాన్యముగా వచించి యూరకుండుటయో నా పని. నే నట్లుండినను వారు నాయొద్దకు రాకుండ మానలేదు. ఒకనాడు డేలే దొర నాతో నిట్లనెను. 'నేను సహాయసూపరింటెండెంటుతో చెప్పి నీవు ప్రతి దిన ముదయము సాయంకాలము రెండుపూటలు 'డిక్రీల' ముందు, అనగా గదుల శ్రేణిముందు, నడుచుటకు పెద్దదొరనుండి యనుమతిబడసితిని. దినమంతయు నొక చిన్నగదిలో నీవు బంధింపబడియుండుట నా కిష్టముగాలేదు. అందువలన మనస్సు కెకును, దేహముగూడ పాడగును.' ఆ నాటినుండియు నుదయము సాయంకాలము గదుల కెదురుగానున్న ఖాళీస్థలమున నడచుచుంటిని. సాయంకాలము పది నిముసములు ఇట్లు నడచుచుంటిని. కాని

ముదయమునమాత్ర మొకఘంట, ఒక్కొకప్పుడు రెండుఘంటల
కలకు బయటనే నడుచుచుంటిని. ఇంత సేపను కాలనిర్ణయ
మేమియు లేకుండెను. నాకిది మిక్కిలి యనుకూలముగా నుండెను.
ఒకప్రక్క జయిలుకర్మాగారము, మఱొకప్రక్క గోశాల. నా
యీస్వాధీనరాజ్యమున కీ రెండును ఎల్లలుగానుండెన. కర్మాగార
మునుండి గోశాలకు గోశాలనుండి కర్మాగారమునకు నిటు నటు
నడచుచు నడచుచు ఉపనిషత్తులలోని గభీరము, భావోద్దీపకము,
నక్షయశక్తి దాయకము నగు మంత్రముల నన్నింటిని ఆవృత్తి
గావింతును. లేదా ఖయిదీల కార్యకలాపములను, రకపోకలను
గమనించుచు సర్వఘటనములందును నారాయణుడే యను మూల
సత్యము నుపలబ్ధినందుటకు ప్రయత్నించితిని. వృక్షమందు, గృహ
మందు, ప్రహరీగోడయందు, మనుష్యునందు, పశువునందు, పక్షి
యందు, లోహమందు, మృత్తికయందు 'సర్వం ఖల్విదం బ్రహ్మ'
మను భావించి భావించి, ఈ మంత్రోచ్చారణపూర్వకముగా
సర్వభూతములందును ఆభావమునే యారోపించితిని. ఈవిధముగా
నొనర్చుటవలన కారాగారమిక కారాగారముగానే తెలియని
భావ మేర్పడినది. ఆ యున్నతకుడ్యము, ఇనుపకమ్ముల తలుపు, ఆ
సాదా గోడలు, ఆ సూర్యరశ్మిదీప్తనీలపత్రశోభిత వృక్షము, ఆ
సామాన్య వస్తువులు, అవి ఏవియు నిక నచేతనములు కావని, అవి
సర్వవ్యాపి చైతన్యపూర్ణములై సజీవములైనవని, అవి నన్ను
ప్రేమించుచు నన్నాలింగన మొనర్చుకొన నభిలషించుచున్నవని
యీవిధముగా నాకు బోధపడినది. మానవుడు మాటాడుచుం
డును, ఆవు [illegible]గుచుండును, పిపీలికలు పారాడుచుండును, విహంగ
మెగురుచుం[illegible]. అయినను ఇదంతయు ప్రకృతియొక్క లీల;

లోన మహత్తరము, నిర్మలము, నిర్లిప్తము నగు నాత్మ శాంతిమయా నందములో నిమగ్నమైయుండెను. ఒక్కొక్క పర్యాయము భగ వాను డీ వృక్షతలమందు ఆనంద వేణుగానము జేయుచు నిలు చున్నట్లు నాకు తోచెడిది. మఱియు నామాధుర్యమున హృదయ మాకర్షితమై పై కుబుకుచుండును. నన్నైవఁగొ యాలింగన మొనర్చుకొనుచున్నట్లు, తనయంకమందుంచుకొనినట్లు నాకెల్లపు డు తోచుచుండెడిది. ఈ భావ వికాసమున నా సమస్త మనః ప్రాణము లధికారము చెలాయించుచున్నవా యనునట్లు ఒక నిర్మలమైన మహాశాంతి విరాజిల్ల నారంభించెను. దానిని వర్ణించ నలవిగాదు. హృదయముయొక్క కఠినావరణ మపావృతముగా నారంభించెను. మఱియు సర్వజీవులపట్ల ప్రేమ ప్రవాహము బాహిరముగాసాగెను. ప్రేమతోపాటు దయ, కరుణ, అహింస మున్నగు సాత్త్వికభావములు నా రజః ప్రధానస్వభావము నభి భూతమొనరించి విశేష వికాసమునంద సాగెను. ఎక్కువ వికా సమునందుకొలదియు నానంద మధికమాయెను. మఱియు నిర్మల శాంతిభావము గభీరమయ్యెను. (కేసును) అభియోగమును గుఱిం చిన దుశ్చింత మొదటనుండియు దూరమయిపోయెను. ఇపుడా విషయమై విపరీతభావము మనస్సు నావరించెను. భగవానుడు మంగళమయుడు, నా మంగళము నిమిత్తమే కారాగృహమందు నన్ను గొనివచ్చెను. కారాగృహ విముక్తి, అభియోగ ఖండనము నిశ్చయము గానగును. ఈ విశ్వాసము దృఢముగా నారంభించెను. దీని కావల ననేకదినము లే కష్టములను జయిలులో నే ననుభవించినదిలేదు.



నా కొకసారి కొద్దిగా జ్వరమువచ్చెను. అది వర్షాకాలము. పెక్కు కిటికీలతోనున్న ఆ పెద్దహాలులో చెమ్మ మిక్కుటమై గాలి వీచుచుండెను! అయినను ఆసుపత్రికి వెళ్ళుటగాని, ఔషదమును బుచ్చుకొనుటగాని నా కిష్టములేకుండెను. రోగముల గుఱించి, తచ్చికిత్సలనుగుఱించి నా భావములలో పరివర్తనమేర్పడి యుండెను. మందు తీసికొనుటలో నా కేమాత్రమును విశ్వాసములేదు. రోగము కఠోరము గానపుడు, ప్రకృతియొక్క సాధారణ క్రియాకలాపముననే నివారణమగును. వర్షాకాలపు గాలి తాకుటవలన నిట్లనారోగ్యము సంభవించెనని, దానిని యోగబలమున రూపుమాప సాధ్యమని, స్వయముగా సహేతుకముగ వారి యెదుట, నా యోగసాధనయొక్క సకల క్రియల యాథార్థ్యమును తత్సాఫల్యమును ప్రతిపాదింపవలెనని యిష్టముండెను. కాని డాక్టరు ఎమర్సన్ దొరగారు నా నిమిత్తమై మిక్కిలి విచారపడి గట్టిపట్టుదలతో ఆసుపత్రికి పోవలసిన ఆవశ్యకతను నాకు వివరించి చెప్పిరి. అచ్చటికి వెళ్ళినపుడు స్వగృహములోవలె, నెంతవఱకు సాధ్యమో, అంతవఱకు, నివసించుటకు భుజించుటకు నేర్పాట్లొనరించి యాదరముతో నన్నుంచెను. వర్షాకాలమగుడు, నా 'వార్డు' కు వెళ్ళిన, నా యారోగ్యము భంగమగునని, పెక్కుదినము లచ్చటనే నన్ను సుఖముగా నుంచవలయునని వారియిష్టము. కాని నేనే కావలెనని నా 'వార్డు' కు మరల వెళ్ళిపోతిని.



## గోరఖ్పునందును జయిలు పరిపాలనావిధానము

లోపభూయిష్ఠమని, అచ్చటిఖయిదీలు, మఱింత దుర్మా ర్గములు,దొంగతనములు, నానావిధములైన పాడునేరము లొనర్చగల చాకచక్యమునందు, చక్కగా శిక్షణల నంది గడతేరుటకు వలయు శిక్షణాలయములుగా జయి ళ్ళను పరివర్తన మొనరింతురని, ఇండియాలోని ఖయి దీలు, తుదకు చదువను వ్రాయను తెలియని, క్షుద్బాధ నపనయించుటకే గత్యంతరములేక దొంగతనముచేయు నిరుపేదలు,పామరులు అయినను పాశ్చాత్యదేశములలో సంస్కృతి విద్యాబుద్ధులుగల పెక్కుమందికంటె నెంతో ఉత్తములు, ఆదర్శప్రాయులు నని శ్రీ అరవిందులు తెలుపుచు జయిలు అధికారులు గూడ తన భావమునే బలపఱచిన విషయము నిట్లుదాహరించి యున్నారు.

ఆలిపూరు జయిలులో నుండిన డాక్టరు డెలేదార నాతో నిట్లనిరి. 'భరతఖండమునందలి సంస్కృతిగల పెద్దమనుష్యుని, పామరుని, సంఘమందు గౌరవముగల వ్యక్తిని, జయిలులోని ఖయి దీని, వీరి నెవరిని గుఱించిగాని విని స్వయముగా జూచి యనుభవ మును గడించిన కొలదియు, ప్రవర్తనలోనేమి గుణమందేమి మా కంటె వీరెంతో ఉత్కృష్టులను నాభావము దృఢమైనది. ఈ దేశపు ఖయిదీకిని యూరపుదేశపు ఖయిదీకిని మిన్నుకు మన్నుకు, స్వర్గమునకు పాతాళమునకు గలంత అంతరము గలదు. ఈయువకు లను జూచి నా యీ భావమును మఱింత దృఢపడినది. వీరి

చరిత్ర, ప్రవర్తనలను, నానా సద్గుణములను జూచినయెడల వీరు హత్యాకారులని గాని అరాజకులనిగాని ఎవ రూహించగలరు? వారిలో క్రౌర్యము, ఉద్రేకము, అధైర్యము, లేదా తిరుగబాటు, ఇవి లవమేని లేవు.'

ఈ ఆలిపూరు బాంబుకేసులో నొక ముద్దాయి అయిన గోస్వామి యను యువకుడు*'అప్రూవరాయెను'. ఆయన విషయ మిట అప్రస్తుతము. ఖయిదీ లందఱు నొక్కచోటనుంచిన తాను కేసు విషయమున నెక్కువగా సాయపడుటకు వీ లగునని, ఇతరులవద్దనుండి విషయముల గ్రహింతునని, మఱి కొందఱును ప్రభుత్వపక్షమున సాక్షులుగా వచ్చునట్లు ప్రయత్నింతునని అధికారుల కీతడు చెప్పినందుననే, ఏకాంతవాసములో నుండిన ఖయిదీలను, ఈ కేసుకు సంబంధించిన ఇతర ఖయిదీలను నొక్కచో నొకటిగా చేర్చుట తటస్థించినది. గోస్వామి ప్రార్థనమీఁదనే యీ మార్పు జరిగెనని, అందఱితో నుండుట తన సాధనకు భంగమని, శ్రీఅరవిందులు భావించిన విషయ మీక్రిందివ్యాసమువలన తెలియనగును.

* తోడిముద్దాయిల నేరమును, సత్యాసత్యముల లెక్క పెట్టక, రుజువుచేయుటకు ప్రభుత్వముపక్షమున సాక్షిగా తిరిగి తాను తప్పించుకొన ప్రయత్నించువాడు.

గోస్వామి ఎమర్సన్ దొరను బ్రతిమాలి యీ మార్పును కలిగించినాడని డాక్టరు డేలే మాకు తెలిపియుండెను. డేలే మాటయే సత్యముకావచ్చును. ఎట్లయినను ఈ మార్పువలన నేను తప్ప తక్కినవారందఱును బరమానందభరితులయిరి. అపుడితరులతో కలిసియుండుట నాకిష్టములేకుండెను. ఈ సమయమున నా సాధన మిక్కిలి తీవ్రముగా సాగుచుండినది. సమత, నిష్కామత, శాంతి క్రొద్దిక్రొద్దిగా ననుభవించుచుంటిని. కాని యపుడును ఆ భావములు దృఢపడలేదు. లోకులతో కలిసినపు డితరుల చింతా ప్రవాహాఘాతములు నా యపక్వము నవీనమునైన చింతనలపై బడినచో ఈక్రొత్తభావములు క్షీణించిపోగలవు, అసలే కొట్టుకొనిపోగలవు. వాస్తవమున కట్లేయైనది. సాధన పరిపూర్తి కొఱకు విపరీత భావోద్రేక మావశ్యకమైయుండెనని, అందుకొఱకే అంతర్యామి నన్ను హఠాత్తుగా నా ప్రియమైన విజనస్థితినుండి విడదీసి ఉద్దామరజోగుణ ప్రవాహమున బడవేసెనని నాకపుడు తెలియదు............ఇంచుమించు ముద్దాయీలు అందఱము నొక్కచో గుమిగూడియుంటిమి. రాత్రి రెండు మూడు ఘంటల వఱకు నెవరును నిద్రించజాలరు. ఇంతకాలము నిరుద్ధమైన సంభాషణములు, నవ్వులాటలు, పాటలు వర్షాకాలపు ప్రవాహమువలె నిరంతరము ప్రవహించుచుండును. నిశ్శబ్దముగానున్న కారాగారము కోలాహలధ్వనులతో ప్రతిధ్వనించును. *

ఆలిపూరు బాంబుకేసు సందర్భమున శ్రీఅరవిందులతోగూడ నుండిన పెక్కుమంది యువకులలో

* 'కారాకాహిని' అను బెంగాలీ గ్రంథమునుండి.

ఉపేంద్రనాథ బందోపాధ్యాయగారొకరు. 'విప్లవకారుని స్మృతికథనములు' అను ఆంగ్ల గ్రంథమును వీరు రచించిరి. అందు జయిలులోగూడ, శైవేలగు తోడి యువకులు, బాలురు, గావించు నాగడములు అన్యోన్య ఘర్షణములు వీనిని గురించి వర్ణించుచు శ్రీఅరవిందుల విషయమిట్లు పేర్కొనియున్నారు.

ఈ క్షుద్రఘర్షణలకు కేవల మతీతుడైయుండిన మానవుడు మాలో నొక్కరుమాత్రమే. వారే శ్రీ అరవిందులు. వారిని గురించి యెన్నెన్నో వింతకథనముల జయిలు కాపరులనుండి వింటిమి. వారాహారమే పుచ్చుకొనరని యొక ప్రతీతి యుండెను. వారికి మతిపోయినదనిగూడ పలువురు తలంచిరి. గండుచీమలను బరిణపురుగులను తన పళ్ళెరమున భోజనమును దిననిచ్చుచుండెనట. మతి స్వాస్థ్యముగల వారెవరికిని తోచనట్టి వింతవిషయముల వారొనర్చుచుండిరట. యథార్థమేమో కనుగొనుటకు పలుమారు నేను బ్రయత్నించితిని. కాని యీ విషయమై వారి నడుగుటకు నాకెన్నడు ధైర్యము లేకుండెను. వారి తల వెంట్రుకలు నూనెతో మెరయుచుండుట నే నొకనాడు చూచితిని. జయిలులో మాకు తలనూనె నిషేధింపబడినందున నిది విపరీతమై కలవరపఱచెను. అందువలన సాహసించి నే నిట్లంటిని 'మీరు తలకు నూనె రాచెదరా?' 'నేను స్నానమే చేయను' అని వారిచ్చినజవాబు నన్ను మ్రాన్పడజేసెను. 'అట్లయిన మీ వెంట్రుకలు నిగనిగలాడుచు కనపడుచున్నవే.' 'ఔను, నే నాధ్యాత్మికముగా నభివృద్ధి యగు కొలది కొన్ని భౌతికపరివర్తనములు నాయందు జరుగుచున్నవి.

నా వెంద్రుకలు శరీరము నుండియే క్రొవ్వును సంగ్రహించు చున్నవి.'

ఇంతకు ముం దిటువంటి సందర్భముల కొన్ని నేను గమనించి యుంటిని, కాని నా కవి యెన్నడు నర్థముకాలేదు. అటుతర్వాతను ఈ విధములయిన అద్భుతములను శ్రీఅరవిందులలో నెక్కువగా జూచితిని. ఖయిదీల బోనులో నేను గూర్చుండియుండగా వారికేసి చూచుట తటస్థించినది. వారికన్నులు రెండును గాజు గుండ్లవలె నుండ గాంచితిని. మనస్సుయొక్క నానావిధ వ్యాపారములను సంపూర్ణముగా నిలిపివేయుట, ఒకే విషయమున మనస్సును కేంద్రీకరించుట, వీనివలన నొకవిధమగు భౌతికఫలము వచ్చునని నేను విని యుంటిని. వెంటనే యువకులకు కొందఱకు ఈ దృశ్యమును జూపితిని. ఎవరును వారిదాపునకు బోవ సాహసించరైరి. తుదకు 'సచీన్' అను చిన్నవాడు మెల్ల మెల్లగా వారిని సమీపించి యిట్లనెను.

'మీ యాధ్యాత్మిక సాధనలవలన మీకేమి లభించినది?' శ్రీ అరవిందులు తన హస్తము నాతనిభుజముపై నుంచి యిట్లు జవాబు చెప్పెను.

'ఎందులకు, నాయనా! దేనికొఱకు నే నన్వేషణమొనర్చితినో అది (లభించినది)'.

అంత మా పిరికితనమును దులిపివేసికొని శ్రీఅరవిందుల అద్భుతానుభవముల నెఱుంగుటకై వారిచుట్టును మేము గుమిగూడితిమి. అంతర్జీవనమందలి యద్భుతరహస్యములను గుఱించి వారు సంభాషించిన దానినంతను నేను బోధపఱచుకొనలేక పోతిని. కాని యీ యతీతపురుషుడు తనజీవితమున నొక నూతనపథమును

ప్రవేశించెనని నేను స్పష్టముగా గనిపెట్టితిని. సంస్కృతియొక్క వేదాంతపద్ధతిని తా నెట్లు పూర్ణముగా గ్రహించినది, తాంత్రిక పద్ధతిని ఆమూలాగ్రముగ వశపఱచుకొనుస్థితిలో తా నున్న విషయమును, ఈ చివరపద్ధతి అత్యంతకష్టమైన ప్రక్రియ యని వారు మాకు తెలిపియుండిరి. ఈ కడపటిపద్ధతిని, అనగా తాంత్రిక పద్ధతిని ఎచ్చట నభ్యసించితిరని మే మడుగగా వారిట్లనిరి 'మనఃకక్ష్యలో నా కొక మహాయోగి ప్రత్యక్షమై నన్నందు ప్రవేశపెట్టెను'. ఆవల మనము చిక్కుకొనియున్న వ్యవహారము, వ్యాజ్యముయొక్క ఫలితమునుగుఱించి భవిష్యత్తును మీరు చెప్పగలరాయని మే మడిగితిమి. "నేను విడుదలగాంతును" అని వారు సెలవిచ్చిరి.

*

* *

ఈ కేసును ప్రభుత్వపక్షమున వాదించి నిర్వహించుటకు క్రొత్తమార్గమును ద్రొక్కి వంగ ప్రభుత్వము వారు మద్రాసునుండి సుప్రసిద్ధులు కీర్తిశేషులు నగు నార్టన్ బారిష్టరును ప్రత్యేకముగా బిలిపించుకొనియుండిరి. ప్రతిదినము వేయి రూపాయలవంతున ఒక సంవత్సరము పాటు ప్రభుత్వమువారు వారికి రుసుమిచ్చి బహూకరించియుండిరి. శ్రీఅరవిందుల పక్షమున తగిన న్యాయవాదిని నియమించి వారి నిర్దోషత్వమును రుజువు చేయుట కనువుగా ధనసాయ మొనర్చవలసినదని శ్రీ

అరవిందుల ప్రియసోదరి సరోజినీదేవిగారు దేశీయులకు విజ్ఞప్తి చేసికొనగా సుమారు ఇరువది ముప్పది వేల మొత్తము ప్రోగైనది. దీనివలన శ్రీఅరవిందులపట్ల దేశీయులకు గల ప్రేమాదరణములే గాక వారి నిర్దోషత్వమందుగల విశ్వాసమును వెల్లడి యగుచున్నది. ఇంతమొత్తమేని యానాటిదినములలో నొనగూడుట యాశ్చర్యము. శ్రీమంతులు, ప్రభుత్వసంబంధ మేవిధముగానేనిగలవారు, చందానొసంగ సాహసించజాలరు. సామాన్య జనులే, నిఱుపేదలే తమశక్తికి మించిన త్యాగ మొనర్చి ఈ ధనమును సమర్పించుకొనిరి. కన్నులులేని కబోదిబిచ్చగాడొకడు–ఎన్నాళ్ళు కష్టపడి కూడబెట్టెనో గాని–ఒకరూపాయ తెచ్చి సరోజినీదేవికి సమర్పించుకొనెను. చదువుకొనుచుండెడి బీదపిల్లవాడొకడు తన తిండినే తగ్గించుకొనుచు దాచిపెట్టి కొన్నిరూపాయల నిచ్చియుండెను. వారే ధన్యులు! శ్రీమతి సరోజినీదేవి మరల ముప్పదివేలు కావలయునని విజ్ఞప్తి చేసియుండిరి. శ్రీఅరవిందుల పక్షమున ప్రప్రథమమున సుప్రసిద్ధులై యుండిన వ్యోమకేశ చక్రవర్తిగారిని నియమించుకొన వలయునని ప్రయత్నములు జరిగినను తుద కకస్మాత్తుగా చిత్తరంజనదాసు శ్రీ అరవిందుని న్యాయవాదిగా

కోర్టులో పనిచేయుట సంభవించినది. చిత్తరంజనుని కీర్తి ప్రతిభాసామర్థ్యములు నాటినుండియే దేశమున వ్యాపింప దొడగినవి.

శ్రీఅరవిందుల కీ దోషవిచారణ సమయమున నలవడిన ఏకాంత కారాగారవాసము మహోపకారమే యయ్యెను. ఆ విషయ మీ క్రింద నుదాహరించిన, 'శ్రీఅరవిందోపన్యాసము' లోని భాగములను బఠించిన మనకు స్పష్టముగాగలదు.

నన్ను పోలీసువారు పట్టుకొని లాల్ బజారు పోలీసుస్టేషనుకు త్వరితముగా తరలించుతరి నొక్కక్షణము పరమేశ్వరునిపట్ల నా విశ్వాసము చలించినది. ఏలయన వానిసంకల్పము నవలోకింపజాలక పోతిని. కావున నే క్షణకాలము సంకోచించితిని. "సర్వేశ్వరా! నాకు సంభవించిన దిది యేమి? నా దేశీయులకై నే నొనర్చ వలసిన కార్యమొకటియున్నదని, అది పరిపూర్తియొనర్పబడువఱకు తమచే పరిరక్షకుడనై యుందునని, విశ్వసించితినే? అట్టిచో నిట్టి దోషారోపణపై నే నిచట నెందుల కున్నాను?" అని భగవంతుని గూర్చి నా హృదయమందు మొర లిడితిని. ఆవల నొకటి, రెండు, మూడు దినములుగూడ గడచెను. అపుడు నా హృదయమునుండి "వేచియుండుము, వీక్షింపుము" అని యొకవాణి వినవచ్చినది. నే నంత ప్రశాంతుడనై ప్రతీక్షించితిని. లాల్ బజారు నుండి ఆలిపూరుకు గొంపోబడితిని. మనుజులనుండి దూరీకృతుడనై యొక మాస మేకాంత కారాగారబంధమున నుంచబడితిని.

అచ్చట నాయం దంతస్స్థితమైన ఆ భగవానుని దివ్యవాణి నాకర్షించుటకై ఆ భగవాను డాజ్ఞాపించున దేదియో అవగాహన మొనర్చుకొనుటకై నే నొనర్చవలసిన దేదియో నేర్చుకొనుటకై అహర్నిశము నిరీక్షించితిని. ఆ యేకాంతవాసమునందే ప్రప్రథమ సాక్షాత్కారము, ప్రథమపాఠము నా కనుగ్రహింపబడినది. అప్పుడు నన్ను బట్టుకొనుట కించుమించు నెలదినములకు ముందుగా నే నెఱింగిన యొకవిషయము నాకు జ్ఞప్తికివచ్చినది. ఆ విషయ మేమన, భగవంతునితోడి యధికాధిక సంబంధభాగ్యము నాకు గలుగుట కనువుగా నేకాంతవాసమునకు నే నేగుటకు, ఆత్మయం దంతర్దృష్టిచే సమీక్షించుకొనుటకు, నా కర్మకలాపమునంతను గట్టిపెట్టుటకు అంతర్వాణిరూపమున నాకొక యాదేశము వచ్చి యుండెను. కాని బలహీనుడగానుండి యా యాదేశమును శిరసావహించజాలక పోతిని. నాకృషి నాకపు డత్యంతప్రియమై యుండెను. నే నచ్చటలేకున్న ఆకార్యము హానిబొంది తుదకు నష్టమై నిలిచిపోవునని, నా హృదయాంతరమున గల అహంకార కారణమున నేనట్లు భావించితిని. అంగవలన నేనాకార్యమును విడిచిపెట్టకుంటిని. భగవానుడు మరల నాతో నిట్లు సంభాషించినట్లు నా కనుభూతమాయెను. "నీవే త్రెంపివేసికొన జాలని బంధనముల నీకుగా నేనే త్రెంపివైచితిని. ఏలయన, ఆ కార్యమట్లు కొనసాగవలయునను ఇచ్ఛ నాకు లేదు. ఎన్నడు నాకట్టిసంకల్పముగూడ లేదు. నీవు చేయవలసినది మరొక కార్యము కలదు. ఆకార్యార్థము—నీయంతట నీవు నేర్చుకొనజాలకుండిన దానిని నీకు బోధించుటకు, నా కార్యమునకు నిన్ను తయారు చేయుటకు—నిన్ను నే నిచ్చటికి తీసికొనివచ్చితిని". అంత భగవా

నుడు గీతా గ్రంథమును నా హస్తములం దుంచెను, అతనిశక్తి నాలో ప్రవేశించెను. నేను గీతాప్రోక్తసాధనను చేయగలిగితిని. శ్రీకృష్ణుఁ డర్జునున కేమి యాచరింపుమని యాజ్ఞాపించెనో, తన కార్య మొనర్ప గాంక్షించు వారి కందఱకు నేమి శాసించునో— అనగా రాగద్వేషములనుండి విముక్తి నందుటకు, ప్రతిఫలాపేక్ష లేక భగవత్ప్రీతికై కార్యమొనర్చుటకు, పరమేశ్వరుని హస్తమున స్వీయచేష్టారహితమైనట్టియు విశ్వాసవంతమైనట్టియు నొక యుపకరణముగా నగుటకు, అల్పుడు—అధికుడు, మిత్రుడు—శత్రుడు, జయము—అపజయము వీనిపట్ల సమహృదయము గలిగి యుండుటకు, ఇట్లుండియు నీశ్వరకార్యముల నజాగ్రత్తగా జేయకుండుటకును—దానిని నేను బుద్ధిబలముతో గ్రహించుటకు మాత్రమే గాక అనుభవమునకు దెచ్చుకొనవలసి యుండెను. హిందూమత మనగా నేమో నా కవగాహన మైనది. మనము హిందూమతమును గుఱించి సనాతనధర్మమును గుఱించి పలుమారు ప్రసంగింతుమే గాని మనలో నిజముగా కొలదిమందియే దానిని గుఱించి యెఱుంగుదురు. ఇతర మతములు మత విశ్వాస సంప్రదాయములే ప్రధానముగా గలిగియున్నవి. కాని సనాతనధర్మము జీవితసర్వస్వమై యున్నది; అది నిత్యానుష్ఠానమం దుండవలసినదేగాని అంతగా విశ్వాసముపై నాధారపడియుండునది కాదు. విశ్వమానవ విమోచనముకైయే ఈ ద్వీపకల్పమునం దేకాంతముగా బహుకాలమునుండి వర్ధిలజేయబడుచున్న ధర్మ మది. ఈ సనాతన మతము నందఱకు బ్రసాదించుటకే భారతదేశము వర్ధిల్లుచున్నది. ఇతరదేశములవలె స్వార్థమునకుగాని లేదా తాను శక్తిమంతమైనపుడు దుర్బలుల నణగద్రొక్కుటకుగాని ఇండియా వర్ధిల్లుట లేదు.

ఆమె తన కప్పగింపబడిన ఆ నిత్యజ్యోతిని ప్రపంచమునందంతట ప్రచురించుటకే వర్ధిల్లుచున్నది. తన కొఱకుగాక మానవకోటి కొఱకే ఇండియా ఎల్లపుడు నిలిచియున్నది. తన కొఱకుగాక మానవకోటి కొఱకే ఆమె మహత్త్వమును బడసియుండవలయును.

కావున, తదుపరి భగవానుడు నాకు జూపించినదిది: హిందూమతము యొక్క మూలసత్యమును నేను గుర్తించునట్లొనర్చెను. నాపైని జయిలర్ల హృదయమును మార్చి వారిని నా పట్ల సుముఖులుగా జేసెను. "ఇతడేకాంతనిర్బంధమున బాధ పడుచున్నాడు. ఉదయమున సాయంకాలమున అర్ధఘంట సేపాతని గదికావల తిరుగుటకై సెలవిండు" అని జయిలర్లు ఆంగ్లేయుడగు కారాగృహాధికారితో మాటాడిరి. ఆ ప్రకారమేర్పాటయినది. అపుడు నేనట్లు నడచుచున్న సమయములందే తిరిగి ఆతని-భగవానుని-శక్తి నాలో ప్రవేశించినది. నన్ను మనుజులనుండి మాటుపఱచిన ఆ కారాగృహము నొక పర్యాయమవలోకించితిని నేను బంధింపబడియున్నది ఆ యున్నతకుడ్యముల కారాగారముగా గనబడలేదు. అంతేకాదు! నన్ను వాసుదేవుడే పరివేష్టించియుండెను. నా గదిముందఱి వృక్షశాఖలక్రింద నడచితిని. కాని యది వృక్షము కాదు! అటనిలచి తన యాచ్ఛాదనము నాపై బఱపి రక్షించినది శ్రీకృష్ణుడే, వాసుదేవుడే! నా కారాగారపు గదియొక్క కమ్ములను - తలుపునకు ప్రత్యామ్నాయముగా నున్న ఇనుపకమ్ములను-వీక్షించితిని. తిరిగి ఆ వాసుదేవుడే కంటికగపడెను. పహరా ఇచ్చుచు నాపై గావలిగాయుచుండినది నారాయణుడే! పరుండుటకు నాకియ్యబడిన మోటుకంబళ్ళపై మేనువాల్చితిని. అపుడును శ్రీకృష్ణుని-

నా ప్రాణమిత్రుని - ప్రియుని-దివ్యకరస్పర్శము ననుభవించితిని.
నా కాతడు ప్రసాదించిన నిగూఢసందర్శన ప్రథమప్రయోజన
మిదియే.

*

* *

క్రిందికోర్టులో కేసువిచారణ ప్రారంభమై మేజస్ట్రేటు నెదుట మేము గొనిరాబడినపుడును నన్నే యంతర్దృష్టియే వెంబడించెను. భగవాను డిట్లనెను. "నీవు జయిలులో త్రోయబడినపుడు భగ్నహృదయుడవై 'తమ ప్రాపేడ' యని నాకై నీ వాక్రందించ లేదా? ఇదిగో! ఇపుడు మేజస్ట్రేటును చూడుము. దోషారోపణ మొనర్చు ప్రభుత్వ న్యాయవాదిని జూడుము". నేను కన్నెత్తి చూచితిని, నా కగపడినది మేజస్ట్రేటు కాదు, వాసుదేవుడే, ఆ న్యాయస్థానము నలంకరించినది, నారాయణుడే. అంత ప్రభుత్వపక్ష న్యాయవాది దెస చూచితిని. నా కగపడినది ప్రభుత్వపక్ష న్యాయవాదిగాదు, అట గూర్చుండినది శ్రీకృష్ణుడే! ఆ నాప్రియుడు - మిత్రుడే - అచ్చట గూర్చుండి మందహాస మొనర్చి యిట్లనెను. "ఇపు డింకను భయమొందుదువా? నే నెల్ల మానవులయందు నంతర్యామిని. పరివర్తనములను నేను శాసించెదను. ఎప్పుడును నారక్షణ నీకుగలదు. నీవు భయపడరాదు. నీపై కొనిరాబడిన ఈ అభియోగమును నా చేతి కప్పగింపుము. దానితో నీ కవసరములేదు. విచారణ నిమిత్తముగాదు నిన్నిచ్చటికి గొనివచ్చినది; మఱొకపనికి. ఈ యభియోగము నాకార్యమునకొక సాధనమే కాని, అంతకంటె మరేమియు గాదు". ఆవల సెషన్సుకోర్టులో విచారణ ప్రారంభమైనపుడు, నా న్యాయవాదికి,

నా ప్రతిపక్ష సాక్ష్యమున నేదియసత్యమో, సాక్షుల నేయే విషయములపై సవాలు చేయవలెనో ఆ విషయమై, నా సలహాల నన్నింటిని వ్రాయ నారంభించితిని. అపుడు నే నూహించని దొకటి సంప్రాప్తమైనది. నా పక్షమున వాదించుట కేర్పరుప బడిన ప్రయత్నము లన్నియు నకస్మాత్తుగా మారి పోయినవి. నా పక్షమున వాదించుటకై మరియొక న్యాయవాది న్యాయస్థాన నిలువబడెను. అనుకోనని దే వారు వచ్చిరి. వారు నా స్నేహితులు. కాని ఆయన వచ్చుచున్నాడను విషయమే నాకు తెలియదు. నన్ను రక్షించుటకై ఎవరు తన తక్కిన ఆలోచనల నన్నింటిని త్రోసిపుచ్చి,తన న్యాయవాది యాదాయము నంతను పరిత్యజించి, మాసముల పర్యంతము దినదిన మర్ధరాత్రముల వఱకు మేలుకొని యుండి దేహారోగ్యమును గోల్పోయెనో ఆపురుషుని నామమును- శ్రీయుత చిత్తరంజనదాసుగారిని - మీరందఱు వినియున్నారు. వారిని నేను చూడగానే తృప్తిపడితిని. అట్లయ్యును సంజాయిషి వ్రాసియిచ్చుట అవసరమని అపుడుగూడ భావించితిని. అంత నదియంతయు మారిపోయినది. అంతస్థితముగా నాకీ సందేశము లభించినది. "నీ కాళ్ళచుట్టు నొడ్డిన ఉరులనుండి నిన్ను రక్షించునది యీనరుడే. ఆ కాగితములు నావల బెట్టుము. ఆతనికి సలహా చెప్పునది నీవు కాదు. నే నాయనకు బోధించెదను". అప్పటినుండి కేసును గుఱించి యొక్క మాటనేని నాయంతట నేను నా న్యాయవాదితో నని యుండలేదు. అథవా నే నెపుడేని ప్రశ్నింపబడు నపుడు ఆ ప్రశ్నకొసంగు నా సమాధానము కేసున కేమాత్రము సహాయకారి గానట్లు నా కెల్లప్పుడు కనబడుచుండెను. అంత సర్వము నాతనికే వదలివేసితిని. అతడే సంపూర్ణముగా నా వ్యవ

హారము నంతను దన చేతిలోనికి తీసికొనెను. ఎట్టి పర్యవసానము గాంచెనో వీరికి తెలియును. నా కొఱకు దైవ మేమి యుద్దేశించెనో మొదటనుండియు నాకు తెలియును. కారణము పదింబది నా కది వినబడినది. అంతర్వాణి యెల్లపుడు వీనులొగ్గి నేనిట్లు వినుచుంటిని. “నేను నడపించుచున్నాను. కాన భయపడవలదు. కారాగారమున కెందులకు నిన్ను తీసికొనివచ్చితినో ఆ కార్యముపట్లనే నీ దృష్టిని మరల్పుము. నీవు బయటికి వచ్చినపుడెన్నడును భయపడరాదని సంశయింపరాదని జ్ఞాపకముంచుకొనుము. కావున నెట్టి మబ్బులేని ఎట్టి యపాయములేని ఎట్టిబాధలేని ఎట్టి కష్టములేని రానిమ్ము. ఎంత అసాధ్యమేని గానిమ్ము; ఏదియు నసాధ్యముగాదు. ఏదియును కష్టముగాదు. జాతియందు, జాతీయాభ్యుదయమందు నే నున్నాను. నేను వాసుదేవుడను, నారాయణుడను. నే నేమి యిచ్ఛగింతునో అదియే అయితీరును గాని ఇతరులు గోరునది కానేరదు. దేనిని నేను సంఘటింపజేయ నభిలషించితినో దానిని ఏ మానవశక్తియు నివారించజాలదు.”

పిమ్మట నకస్మాత్తుగా నొకటి సంభవిల్లెను. నే నొక త్రుటిలో నేకాంతకారాగారమందే కాంతముగా నుండుటకు గొంపోబడితిని. ఆ కాలమందు నాకేమి సంప్రాప్తమైనదియు వెల్లడించుటకు సంప్రేరితుడనుగాను. కాని యనుదినము భగవానుడు తన యద్భుతముల జూపించెననియు హిందూమతముయొక్క పరిపూర్ణసత్యము నా కాత్మానుభవమగునట్లు చేసెననియు మాత్రము చెప్పగలను. నా కంతకుపూర్వ మెన్నియో సంశయము లుండెను. నే నింగ్లాండునందు విజాతీయభావములలో కేవలము విదేశ వాతావరణమున బెరిగితిని. హిందూమత మంతయు భావనాకల్పిత

మనియు నందు స్వాప్నిక సంబంధ మెక్కువగా నున్నదనియు భ్రాంతి మాయ వీని సంబంధమే మిక్కుటమనియు నిట్లు హిందూ మతమందలి యనేక విషయముల గురించి పూర్వ మొకప్పుడు భావించు చిత్తవృత్తి నందియుంటిని. కాని యిప్పు డన్నో హిందూమత సత్యముల ననుదినము మానసమున గ్రహించితిని, హృదయమున సాక్షాత్కరించుకొంటిని, శరీరమం దనుభవించితిని. అవి నాజీవనమునందు సిద్ధానుభవము లయినవి. ఏ భౌతికశాస్త్ర మును విప్పి చెప్పలేని విషయములు నాకు దృగ్గోచరము లయినవి. భగవానుని నేను ప్రప్రథమమున సమీపించినపుడు పూర్తిగా భక్తున కుండవలసిన భావమునగాని జ్ఞాని కుండవలసిన లక్షణమున గాని నే నుండలేదు. నేను ప్రజాహిత కార్యరంగమున కీడ్వ బడుటకుమున్ను, స్వదేశోద్యమమునకు ముందు, కొన్ని సంవత్సర ముల క్రిందట బరోడాలో నే నాతని సమీపించితిని.

నేను దైవము వెంతజేరిన యప్పటి యాకాలమున ఆచరణ నిరతమగు శ్రద్ధ నా కాయనయందు లేకుండెను. దైవము మన కందరాని దనుభావము, నాస్తికభావము, సంశయభావము నా కుండెను. అసలు దైవ మొక డున్నాడనునదియే నేను గట్టిగా నమ్ముకుంటిని. ఆతని సాన్నిధ్యమును నే నెఱుంగకుంటిని. ఇట్లుం డియు నదేదో యొకటి వేదసత్యమునకు, గీతాప్రోక్తసత్యము నకు హిందూమత సత్యమునకు న న్నాకర్షించివైచినది. ఈయోగ మం దెచ్చటనో యొక ప్రబల సత్యము, వేదాంతముపై నాధార పడిన ఈ హిందూమతమునం దొక గట్టిసత్యము ఉండి తీరవలయు నని యనిపించినది. కావున నేను యోగాభిముఖుడనై దాని నభ్యసించుటకు, నా యా భావము సరియేనా యని కనుగొనుటకు

తీర్మానించుకొనినపుడు నేనీ భావముతో భగవానుని ఇట్లు ప్రార్థించితిని. "సర్వేశ్వరా! నీవు ఉన్నయెడల నిక నా హృదయము నెఱుంగుదువు. ముక్తికొఱకు తమ్ము నే నర్థించుటలేదని, ఇతరులందరు నడుగు నట్టిదానిని దేనిని నేను గోరుటలేదని తమకు తెలియును. ఈ జాతి నుద్ధరించుటకు శక్తిమాత్రమే నేను వేడుచున్నాను. ఎవరికొఱకు నా జీవితము ధారపోయుటకై ప్రార్థించెదనో, ఎవరిని నేను ప్రేమించెదనో అట్టి యీ మానవులకు సేవజేయుటకు నన్ననుగ్రహించుడని మాత్రమే తమ్మభ్యర్థింతును" యోగసిద్ధికై బహుకాలము శ్రమపడితిని. తుదకు కొంతవఱకుపలబ్ధిగాంచితిని; కాని ఎందుల కత్యంతముగా కాంక్షించితినో ఆ విషయమున తృప్తినందలేదు. ఆవల కారాగారముయొక్కయేకాంతవాసమున నా యేకాంతపు గదియందు మరల దానికై ప్రార్థించి యిట్లంటిని. "ఈశా! నీ యాదేశమును బ్రసాదింపుము. ఏమి చేయవలయునో నాకు దెలియదు. సందేశము ననుగ్రహింపుము." ఆవల యోగసంధానమున రెండు సందేశము లనుగ్రహింపబడినవి. మొదటి సందేశ మిది: "నే నొక కార్యమును నీకిచ్చియున్నాను, అది యీ జాత్యుద్ధరణమునకు సాయపడుటయే. త్వరలోనే నీ వీ కారాగారమునుండి స్వేచ్ఛ గాంచు కాలము రాగలదు. ఏలయన నీ వీ పర్యాయము శిక్షింపబడుటగాని లేక దేశమునకుగా నితరులవలె బాధపడుచు కాలము నీవు కడత్రోయవలయునని గాని నా సంకల్పము గాదు. పనిచేయుటకు నిన్ను నే నియమించితిని, నీవు ప్రాధేయపడిన ఆదేశము నదియే. ఇక బయటికి వెళ్ళి నా కార్య మొనర్చుటకు నీ కాదేశము నిచ్చుచున్నాను." రెండవ సందేశము నందుకొంటిని. అది యిది:

“ఏకాంతవాసమగు నీ సంవత్సరమునందు నీకే విషయమున సందియము లుండెనో ఆ విషయమును గుఱించి నీకు ప్రత్యక్షము గావింపబడియున్నది, హిందూమత సత్య మదియే. ప్రపంచము నెదుట నేను లేవదీయుచున్నది యీ మతమునే; ఋషులు, సాధుసత్తములు, అవతారమూర్తులు వీరిమూలమున నేను నభివృద్ధిజేసి పరిపూర్ణసితి నందించిన దీమతమునే; ఆ మతమే నానా జాతులలో నా కార్య మొనర్చుటకు ప్రస్తుతము ప్రారంభించుచున్నది. నా సందేశమును వ్యాపింపజేయుటకే నే నీ జాతిని సముద్ధరించుచున్నాను. ఇదియే సనాతనధర్మము, సనాతనమతము. నిజముగా నీ వింతకుముందు దీని నెఱుంగకుంటివి; కాని దానిని నీ కిపుడు నేను వ్యక్త మొనర్చి యున్నాను. నిన్నంటియుండిన అవిశ్వాసమునకు, సంశయమునకు సమాధాన మియ్యబడినది. బహిరంతరములందు స్థూలసూక్ష్మరూపమున నీకు తార్కాణముల నిచ్చియున్నాను, నివి సంతృప్తిని గావించినవి. నీ విక బయటికి వెళ్ళునపు డీ సందేశమును నీ జాతికి చాటింపుము. సనాతనధర్మమునకైయే వా రభ్యుదయము గాంచవలెను. వారి యభ్యుదయము కేవలము వారికొఱకుగాక ప్రపంచమునకే. సర్వప్రపంచ సంసేవనమునకై వారికి స్వాతంత్ర్యప్రదాన మొనర్చుచున్నాను. అందువలన భారతదేశ మభ్యున్నతి నందినదనిన సనాతన ధర్మమే సమృద్ధ మగునని భావము. భారతదేశము ప్రశస్తమై విస్తరించుననిన సనాతనధర్మమే ప్రపంచమునందంతటను ప్రశస్తమై వ్యాప్తిగాంచునని భావము. ఈ ధర్మము కొఱకే, ఈధర్మాధారముననే భారతదేశము జీవించియున్నది. మతమును మహిమాన్వితమొనర్చుట యనిన దేశమును మహిమాన్వితమొనర్చుటయే. సర్వ

ప్రదేశములందు, సర్వ మానవులందు, సర్వవస్తువులయందు నేనున్నాననియు నే నీయుద్యమమునం దున్నాననియు, దేశమునకుగా కష్టపడువారియందు మాత్రమే గాక ఆ దేశసేవకుల నెదిరించి వారి మార్గము నిరోధించు వారియందును నేను పనిచేయుచున్నాననియు నీకు నిరూపించుచున్నాను. ప్రతి దేహమందును నేను బనిచేయుచున్నాను. మానవులు వారి ఇష్టమువచ్చినట్లు వారేమి యాలోచించినను ఏమి చేసినను మదీయ సంకల్పమునకు సాయపడుటకన్న నన్యమేమియు చేయజాలరు. వారుగూడ నా కార్యమునే చేయుచున్నారు; వారు నా యుపకరణములేగాని నా శత్రువులు గారు. మీ సర్వ వ్యాపారములందును ఏ మార్గమున మీరు నడచుచున్నదియు తెలియకే మీరు ముందు కేగుచున్నారు. మీ రొకకార్య మొనర్పనూహించి మఱియొకటి చేయుదురు. మీ రొకఫలమును కాంక్షించ మీ ప్రయత్నములు మాత్రము తదితరమునకో తద్విరుద్ధమగుదానికో ఉపయోగ పడుచున్నవి. ఒకశక్తిబయలుదేరి ప్రజలలో ప్రవేశించినది. బహుకాలముగా నేనీ యభ్యుదయమును సంసిద్ధ మొనర్చుచున్నాను. ఇపుడు కాలమాసన్నమైనది. ఇక నేనే దానిసిద్ధిని ప్రాపించెదను."

మేజస్ట్రేటు కోర్టునందు దోషారోపణముల నిర్ణయించి సెషన్సు-జిల్లా-కోర్టున కంపబడిన తరువాత న్యాయాధిపతియగు బీచ్ క్రాఫ్ట్ సమక్షమున నెన్నో మాసములు విచారణ జరిగినది. నార్టన్ ప్రభుత్వపక్షమున పదునాఱుదినములును శ్రీఅరవిందుల పక్షమున

చిత్తరంజను డెనిమిదిదినములును తమతమ శక్తిసామర్థ్యములఁ బ్రకటించి వాదించిరి. శ్రీఅరవిందు లీ సమయమున న్యాయాధిపతి సముఖమున తమ నిర్దోషత్వమును వెల్లడించుచు పలికిన వాక్యములను గొన్నింటి నీక్రింద నుదాహరించెదము.

## వాఙ్మూలము

నా వాఙ్మూలములో తెలిపినట్లు బరోడానుండి కలకత్తాకు వచ్చినప్పటినుండియు ఆ - 30 ఆగష్టు ౧౯౦౭ - యుత్తరమున నుదాహరించిన సిద్ధాంతములనుండి యొక క్షణమైన యతిక్రమించ లేదని చెప్పుచున్నాను. నా వ్రాతమూలకమైన వాఙ్మూలము నందు, నా కార్యకలాపముల స్వభావ మేదియైనను—అవి రాజకీయములు గాని, సాంఘికములు గాని, మతవిషయములు గాని —నా కార్యకలాపముల సాగించిన కాలమందంతటను, ఆగష్టు 30-వ తేది యుత్తరములో నుద్ఘాటించిన సిద్ధాంతములనుండి యొకక్షణమైన మఱలినవాడను గానని చెప్పియున్నాను. తమ సముఖముననున్న నా యభియోగ మంతయు నిదియే. నా దేశమునకు స్వాతంత్ర్యాదర్శమును నేను బోధించుట చట్టమునకు వ్యతిరేకమని యూహింపబడు నెడల నే నా నేరము నొప్పుకొనెదను. అదియే (బోధించుట చట్టమునకు వ్యతిరేకమనుట) యిట ధర్మమగునెడల నే నా నేరమును చేసితినని నన్ను శిక్షించుడని తమ్మడుగుచున్నాను. కాని నేను చేయని నేరములను, నా సమస్త ప్రకృతికి సంపూర్ణముగ విరుద్ధమై వెగటు బుట్టించునట్టి కర్మలను,

నా మనఃశక్తిని పాటించి, నావలన నెన్నడును గావింపబడజాలనట్టి కార్యములను మాత్రము నా కంటగట్టవలదు. స్వాతంత్ర్యాదర్శమును బోధించుట దోషమైనయెడల నేనట్లు చేసితినని ఒప్పుకొనుచున్నాను, నే నెన్నడును కాదనలేదు. నే నిందునిత్తమే నా జీవితసర్వస్వము బరిత్యజించితిని. తదర్థమే, దాని ననుష్ఠించుటకు దానికై కృషిచేయుటకు నేను కలకత్తాకు వచ్చితిని. అదియే నా జాగ్రదావస్థలో తదేక స్మరణముగా నా నిద్రావస్థలో తదేక స్వప్నముగా నున్నది. అదియే నా దోషమైన యెడల దానికి సంబంధించిన నానా విషయములను రుజువుచేయుటకుగా సాక్షులను బిలుచుకొనిరావలసిన యవసరమే లేదు. ఇదిగో, నే నిచ్చట నా నేరము నొప్పుకొనుచున్నాను. కోర్టువారిమ్రోల నే విన్నవించునదంతయు నిదియే. 'వందేమాతరం' రాజద్రోహదోషవిచారణ సమయమున నాడించబడిన రంగమును మరల నాడించకుందురుగాక.

ఈ విచారణ క్రియాకలాపమున నన్యభావముల నారోపింపకుందురుగాక. అదియే - స్వాతంత్ర్యాదర్శప్రబోధమే - నా దోషమైనయెడల ఆ మాట స్పష్టముగా సెలవిండు, నే నే శిక్షనైన సంతోషముగా భరించెదను. నే నెన్నడు నూహించజాలనట్టి నా కసహ్య కరమైనట్టి నా సమస్తప్రకృతికి విరోధమైనట్టి నేరముల నా కారోపించుట, లవమేని విశ్వసింపజాలని సాక్ష్యాధారమున మాత్రమేగాక, నే నే బోధ యొనర్చుట కాదేశింపబడినట్లు భావించితినో అటువంటి యున్నతాదర్శమునుమాత్రమే వెల్లడించు నా వ్రాతలనే యందుల కాధారముగా తీసికొనుట నాకు కష్టముగానున్నది. నే నా నేరమును చేసితిని, నే నెన్నడు

లేదన్న ప్రశ్నయేలేదు. పాశ్చాత్యదేశమందలి రాజకీయతత్త్వ సిద్ధాంతములను నే నవలంబించితిని. వానిని సనాతనమైన వేదాంతోపదేశమునకు సమన్వయించితిని. నా దేశీయులకు 'సర్వజాతుల సమావేశమందు భారతదేశమొనర్చవలసినధర్మము - కర్తవ్యము - ఒండుగల' దని వారు గ్రహించునట్లు బోధించు కార్యభారము నాపై మోపబడినదని తెలిసికొంటిని. అదియే నా తప్పిదమైన యెడల మీరు నాకు సంకెళ్ళు వేయవచ్చును, నన్ను బంధింపవచ్చును; కాని నే నా నేరమును జేయలేదనిమాత్రము నాచే చెప్పింపజాలరు. స్వాతంత్ర్యాదర్శమును బోధించినందులకు చట్టములోని యే సూత్రములకును నేను గుఱిగానని విన్నవించ సాహసించెదను; ఇక నాపై నారోపింపబడిన కృత్యముల గుఱించి, లిఖితపూర్వకమైన సాక్ష్యమేమియు లేదనియు నేను బోధించునట్టియు, రచించినట్టియు ప్రతిదానికిని సాక్ష్యములో కనిపెట్టబడిన నా ప్రతి మనోభావమునకును సంపూర్ణముగా పరస్పర విరోధ మున్నదనియు విన్నవించుచున్నాను.

ఇట్లు శ్రీ అరవిందుల వాక్యములను, ఉభయపక్ష న్యాయవాదుల సుదీర్ఘ వాదములను జ్యూరరు లందఱు శ్రద్ధగా విని శ్రీఅరవిందులు నిర్దోషి యని యేకగ్రీవముగా తమ దృఢాభిప్రాయమును వెల్లడించిరి. న్యాయాధిపతియు నావల నెలదినము లాలోచించి విషయముల నన్నింటిని ఎన్ని పుటలపర్యంతమో చర్చించి తుదకు జ్యూరరులతో నేకీభవించుచు శ్రీఅరవిందులపై

నేర మేమియు లేదనియు నిర్దోషిగాన వారిని విడుదల చేయవలెననియు తీర్పుచెప్పి న్యాయపరిపాలనాధర్మమును నెఱవేర్చి కృతకృత్యు డాయెను. శ్రీఅరవిందులను నిర్బంధించినపుడు వారింటశోధించి సంగ్రహించిన వ్రాత ప్రతులలో 'బహిష్కారమునందలి ధర్మము' (మొరాలిటీ ఆఫ్ బాయ్‌కాట్) అను వ్యాసమును దోషారోపణమును రుజువుచేయుట కాధారముగా పోలీసువారు కోర్టులో దాఖలు చేసియుండిరి. న్యాయాధిపతి ఆ వ్యాసమును పఠించి యందు రాజద్రోహము లేదని నిర్ణయించుట మాత్రమే గాక నిరుపమానమగు శ్రీ అరవిందుల యాంగ్లరచనా నైపుణ్యము నెంతో ప్రశంసించియుండిరి. విచారణకాలమున నొక సంవత్సరమంతయు కారాగార వాసము ననుభవించిన శ్రీఅరవిందులు తిరిగి ౧౯౦౯ మే ౫-వ తేదీన విడుదలగాంచిరి.

ఈ సందర్భమున నొకవిషయమును పేర్కొన వలసియున్నది. అది న్యాయాధిపతియగు బీచ్‌క్రాఫ్ట్ దొరకు సంబంధించినది. ఐ.సి.ఎస్. పరీక్షకు శ్రీఅరవిందులతో పాటు వీరును సహాధ్యాయిగా కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయములో చదివినవారు. సాహిత్యమున వీరికన్న శ్రీఅరవిందులే ఎన్నోమడుంగుల మిన్నగా నుత్తీర్ణులైరి.

సహాధ్యాయియు నందువలన మిత్రుడును అయినందు వలన సహానుభూతితో శ్రీ అరవిందులు నిర్దోషి యని తేల్చి తీర్పు చెప్పిరాయని కొందఱూహ నందవచ్చు నేమో కాని యది కేవలము నిరాధారము. కళాశాలలో గాని, పరీక్షాసమయమున గాని శ్రీఅరవిందులు వీరిని దూరము నుండియే చూచినట్లును, వీరితో నేనాడును రెండుమాట లేని మాటాడనట్లును, అన్యోన్య పరిచయ మేమియు లేనట్లును దెలియుచున్నది.



# శ్రీ అరవింద జీవితము



## నాలుగవ తరంగము

### కర్మయోగి పత్రికా నిర్వహణము

శ్రీ అరవిందులు జయిలునుండి వచ్చిననాటి వంగదేశము జీవచ్ఛవమై యుండెను. ఇంచుమించు దేశ సేవాపరాయణు లందఱును చెఱసాలలలో నుండిరి. వంగదేశ నాయకులగు అశ్వినీకుమారదత్తు, కృష్ణకుమార మిత్ర, సుబోధచంద్రమల్లిక్, శ్యామసుందరచక్రవర్తి మున్నగు సుప్రసిద్ధులు డిపోర్టేషన్ చట్టముక్రింద దోషారోపణము విచారణయు లేకుండగనే బంధింపబడి యుండిరి. జాతీయపక్షనాయకుడగు తిలక్ లోకమాన్యుడు తన 'కేసరి' పత్రికయందు ప్రకటితమైన వ్యాసములు కొన్ని రాజద్రోహపూరితము లైనవను కారణమున నాఱు సంవత్సరముల శిక్షకు పాత్రుడై మాండలేయం దుండెను. తలయెత్తి జాతీయవాదమును, ధైర్యముగా

వెల్లడించు నాయకుడే లేకుండెను. ఈ విషాదదుస్థితి కన్నులార జూచిన శ్రీఅరవిందులు, ఇంతవఱకు పరోక్షముగా బనిసేయుచుండిన శ్రీ అరవిందులు బహిరంగముగా నాయకత్వము వహించి జాతీయపక్షము, జాతీయవాదము మొదలంట నంతరింపకుండ కాపాడవలసిన బాధ్యతనుస్వీకరించుట తప్పనిసరి యాయెను. ౧౯౦౯-వ సంవత్సరముననే 'వందేమాతరం' పత్రిక అంతరించి నందున, చెల్లాచెదరై బీభత్సస్థితిలో మునింగియున్న దేశీయుల కాధ్యాత్మిక దృష్టితో కారాగారమున గాంచిన యోగానుభవముతో కర్తవ్య మిదియని వెల్లడించి ప్రబోధించుట కనువుగా 'కర్మయోగి' యని యాంగ్లమున, 'ధర్మ' యని వంగభాషయందు రెండు వారపత్రికలను కారాగారమునుండి బయల్పడిన మాసము దినములలోనే స్థాపించి నిర్వహించ సాగిరి. ఆ పత్రికాముఖ పత్రమున శ్రీకృష్ణుడు సారథిగా అర్జునుని రథము తోలుచున్నట్లు చక్కనిపటము ముద్రితము. దీనిని గుఱించి శ్రీఅరవిందులే సూక్ష్మముగా నిట్లు వ్యాఖ్యానమొనర్చియున్నారు: ఆ సంహారక్షేత్రము మీదుగా కురుక్షేత్రసారథి అర్జునుని రథమును నడపించుట కర్మయోగముయొక్క ప్రతిబింబమని వివరణమని; ఏలయన,

శరీరము రథము; పరుగిడెడి గుఱ్ఱము లింద్రియములు. ఇక రక్తమాలిన్యమయములై బురదతో సంకలితమైన ప్రపంచమార్గముల వెంబడి మానవాత్మను శ్రీకృష్ణుడు వైకుంఠమునకు నడపించుచున్నాడు.—కర్మయోగి పత్రిక యే సంకల్పముతో నే యాదర్శవిధానములతో స్థాపింపబడినదియు నీక్రింద సంక్షేపముగా నుదాహరించిన వ్యాస రాజములలోని వాక్యముల వలన గొంత తెలియగలదు.

పాశ్చాత్యసంపర్కమువలన జాతీయ స్వధర్మములు నశించినవి. చాతుర్వర్ణ్యము జీర్ణించి వర్ణసంకర మేర్పడినది.

*

* *

బ్రహ్మ తేజస్సు విధ్వంసమగుటవలననే క్షాత్త్రధర్మము, వైశ్యధర్మము, శూద్రధర్మము సర్వము లుప్తమైనది.

*

* *

ఏదో హైందవత్వమను గుడ్డియభిమానమే కొంతగలదుగాని దాని లక్ష్యలక్షణములు బొత్తిగా దెలియవు. మన పూర్వస్థితిని దలపోసి ప్రస్తుతస్థితిని గుర్తించి భావిస్థితి నూహించవలసి యున్నది.

*

* *

మన జాతీయత మత విజ్ఞానైశ్వర్యము నానారూపముల విలసిల్లినది. అన్నిమతముల, మతోద్ధారకుల, ధర్మానుష్ఠానముల

సమన్వయ మొనర్చి యందలి జీవ రహస్యమును గుర్తించి యుత్తే జము నందవలసియున్నది.

*
* *

సత్యయుగమునకు బునాది బ్రహ్మతేజస్సు. బ్రహ్మతేజస్సే అన్నిటికంటె ముఖ్యము నావశ్యకమును. మఱొకవిధమున మార్చి చెప్పవలయునన్న మతమే ప్రధాన మనవచ్చును. కాని యూరోపి యనులు భావించు మతముమాత్రము బ్రహ్మతేజస్సు కాజాలదు. బ్రహ్మతేజస్సు ఆధ్యాత్మికము, శక్తిస్వరూపము, సారవంతము. ఈశ్వరేచ్ఛాను గుణముగా నేకార్యమునకేని దానిని వినియోగించ నగును. అది వ్యక్తివిమోచనమునకు జాతీయనిర్మాణమునకు నుప యోగపడును. అది అంతఃస్థితముగా నీశ్వరశక్తిగా నతీత మానవ ప్రజ్ఞగా బనిచేయగలదు. చిరకాలసంచితమై మనకు హస్తగత మైన విధానముల మూలముననే ముప్పదిమూడుకోట్ల మానవులలో ఆశక్తిని ప్రబోధించుటయే మా సంకల్పము.

*
* *

పాశ్చాత్యులు మతమును నిత్యజీవితమునుండి విడదీసి విజయ వంతుల మైతిమని మురియుచున్నారు. 'మతము దాని స్థానము లోనే యున్నంతవఱకు మంచిదే. కాని రాజకీయములలో శాస్త్ర పరిశోధనలలో వ్యాపారవిషయములలో మతసంబంధ ముండ రాదు. దాని సంబంధము నష్టదాయకము' ఇది వారి తర్కము.

మతమును పాశ్చాత్యులు గ్రహించిన విధము మాత్రము వర్జనీయమే. కాని యాథార్థమతము, పారమార్థికము, ఆధ్యాత్మిక

లక్ష్యము, పరోపకారము, సత్యసాధనము, ఆత్మార్పణము, ఆత్మశుద్ధికై పరితాపము వీని నన్నింటిని మానవ సంఘము విధ్యుక్తముగా గాంక్షించవలసినదే. ఏమైనను భగవంతు డుండుట నిజము. అట్లున్నయెడల నాతని మన యొక్క మూలకు ద్రోసి 'అదియే నిస్థానము. ఇక ప్రపంచము, జీవనము, ఇదంతయు మాకు సంబంధించినది' అని నుడువకూడదు. అతడు సర్వవ్యాపి. అంతటను ఆతనికి ప్రవేశముగలదు. ఒక్కొక్క నాస్తికయుగము, విస్తారము మిక్కిలి విపులము నగు ఆస్తిక్యయుగమును సంసిద్ధపరచునది మాత్రమే యగుచున్నది.



మేము ముందిడుకొనిన కార్యము నిర్జీవమైన యంత్రవ్యాపారమువంటి భౌతికవ్యాపారము గాదు. అది నైతికము, నాధ్యాత్మికము. జాతి నిర్మాణము! మా సంకల్పము గాని ప్రభుత్వరూపమును మార్చుటగాదు. ఆ మహాకార్యమందు రాజకీయ మొక భాగము, ఒక స్వల్పాంశమే. కేవలము రాజకీయములకు, సాంఘిక సమస్యలకు, వేదాంతమునకు, సారస్వతమునకు, విజ్ఞానశాస్త్రములకు వీనికి మాత్రమే మేము పూనుకొనము గాని వీని నన్నింటిని మే మత్యంత ప్రధానముగా దలంచు నేకైక సత్యమునకు సమన్వయించి యుపయోగించెదము. అదియే ధర్మము, జాతీయ ధర్మము, విశ్వమానవ ధర్మమనియు మేము విశ్వసించెదము.



నిత్యానుష్ఠానమందు లేని ధర్మము నిరుపయోగము. ధర్మ

*
* *

భరతఖండ మొనర్పవలసిన కార్యము ఘనకార్యము. అది ప్రపంచకార్యము, భగవానుని కార్యము. భారతీయులగు బాలికా బాలకులారా! మీరీ సత్యమును గ్రహించి మీ ధర్మమును నిర్వహించవలసియున్నది. పాశ్చాత్యానుకరణమువలన ఈ సద్ధర్మ నిర్వహణమునకువలయు శక్తిని మీరు సముపార్జింపజాలరు. భౌతిక శక్తి మీకు శూన్యము, మీకున్న దంతయు నాధ్యాత్మిక శక్తియే; కావున ప్రప్రథమమున భారతీయులు గండు. మీ పూర్వీకుల శక్తి సామర్థ్యముల సంపాదింపుడు. ఆర్యభావమును, ఆర్యశిక్షణమును, ఆర్యవర్తనమును, ఆర్యజీవనమును సముపార్జింపుడు. వేదాంతరహస్యమును, గీతారహస్యమును, యోగరహస్యమును వీనిని మనసా సిద్ధాంతరూపమున గాక అంతఃస్థితముగా గ్రహించి నిత్యానుష్ఠానమునకు గొని రండు.

*
* *

ఆత్మబలమును మించగల బలము మఱొక్కటి లేదు. ఆ బలము సనాతనము; మీయం దంతఃస్థితమై నిత్యమై యున్నది. దానిమూలమున, భౌతికసామ్రాజ్యమును స్థాపించుటకు ముందు మీ రాత్మసామ్రాజ్యమును స్థాపించవలయును.

*
* *

'కర్మయోగి' పత్రిక వెలువడ నారంభించిన **మొదటి రెండు వారములలోనే 'వందేమాతరం' పత్రిక**

వలె ప్రజామోదమును బడసి నలుదిక్కులబ్రాకి వ్యాప్తి గాంచినది. ఆవల ఆలస్యముగా జేరిన చందాదారుల కోరిక ననుసరించి మొదటిమాసములోని నాలుగు సంచికలను పునర్ముద్రణ మొనర్చిరి. పాఠకులప్రార్థన నంగీకరించి బీదలకు అందుబాటులో నుండునట్లు తక్కువ వెలగల కాగితములపై ముద్రించి మిక్కిలి తక్కువ చందా నిర్ణయించి యొకరకముగాను మేలు కాగితముల నుపయోగించి మఱొకరకముగాను రెండు విధముల పత్రికను బ్రకటించ నారంభించిరి! ఈ పత్రిక యందే శ్రీఅరవిందులు ఋషిబంకించంద్రుని 'ఆనంద మఠ' మను నవల నాంగ్లమున కనువదించి కొన్ని అధ్యాయముల బ్రకటించిరి. ఈశ, కేన, మాండూక్య, కఠోపనిషత్తుల కాంగ్లాను వాదములను గూడ నిందు ప్రకటించిరి, ఈ పత్రికలో వీరు రచించిన పలు వ్యాసరాజములే 'భారతీయమేధ' 'కాళిదాసు' 'కర్మయోగియాదర్శము', 'జాతీయకళా ప్రాశస్త్యము', 'జాతీయవిద్యావిధానము', 'జాతీయవిద్య' మున్నగు నామములతో గ్రంథరూపమున కొన్ని ప్రకటితములై యున్నవి. నాడు రాజకీయరంగమున శ్రీవారు పనిచేయు చున్నను ఆధ్యాత్మికశక్తితోడనే, ఆత్మశక్తితోడనే పసు

౧౭౭

**బలము నెదుర్కొని విజయము గాంచనగు నని లోగడ ౧౯౦౫-లో తమ ధర్మపత్నికి వ్రాసిన లేఖయందు సూచించిన భావములనే మఱింత వివరముగా మఱొక వ్యాసమున వెల్లడించియున్నారు. వంగభాషనుండి యనువదింపబడి ప్రకటితమైన ‘శ్రీఅరవిందవ్యాసావళి’ అను గ్రంథమునుండి యాభాగము నీక్రింద నుదాహరించుచున్నాము.**

విజయమునకు కారణము శక్తి. ఏ శక్తివలన దుర్బలపక్షమునకు జయము కల్గుచున్నది? మఱియు ప్రబలపక్షముయొక్క శక్తి పరాజితమై నశించిపోవుచున్నది? ఐతిహాసికదృష్టాంతముల నన్నింటిని మనము పరీక్షించినచో ‘ఆధ్యాత్మిక శక్తియొక్క బలముచే ఈ అఘటనాఘటనము జరుగుచున్నది, ఆధ్యాత్మిక శక్తియే బాహుబలమును తుచ్ఛముచేసివైచి ఈజగము భగవంతుని రాజ్యమనియు అంధమైన స్థూలప్రకృతియొక్క లీలాక్షేత్రము కాదనియు మానవజాతికి తెలుపుచున్నది’అని మనము గ్రహింపగలము. విశుద్ధమైన ఆత్మయే శక్తియొక్క ఉత్సుకము. ఏ ఆద్యప్రకృతి గగనమందు కోటానుకోట్ల సూర్యులను గిరగిర త్రిప్పుచున్నదో, అంగుళిస్పర్శ మాత్రముచే పృథివి నల్లాడించి మానవసృష్టమైన సౌభాగ్యమును సకలమును చిహ్నలేకుండ ధ్వంసమొనర్పగలదో, ఆ ఆద్యప్రకృతి విశుద్ధమైన ఆత్మ కధీనము. ఆ ప్రకృతి అసాధ్యమును సాధ్య మొనరించును; మూగను మాటాడ జేయును, కుంటికి కొండలుదాటగల సామర్థ్యము నిచ్చును. జగమంతయు ఆ శక్తియొక్క సృష్టి. ఎవరియం దాధ్యాత్మిక బలము వికసించునో,

వారికి జయ సామగ్రి సకలమును తనంతట తానే ఉత్పన్నమగును; అభ్యంతరములును ఆటంకములును తమంతట తొలగి అనుకూలదశ చేకూరును; కార్యమును సాధించు దక్షత తనంతట ఉప్పతిలి తేజోవేగముల నలవరించుకొనును. యూరోపు నేడీ 'Soul-force' ను లేక ఆధ్యాత్మిక శక్తిని తెలిసికొన తడమాడుచున్నది; ఇంకను దానియందు సంపూర్ణవిశ్వాసము కుదురలేదు; దాని నాధారముచేసికొని కార్యము నాచరించు ప్రవృత్తి ఉద్భవించలేదు. కాని భారత శిక్ష, సభ్యత, గౌరవము, బలము, మహత్త్వము, ఈ అన్నిటికిని మూలము ఆధ్యాత్మిక శక్తి. ఎన్నిమారులు భారత జాతియొక్క వినాశకాల మాసన్నమైనదని ఎల్లరికిని తోచు స్థితి ఏర్పడెనో, అన్నిమాఱులును ఆధ్యాత్మిక బలము తను దాగియున్న స్వస్థానమునుండి తీవ్రస్రవంతిగ ప్రవహించి, ముమూర్షువైన భారతమును పునరుజ్జీవితమొనర్చెను, ఆవశ్యకమైన సకలశక్తులను సృష్టించి యిచ్చెను. ఇప్పుడును ఆ ఉత్తమస్థానము వట్టిపోలేదు. నేడును మృత్యుంజయమైన ఆ శక్తి యొక్క అద్భుతక్రీడ విలసిల్లుచున్నది.

*

* *

కాని స్థూలజగతియందలి ఏ శక్తియొక్క వికాసమైనను కాలముపై నాధారపడియుండును. ఉన్న పరిస్థితుల కుపయుక్తమైన చందము ననుసరించును. సముద్రముయొక్క పాటుపోటు సరణిగా క్షీణించుచు వృద్ధిపొందుచు, కడకు సంపూర్ణముగా కార్యకారి యగును. మన విషయమునను అదియే జరుగుచున్నది. ఇపుడు సంపూర్ణముగా పాటు; పోటుసమయమునకై నిరీక్షించుచు

నిలువబడియున్నాము.

మహాపురుషుల తపస్య, స్వార్థత్యాగుల కష్టస్వీకారము, సాహసవంతుల ఆత్మవిసర్జనము, యోగుల యోగశక్తి, జ్ఞానుల జ్ఞానసంచారము, సాధువుల విశుద్ధి ఇవన్నియు ఆధ్యాత్మిక బలమునకు జన్మస్థానములు. ఒకమారీ సకలవిధమైన పుణ్యబలము భారతమును సంజీవినీ సుధయందు ముంచియెత్తి మృత జాతిని సజీవమును బలిష్ఠమును తేజోవంతమును జేసి ఉద్ధరించెను. తన యందు తానింతదనుక నిరుద్ధమయి యున్న ఆ తపోబలము మరల అదమ్యము నజేయమునై బయల్పడుట కుపక్రమించు చున్నది. కొన్ని సంవత్సరముల పీడనము, దౌర్బల్యము, పరాజయము వీని ఫలితముగా భారతీయులు తమ అంతరమందే శక్తి యొక్క ఉత్సము నన్వేషించుటకు నేర్చుకొనుచున్నారు. ఈశక్తి ఉపన్యాసములవలన కలుగు ఉత్తేజముకాదు, మ్లేచ్ఛు లిచ్చిన విద్యకాదు. సభాసమితుల యందు ఆవేశమును సంచలింపజేయు శక్తికాదు. వార్తా పత్రికల క్షణిక ప్రేరణ కాదు. తమ అంతరమున, ఆత్మయొక్క విశాలనీరవతయందు, భగవంతునియొక్కయు శివునియొక్కయు సంయోగముచే ఏ శక్తి, గభీరము, అవిచాల్యము, అభ్రాంతము, విశుద్ధము, సుఖదుఃఖముల జయించినట్టిది, పాప పుణ్యముల నతిక్రమించి నట్టిది ఆవిర్భూత మగునో; ఏది మహా సృష్టికారిణి, మహా ప్రళయంకరి, మహా స్థితిశాలినియో; మఱి ఏది జ్ఞానదాయినియగు మహా సరస్వతియో, ఐశ్వర్యదాయిని యగు మహాలక్ష్మియో, శక్తిదాయిని యగు మహాకాళియో; తేజః సహస్రముల ఏకరాశియైన ఆ చండి తానావిర్భవించి, భారతావని యొక్కయు భూమి యొక్కయు కల్యాణమునకై పూనగలదు.

భారతదేశముయొక్క స్వాతంత్ర్యము గౌణోద్దేశ్యము మాత్రమే; ముఖ్యోద్దేశ్యము భారతీయసభ్యతయొక్క శక్తిని ప్రదర్శించుట, జగమం దంతటను ఆ సభ్యతను విస్తరింపజేసి ఉచ్చపదవియందు నెలకొల్పుట. మనము పాశ్చాత్యసభ్యతయొక్క బలముచేగాని, సభాసమితులయొక్క బలముచేగాని, ఉపన్యాసముల తీవ్రతచే లేక బాహుబలముచేగాని స్వాతంత్ర్యమునో లేక స్వాయత్త శాసనమునో ఆర్జింపగల్గి యుంటిమేని, ఆ ముఖ్యోద్దేశ్యము సాధింప బడజాలదు. భారతీయ విజ్ఞానముయొక్క బలముచే, ఆధ్యాత్మిక శక్తివలన సృజింపబడిన సూక్ష్మ స్థూలోపాయములచే స్వాతంత్ర్యము నార్జింపవలసియున్నది. కావుననే భగవంతుడు పాశ్చాత్యభావముచే ప్రేరితమైన మన ఆందోళనమును ధ్వంసము చేసి, బహిర్ముఖమైనశక్తిని అంతర్ముఖము కావించినాడు. బ్రహ్మ బాంధవోపాధ్యాయుడు దివ్యచక్షువుతో దేనిని చూచెనో, చూచి 'శక్తి నంతర్ముఖముచేయుడు' అని మాటిమాటికిని ఏ ఆదేశమును పల్కెనో, పల్కినప్పటికిని దేనిని కాల దుష్ప్రభావముచే ఎవరును శిరసావహింపలేక పోయిరో, మఱియు తానే చేయలేకపోయెనో, దానినే భగవంతుడు నేడు ఘటింపజేయనున్నాడు:

భారతముయొక్క శక్తి అంతర్ముఖమగుచున్నది. మరల నెపుడు బహిర్ముఖమగునో ఇక నా ప్రవాహము వెనుకకు మరలదు. ఎవరును దాని నడ్డగింపజాలరు. త్రిలోకపావనియగు ఆ గంగ భారతమును ముంచివైచి, పృథివిని ముంచివైచి, తన అమృత స్పర్శచే జగతికి నూతన యౌవన వికాసమును గైకొని రాగలదు.

ఏకాంత కారాగారవాసమున తీవ్రముగా నొనర్చిన యోగానుభవముతో ఆధ్యాత్మికదృష్టితో ఆనాటి

పరిస్థితుల కనుగుణముగా శ్రీ అరవిందులు సమన్వ
యించి ప్రబోధ మొనర్చుచుండిరి. ఈ నూతన ప్రబోధ
ముతో జీవచ్ఛవమైయుండిన జాతీయపక్షమున గొంత
చైతన్యముకలుగసాగెను. భగవానునిపై విశ్వాసముంచి
ధైర్య మూని ప్రజ లన్నిమండలములందును సభలు చేసి
పూర్ణ హృదయములతో, జాతీయ భావములను వెల్లడింప
మొదలిడిరి. ఈ నూతనవికాసము వలన, నవోజ్వలనము
వలన ఆంగ్లోయిండియన్ పత్రికలకు పోలీ సధికారులకు
కన్ను గుట్టినది. ఏడాది ఏకాంత కారాగారవాసానుభవ
ఫలితముగా శ్రీఅరవిందులు రాజకీయములను త్యజించి,
యోగిగానో సన్యాసిగానో ఏ హిమాలయకాంతార
గుహాంతరములందో ఏకాంతముగా నిరుపద్రవముగా
జీవిత శేషమును గడద్రోయునని యాశించిన పోలీసు
వారికి ద్విగుణీకృతోత్సాహముతో కర్మయోగియై
యనుదినము బహిరంగోపన్యాసము లొసంగుచు ప్రభుత్వ
విధానముల ఖండించుచు పత్రికలలో విమర్శించుచు రాజ
కీయరంగమున నాయకుడై జాతీయపక్షమును బునరుద్ధ
రించుట నిజముగా హృదయశల్యమైనది. కాన వేగుల
పోరు తీవ్రమై యెట్లయిన శ్రీవారిని మరల కారాగార
మున బంధించుటకు విశ్వప్రయత్నము లారంభ మైనట్లు

గట్టిపుకారులు బయలుదేరెను. అప్పటికి కారాగారము నుండి విడుదలయైవచ్చి మూడు మాసములు గూడ గాలేదు. కర్మయోగిపత్రిక ఐదవసంచికమాత్రమే వెలువడిన సమీపకాలమది. అపుడేయుత్తరక్షణమున తనకేమి సంభవించునో యని యనుమానించి శ్రీఅరవిందులు తమ కట్టకడపటి రాజకీయసందేశము – విల్ – గా 'నాదేశీయుల కొక బహిరంగలేఖ' అను శీర్షికక్రింద నొక యపూర్వపత్రమును ౧౯౦౯ – జూలై – ౧౯ – తేది బ్రకటించిరి. ఈ లేఖయందలి ప్రధాన విషయములను— సూరత్తు కాంగ్రెస్సు విధ్వంసము, దాని పునరుద్ధరణమును గుఱించిన భాగమును మాత్రము విడిచిపెట్టి— మూలమునకు భంగము కలుగకుండ సంగ్రహముగా ననువదించి యీక్రింద బొందుపఱచుచున్నాము.

"నన్ను ప్రవాసశిక్ష పాల్సేయవలయునని కలకత్తా పోలీసువారు ప్రభుత్వమునకు వ్రాసియున్నారను వదంతి గట్టిగానున్నది. అందువలన నా దేశీయులకు, ముఖ్యముగా జాతీయపక్షసిద్ధాంతముల నంగీకరించువారికి, ప్రస్తుతావసరముల గుఱించి భావిపద్ధతులను గుఱించి కొంత తెలుపుచు ఈ యుత్తరమును బ్రకటించుట మంచిదని తోచినది. నేను ప్రవాసశిక్ష కంపబడిన యెడల తమ భావికర్తవ్యమార్గము నెఱుంగజాలనివారి కిది కొంత సాయపడగలదు. నే నిక ఆ శిక్షనుండి బయటపడి రాలేక

పోయినయెడల నాతుది రాజకీయ సందేశము - విల్ - గా నా దేశీయుల కీ యుత్తర ముపకరించగలదు.

జాతీయవాదులస్థితి కష్టముగా నున్నను వారు ఆశాభంగము నందరాదు. ఆ పక్షనాయకులు శిక్షింపబడినందున జాతీయపక్షము నశించినదని కొందఱు తలంచుట పొరపాటు. నేడును జాతీయ పక్షము బలవత్తరముగా విస్తరించియే యున్నది. కాని మార్గము తెలియకను నాయకుడు లేకను మఱుగుపడియున్నది. మార్గము నెట్లో మనము కనుగొనవచ్చును. కాని నాయకుని మాత్రము భగవానుడే ప్రసాదించవలయును. మహోద్యమములన్నియు భగవచ్ఛక్తితో భగవాను డనుగ్రహించు నాయకునికై వేచి యుండును.

మనబలము కేవలము నైతికము. భౌతికబలము సర్వము నేడు ప్రభుత్వవిధానము నాశ్రయించి యున్నది. మన మా ప్రభుత్వవిధానమును గుర్తింప లేనట్లు పరివర్తన మొనర్పఁబూని నపుడా భౌతికబలము నంతను మనపై నుపయోగింపఁబూనుట స్వభావమే. దేశముయొక్క సమస్తనైతికబలము, న్యాయబలము మనది. మన వాంఛ సహజమైనది. భావిపౌరులుఁగాగల యువకులు మన పక్షమున నున్నారు. దైవబలము మనకున్నది. మన పవిత్రా దర్శము నే శాసనమును మంచిదికాదనదు. నాగరిక ప్రభుత్వ మను కీర్తిని బోగొట్టుకొన నిష్టపడని ఏ ప్రభుత్వమును మన మవలంబించు మార్గములు న్యాయవిరుద్ధములని బాహాటముగా వెల్లడించజాలదు. ఆ యాదర్శ విధానములను మన మచంచల బుద్ధితో నాశ్రయించవలయును. తుదకు మన జయము వానిపైనే ఆధారపడియున్నది. జాతికి సహనశక్తి మిక్కిలియవసరము. ఆ

సహనమునకు లక్షణము శాసనముల నాదరించుట; భారతీయుల కీ గుణ ముగ్గుపాలతో నలవడియున్నది. కావున నేటి శాసనముల మన మతి జాగరూకతతో ననుసరించవలయును. ఆ శాసనముల వలన మనకు లభించగల రక్షణమును, మన యుద్దేశ్యములను మన ప్రచారమును ముందుకు సాగించుట కా శాసనముల మూలమున లభించు నవకాశమును మన ముపయోగించుకొన వలయును. ఇటీవల దేశము నల్లకల్లోలము గావించిన దారుణ హత్యలతో మన కేమాత్రమును సంబంధము లేదు. అవి విషవృక్షములయొక్క విష ఫలములు. అసలు విషవృక్షమే యంకురించనట్లు అధికారులు తమ లోపములను సవరించుకొని యీ విధానములను మార్చనంతవఱకు మానవమాత్రు డీ విషఫలము లుద్భవించకుండ చేయజాలడేమో.

మన యాదర్శము స్వరాజ్యము, విదేశీయాధికారములేని సంపూర్ణ స్వాతంత్ర్యము. తన స్వభావాదర్శముల ననుసరించి తన స్వశక్తులవలన తన స్వజీవనమును సృష్టించుటకు ప్రతి జాతికిని హక్కుగలదని మేము వాదించెదము. విదేశీయులు మనకంటె మహత్తరమైన యోగ్యతాతిశయము గలవారనుట నిరూపింప వలసిన మాటగాదు. ఆకారణమున వారు మన జన్మహక్కులనుండి మనలను దూరీకృతుల నొనర్చుటకు గాని మనకంటె నికృష్టమైన వారి సభ్యతను మనపై బలవంతముగా జొప్పించుటకుగాని వారికి హక్కుగలదని మే మంగీకరించము. చిరకాల దాస్యమువలన లోపములు కళంకములు మన కెన్ని యలవడినను పూర్వప్రభ, శక్తిసామర్థ్యములు మనయందు తిరిగి మొలకెత్తుచున్న వని మే మెఱుంగుదుము. మన తండ్రి తాతలకంటె మన మేమాత్రమును దీసిపోము. మేధాశక్తి కావలసినంత యున్నది. ఎంతో ధైర్య

సాహసము లున్నవి. మనకెంతో అనంతమైన నానావిధమైన జాతీయ పటిమగలదు. మనకు కావలసినదంతయు కార్యరంగము, నవకాశము. ఈ రెండును జాతీయ ప్రభుత్వమువలన, స్వతంత్ర సంఘము వలన, మహత్తమమైన హైందవసభ్యతవలన మాత్రమే లభించగలవు. వానిని మనకు లభింపజేయునంత కాలము వానిని సంపాదించుటకే మన మేధాశక్తిని, ధైర్యమును, సామర్థ్యమును వినియోగించవలయునుగాని మఱొక ప్రయోజనమునకు నుపయోగించరాదు.

మన స్వరాజ్యాదర్శమందు మఱేజాతిని గాని లేక ఈ దేశమున శాసనసమ్మతముగా స్థాపితమైన పరిపాలనమునుగాని ద్వేషించు సూచన ఏమాత్రము లేదు. నిరంకుశ పరిపాలనముగా నున్న దానిని ప్రజాపరిపాలనముగా, విదేశీయ ప్రభుత్వముగా నున్న దానిని దేశీయ ప్రభుత్వముగా, విదేశాధికారము పాలైనదానిని స్వదేశాధికారమునకు లోబడునట్లుగా చేయగోరుదుము.

ఈ యాకాంక్షయందు హింసాద్వేషము లనివార్యములని చెప్పువా రసత్యమును చెప్పుచున్నవారనవలయును. మా దేశాభిమానలక్ష్యము ప్రేమభ్రాతృత్వములపై నాధారపడియున్నది, జాతిసైక్యమున కావల పరమావధి మానవైక్యమనియే కాంక్షించుచున్నది. కాని మే మాశించునది సోదరుల, సరిసమానుల, స్వతంత్రుల అన్యోన్యైక్యమేగాని స్వామి - భృత్యుల, భక్షక - భోక్తల యైక్యము మాత్రము కాదు. విలక్షణమైన జాతిగా, దేశముగా, మా మనుగడను సాక్షాత్కరించుకొనవలయునని ఆశించెదము. ఏలయన, పరమలక్ష్యమైన మానవసోదరత్వమున కదియే మార్గము, అయ్యది వ్యక్తిత్వమును రూపుమాపి బాహ్యాభేదముల కప్పిపుచ్చు

ట వలనగాక ఐకమత్యమున కంతర్గతముగా నున్న నిరోధములను ద్వేషాసూయాది దురభిప్రాయములకు గల కారణములను నిర్మూలించుటవలననే లభించును. మనహక్కులకొఱకై మనము ప్రయత్నించుట, యజ్ఞానమున వానిని నిరోధించు వారిని ద్వేషించుట యని భావించరాదు. స్వభావసిద్ధమైన పరిణామధర్మమును నిరోధించువారిని తప్పఁద్రోసికొని మన యభివృద్ధిని పొడుకొల్పుటలో మన మెంతేని కష్టపడుటకు, ప్రయత్నించుటకు, అధికార భయము లేక సత్యమును ధైర్యముగా వెల్లడించుటకు, న్యాయమైన స్వమార్గములను, సమస్త నైతికబలము నుపయోగించి యొత్తిడి గలిగించుటకు మనము దృఢనిశ్చయులమై యున్నామనియే మన ప్రయత్నము సూచించును.

స్వయంసాహాయ్యము, సాత్వికనిరోధము మన విధానములు. నిరంకుశాధికారముయొక్క శాసనముల నుల్లంఘించకుండగను, వారి యధికారమున కెదురు తిరుగకుండగను వీలగునంత వరకు మన పరిశ్రమల నభివృద్ధి చేసికొనుట, మనలోని వివాదముల మనమే పరిష్కరించుకొనుట, రోగులకు, బాధపడువారికి, క్షామముల పాలైనవారికి సాయపడుట, మానసిక, సాంకేతిక, పారిశ్రామిక విద్యలను బెంపొందించుకొనుట, వీనిమూలమున మన అంతర్ వ్యవహారములను మనమే పరిపాలించుకొనునట్టి యొక విధమైన స్వీయప్రభుత్వమును బయలుదేరదీయుటయే జాతీయవాదులు స్పష్టముగా వెల్లడించినది. వంగదేశమున నించుమించు అన్నివిషయములందు నభివృద్ధిగాంచి మన శక్తి సామర్థ్యములను నిరూపించగలిగితిమి. ఇంతలో సూరత్తునందు సంభవించిన మన యన్యోన్యాంతఃకలహములు, ఆ వెంటనే ప్రారంభమైన నిర్బంధ

బహిష్కరింప వలయునని ఎవరును దెలుపరు. కాని దేశీయుల కీ న్యాయమైన హక్కులనిచ్చుట కంగీకరించినంత మాత్రమున సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శమును బరిత్యజించుట యనిగాని భావి కాలమున ప్రజలహక్కులను నిరంకుశముగా భంగపఱచినపుడు సాత్త్వికనిరోధవిధానము ఉపయోగించకుండుట యనిగాని భావించరాదు.

జాతీయపక్షమునకు నేను సూచించు పద్ధతి నీ క్రింది విధమున సంక్షేపముగా తెలుపవచ్చును.

౧. శాసనమున కేమాత్రము నతిక్రమించకుండ స్వయంసాహాయ్య సాత్త్వికనిరోధపద్ధతియందు పట్టుదలతో నుండుట.

౨. 'అధికారములేనిచో సాహాయ్యములేదు' అను సూత్రాను సారముగా ప్రభుత్వముపట్ల మన దృష్టిని నియమించుట.

3. సాధ్యమైనపుడెల్ల మితవాదులతో పొత్తుగలిగి యుభయపక్షములు గలిసి సంయుక్త దేశీయమహాసభను పునర్నిర్మాణ మొనర్చుట.

౪. రాజకీయముగా నార్థికముగా రెండువిధములను బహిష్కారము ఫలప్రదమగునట్లు బహిష్కారోద్యమమును నిర్వహించుట.

౫. సమస్త భారతదేశమందు గాకపోయినను రాష్ట్రములయందైనను, మన మొదటి కార్యక్రమము ననుసరించి నిర్మాణ మొనర్చుట.

౬. మునుపటివలె అంత సంపూర్ణ ఫలప్రదము గాకున్నను లాభదాయకముగా శక్తిమంతముగా దేశసేవకులు స్వయంసాహాయ్యమును జాతీయ సామర్థ్యమును బోషించుచు పనిచేయుటకు వీలుగా నుండు నటువంటి, శాసనముల నతిక్రమించకుండు

కటువంటి యన్యోన్య సహకారవిధానము నవలంబించుట.

శ్రీఅరవిందులు ౧౯౦౭ ప్రారంభములో నింత స్పష్టముగా సూచించిన ఈ విధానము నొకవిధముగా నావల పది సంవత్సరములకు గాంధిమహాత్ముడు దేశీయ మహాసభలో నుపపాదించుటయు, ముప్పదిరెండు సంవత్సరములు దాటినను ఇంచుమిం చీ విధానమే దేశీయు లవలంబించి యుండుటయు గమనించిన శ్రీఅరవిందుల రాజకీయ దూరదృష్టి విశదము కాగలదు. నేటికిని 'లిబరల్సు' అను నామాంతరమున జీవచ్ఛముగానున్న మితవాద పక్షమువారు, తాము దేశీయమహాసభలో బ్రవేశించుటకు ప్రబలమైన నిరోధము 'సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శము,' 'సాత్త్విక నిరోధవిధానము,' అని ప్రాతపాటనే పాడుటయు, దేశీయమహాసభాపక్షమున నాయకమణులానాడు శ్రీఅరవిందులు వెల్లడించిన భావమునే ఈ విషయమున ప్రత్యుత్తరముగా నిచ్చుటయు గమనించ దగియున్నది. కర్మయోగి పత్రిక ౧౯౧౦-ఏప్రిలువఱకు నిరాటంకముగా బ్రకటింప బడుచునే యుండెను.

కాని వంగదేశముననే గాక భారతదేశమందంతటను నానాటికి స్థితిగతులు విషమించి భయావహము కాసాగినవి. తీవ్రనిర్బంధములు, దారుణశిక్షలు, కఠిన

శాసనములు నిత్యకృత్యము లగుకొలదియు విప్లవోద్యమ
మును భీకరరూపమున విజృంభింప సాగినది. ఇంచుమిం
చన్ని రాష్ట్రములకు విషవాయువు వ్యాపింపసాగెను.
ఆంగ్లేయాధికారి హత్యారూపమున నాసికలో కుట్ర
సంఘము బయల్పడినది. ఆలిపూరు బాంబుకేసు సందర్భ
మున అపీలుసమయమందు కోర్టులోనే పట్టపగలు పోలీసు
సూపరింటెండెంటుగా నుండిన ఖాన్ బహదూర్ ఆలం
సాహెబు విప్లవకారునిచే నిలువున హత్య గావింపబడిరి.
ఇట్లు విప్లవకారులు చెలరేగి విప్లవసంఘములు
చిరస్థాయిగా ప్రబలిన కొలది ప్రభుత్వమువారు వానిని
నిర్మూలించుటకు తమకుతోచిన సాధనముల నన్నింటిని
యథేచ్ఛముగా ప్రయోగింప నారంభించిరి. ఉభయు
లవలంబించిన ఈస్థితిలో రాజమార్గమున బహిరంగముగా
శాసనసమ్మతముగ బనిచేయు జాతీయపక్షము నిలుచుటకే
యవకాశములేని దుస్థితి సంప్రాప్తమైనది. నాటి కర్మ
యోగిపత్రికలోని వ్యాసములను దిలకించిన శ్రీఅరవిం
దుల రాజకీయతత్త్వ మెట్లు పరివర్తనమందినదియు,
ఆధ్యాత్మిక దృష్టితో జాతీయవాదమును బెంపుచేయువిష
యమున ప్రభుత్వాధికారులును విప్లవకారులును యెట్లు
ప్రతిఘటించినదియు, నిరంతర యోగాభ్యాసమున కై

ఏకాంతవాసము కోరుకు శ్రీవారి హృదయ మె ట్లాతురతపడుచుండినదియు తెలియగలదు.

ఆ కాలమున తదేకనిష్ఠతో శ్రీ అరవిందులు యోగాభ్యాస మొనర్చుచుండినందున ఇతరుల సంపర్క మున కంతగా నవకాశ మీయకుండిరి. ఇట్లేకాంతముగా నున్న సమయముననే శ్రీఅరవిందులు కలకత్తానుండి మాయమై టిబెట్టుపర్వత ప్రాంతములందో హిమాలయ గుహాలయందో మహాత్ములతో సంప్రదించుచున్నారనియు 'కుటూమి' మున్నగు ఋషులతో దివ్యజ్ఞాన జిజ్ఞాసను సాగించు చున్నారనియు నద్భుతకల్పనలతో వార్తలను 'ఇంగ్లీషు మెన్' మున్నగు ఆంగ్లో ఇండియన్ పత్రికలు ప్రకటించినవి. నాటి వీరి చిత్తవృత్తిని గమనించిన మిత్రులు ముఖ్యముగా నివేదితాసోదరి వీరి నెచ్చటికైన నిరపాయస్థలమునకు బోవలసినదిగా నెంతయో ప్రాధేయ పడినట్లు తెలియుచున్నది. కాని బాహ్య పరిస్థితులకు ప్రోద్బలములకు లక్ష్యపెట్టని శ్రీఅరవిందు లంతర్వాణి రూపమున ఈశ్వరాదేశము వచ్చువఱకును కార్యరంగ మునుండి కాలు కదల్చినవారుగారు. ౧౯౧౦-వ సంవత్స రారంభమున శ్రీఅరవిందులకు లభ్యమైన అసాధార ణానుభూతిని గుఱించి, యోగసాధన కాశ్రమముగా

బరిణమించిన బ్రిటిషు ప్రభుత్వకారాగార మందు బడసిన శ్రీకృష్ణదర్శనాదేశముల గుఱించి ఇంతవఱకు చదువరులకు కొంత పరిచయమైయున్నది. ఇపుడు ౧౯౦౯-వ సంవత్సరాంతముననో ౧౯౧౦-వ సంవత్సర ప్రారంభముననో 'కర్మయోగిని', 'ధర్మ' పత్రికలను నిర్వహించుచుండినపుడును, వంగదేశమునువిడిచి రానున్న సమయమందునను, శ్రీఅరవిందుల యోగసిద్ధి యేయున్నతతర శిఖరముల నందుకొని యుండినది యీ క్రింది విషయమునుబట్టి మనము కొంత సూక్ష్మముగా గ్రహింప బ్రయత్నించవచ్చును. వంగదేశమున నాటకరంగ నిర్మాతయని, నటనచక్రవర్తియని, నాటకకర్తయని కీర్తి వహించియుండిన గిరీశ్ ఘోషు గారు పరమహంస శ్రీరామకృష్ణుని ప్రియ శిష్యులలో నొకరు. వీరు పాత్రవహించి నటించిన నాటకములకు శ్రీరామకృష్ణులు వెళ్ళి చూచుచు శ్లాఘించుచుండెడివారు. గిరీశ బాబుగారొకదినమున శ్రీఅరవిందులను దర్శించినపుడు మీ యోగసిద్ధి, అనుభూతి ఎట్లున్నదియు స్పష్టముగా తెలుపవలయునని బలవంతపఱచిరట. శ్రీఅరవిందు లంత 'సర్వత్ర, సర్వములో, సర్వసంఘటనములందు బ్రహ్మమునే గాంచుచున్నాను' అని నుడివియుండిరట. గిరీశ

బాబుగా రందుల కాశ్చర్యమును సంయశమును బొంది 'భగవాన్ రామకృష్ణపరమహంసయే యట్టియనుభూతిని గాంచలేదే! మీ కా దశ సాధ్యమా?' అని ప్రశ్నించి పత్రికలలోగూడ నపు డీ విషయమును గుఱించి ప్రకటించి యుండిరట. మఱియు శ్రీ అరవిందులు 'నా యిచ్ఛాధీనుడను గాను' అని ధర్మపత్నికి ౧౯౦౮-లోనే వ్రాసిన విషయమును మఱొకవిధముగా మరల నొక లేఖలో నిట్లు పేర్కొనియున్నారు: 'ఆ దినములలో గూడ నే నెన్నడును హేతువాదముల ననుసరించి ఆలోచించి విమర్శించి పనిచేయలేదు. మఱొకరి హస్తమందు యంత్రముగా కీలుబొమ్మగా నున్నాను. ఒక్కొక్కప్పు డాయన (భగవానుడు) నా కార్యమునుగుఱించిన కారణ సంబంధములను నాకు తెలియజేయుచున్నాడు. మఱొకప్పుడు తెలియపఱచడు. కాని ఏమైనను ఆయన యిచ్ఛా నుసారముగానే నేను పనిచేయుటగాని మానుటగాని.'

శ్రీఅరవిందుల యోగసాధన నానాటికి తీవ్రమైత దేకధ్యానము నేకాంతవాసమును గాంక్షించుచుండెను. దేశీయులు తమ జాతీయ తత్త్వమును యథారూపమున గ్రహించు శక్తి సమయము లింకను రాలేదనియు తుద కీ విధమైన రాజకీయోద్యమమునకు తాను నాయ

కుడుగా నిర్ణీతము కాలేదనియు అంతర్ముఖుడై తాను నిశ్చయించుకొనెను. ఇట్లు బాహ్యాపరిస్థితులకంటె శ్రీ అరవిందులయం దుదయించిన అంతస్స్థితి పరివర్తనమే వీరిని రాజకీయరంగమునుండి దూరీకృత మొనర్చినదనుట వాస్తవము. స్వప్రయత్నమున యోగాభ్యాసము నారంభించుటకు ముందే చిన్నతనమునుండియే ప్రధానమైన తన జీవితఘట్టములందు నంతర్వాణీరూపమున ఈశ్వరాదేశముల గ్రహించుటయు తదనుగుణముగ ప్రవర్తించుటయు వారియందు గాననగును. ఇంగ్లాండులోనున్నపుడీ యాదేశానుగుణముగనే గుఱ్ఱపుస్వారి పరీక్షకు హాజరుగాక ఐ. సి. ఎస్ ను త్రోసిపుచ్చిరి. ఆవల బరోడాలోని యున్నతోద్యోగమును త్యజించిరి. ఇప్పుడును తదాదేశానుసారముగనే అనగా 'చంద్రనాగూరునకు పొమ్ము' ఆవల 'పుదుచ్చేరికి పొమ్ము' అను దివ్యవాణి నాలకించి వంగదేశమును విడిచి మొదట నొకటి రెండు మాసములు చంద్రనాగూరుపట్టణమునం దుండి యావే ౧౯౧౦-వ సంవత్సరము ఏప్రిలు నెల ౪-వ తేది ఫ్రెంచి యిండియాకు ముఖ్యపట్టణమగు పుదుచ్చేరి ప్రవేశించిరి ఈలా ౧౯౧౦-మార్చి-౨౬-వ తేది సంచికతో కర్మయోగి పత్రిక యంత మొందినది.

చంద్రనాగూరు పుదుచ్చేరి పట్టణములకు శ్రీ అరవిందు లొనర్చిన ప్రయాణవిశేషము లంతగా తెలియవు. మొదట నిద్దఱుశిష్యులు చంద్రనాగూరు వఱకు వెంటవచ్చి వారినచ్చట దిగవిడిచి మరలిపోయిరనియు ఒంటరిగానే శ్రీఅరవిందు లచ్చట నివసించు చుండిరనియు తెలియుచున్నది. శ్రీఅరవిందుల యోగసాధన యచ్చటనే అధ్యాత్మికోచ్ఛ్రియముల నందుకొనినట్లున్నది. ఆకాలములో వీరికి వలయు వసతుల నేర్పాటుచేసి వెంటనుండి శుశ్రూష గావించి కొంత యుపదేశమును బొందిన చంద్రనాగూరు వాస్తవ్యు లొకరు వెల్లడించినదే మన కిపు డాధారమైనది. * వారి వ్రాతలనుండి సంగ్రహముగా గొంత నిట నుదాహరించుచున్నాము.

‘శ్రీ అరవిందులు గంగాతీరమున పడవలోనుండగానే వారిని దర్శించుభాగ్యము నాకు లభించినది. దర్శించినంతనే నా మనఃప్రాణ శరీరములలో పరివర్తన మేర్పడి నాకు శాంతి లభించినది. సంపూర్ణముగా వారివశమైపోతిని. వారి దృష్టిమాహాత్మ్యము, కరుణాకటాక్షము నట్టిది.

*

* *

మా యింటికి గొంపోయి యొకనిర్జన ప్రదేశమున వారికి

---

* ‘ప్రవర్తక్’ అను బంగాలీ మాసపత్రికనుండి.

బస నేర్పాటుచేసితిని. యోగమునుగుఱించి, వాసుదేవ-ప్రద్యుమ్న సంకర్షణ-అనిరుద్ధులను గుఱించి, విజ్ఞానియగు వ్యాసునిగుఱించి అవతారమూర్తి విరాట్పురుషుడు నగు శ్రీ కృష్ణునిగుఱించి ఉపనిషత్తులనుగుఱించి నాకు కొంతవివరించి తెలిపియుండిరప్పుడు.

*

* *

భగవానుని కొనర్చవలసిన ప్రపత్తినిగుఱించి మాటాడుచు సర్వతోముఖమైన సమర్పణమన నేమో, మన మనః ప్రాణశరీరములు సకలమును భగవదర్పితముగా నెట్లు చేయవలయునో తెలుపుచు దృష్టాంతముగా వారిచేయిని పైకెత్తిచూపి నాతో నిట్లనిరి. 'ఇదిగో చూడుము. ఈ హస్తము నిట్లు పైకి నే నెత్తలేదు. ఏదో మఱియొకశక్తి పైకట్లు నెట్టివేసినది.'

*

* *

పై సంభాషణము జరిగినప్పటినుండియు నే నెంతో యాత్రముతో శ్రద్ధతో వారి పోకడలను గనిపెట్టి పరీక్షించుచుంటిని. ఇతరులు దీనిని నమ్మలేక పోవచ్చును. నా కన్నులారా జూచిన విషయమిది: నేలమీద వారు నడచుచుండగా వారి పాదములు నేలను స్పృశించినట్లే కనబడలేదు. ఏదో యొకస్థలమునుండి మఱియొకస్థలమునకు గంతువేసి నెమ్మదిగా వ్రాలినట్లుండెను. వారి అడుగుల చప్పుడు గమనించుటకు నా చెవుల నిక్కబెట్టి వింటిని. నడకలో శబ్దమే లేకుండెను.

*

* *

వారిని గురించిన మరియొక విషయ మిది: వారి కన్నుల చూపు మానవుని చూపుగా నాకగపడలేదు. వారికన్నులద్వారా నన్నెవరో స్పృశించినట్లు తోచినది. ఇవన్నియు స్వయముగా చూచి అనుభవించిన విషయములు.

*

* *

శ్రీఅరవిందు లెంతోసేపు, ఇంచుమించు వారి కాలమంతయు, ఊర్ధ్వము కేసి చూచుచుండెడివారు. వారు సంభాషణములోనికి దిగినపుడు నే నిట్లడిగితిని. 'మీ రట్లు తదేక దృష్టితో దేనిని జూచెదరు'? వా రిట్లని సెలవిచ్చిరి. 'నా కన్నులలోని కెదురుగ ఎన్నో రూపములు వచ్చుచుండును. వానిభావమును గ్రహించుట కందు జొచ్చుకొనిపో ప్రయత్నింతును. అదృశ్య ప్రపంచములో నివసించు దేవతారూపములు నాకు కనబడుచుండును. ఈ మూర్తులు భావపూరితములు, అర్థవంతములు. అవి నాకేదో తెలుపగోరును. దానిని గ్రహించుటకు నేను ప్రయత్నింతును.' వారి యీ ప్రత్యుత్తరము నా హృదయమున నిప్పటికిని స్పష్టముగా నంకితమైయున్నది.

పుదుచ్చేరికి స్టీమరులో నొక శిష్యునిమాత్రము వెంటనిడికొని వచ్చిరట. సరిగా సాయంకాలము మూడు ఘంటలకు స్టీమరునుండి దిగిరి. ఆ కాలమున మద్రాసునుండి తీవ్రజాతీయవాదులని బేర్కొనబడిన ఇద్దఱు ముగ్గురు ద్రవిడదేశ యువకులు బ్రిటీషు ప్రభుత్వో

ద్యోగుల కోపానలమునకు బలికాకుండ పుదుచ్చేరికి తప్పించుకొనివచ్చియుండిరి. వీరికి శ్రీఅరవిందులకు పరిచయ మేవిధముగానైనదో తెలియదుగాని, ఒక శిష్యుని ద్వారా శ్రీ అరవిందులు వీరికి తమరాకవిషయమై సందేశ మంపిరనియు, ఆ సందేశవాహుడు ముందుగా ౧౯౧౦-వ సంవత్సరము మార్చి ౩౧-వ తేదిన పుదుచ్చేరి వచ్చియుండి వీరిని గలిసికొనిరనియు వీ రానాల్గు దినములలోనే శ్రీఅరవిందులు నివసించుటకు వలయు వసతుల నేర్పాటు చేసిరనియు దెలియుచున్నది. ప్రప్రథమమున శ్రీకల్వేశెట్టిగారను శ్రీమంతులు ధార్మికులు నగు నొకరియింట కొంతకాల ముండిరనియు, ౧౯౨౧-వ సంవత్సరమున కాబోలు, స్వగృహ మేర్పడునంతవఱకు, ఒకచోటనుండి మఱొకచోటికి మారుచు అయిదాఱు బాడుగిండ్లలో నివసించుచుండిరనియు తెలియుచున్నది.

శ్రీఅరవిందులు వంగదేశమును విడిచి పుదుచ్చేరి ప్రవేశించిన విషయమును శ్రీవారే ఆవల బ్రకటించువఱకు ప్రభుత్వము వారెఱుగకుండిరని తెలియవచ్చుచున్నది. శ్రీ అరవిందుల గృహమును చుట్టుముట్టి, నిరంతర మహోరాత్రము లతిజాగరూకతతో కాపలా కాయుచుండిన సి. ఐ. డి. వారును, రక్షకభటు

లును, శ్రీవారు గృహమునుండి బయలుదేరివచ్చుట, స్టీమరు ప్రయాణమున కవసరమగు డాక్టరు సర్టిఫికేటును బడయుట, స్టీమరెక్కుట వీని నన్నిటిని గమనించ జాల కుండుట నిజముగా విచిత్రమే! యథార్థమెంతో తెలి యదుగాని ఆరోగ్యమును గుఱించిన సర్టిఫికేటునకు ఐరోపీయుడగు డాక్టరు గృహమున కకాలముగా రాత్రి పూట శ్రీ అ ర వి ం దు లు వెళ్ళి యడిగినట్లును, వీరి యాంగ్లభాషా సంభాషణ శైలికి శబ్దోచ్చారణమునకు డాక్టరు ముగ్ధుడై, భారతీయు లిట్లాంగ్లమున మాటాడుట కాశ్చర్యపడి, విదేశమందు శ్రీవారు విద్య నభ్యసించిన విషయమును కనుగొని, కొంతసేపు మాటాడి వెంటనే యే యభ్యంతరమును జెప్పక సర్టిఫికేటు వ్రాసియిచ్చి నట్లును తెలియుచున్నది.

రాజకీయరంగమునుండి శ్రీఅరవిందులు విడివడి పుదుచ్చేరిలో యోగసాధన యొనర్చుచుండినను ప్రభు త్వమువారు మాత్రము వారిని విడిచిపెట్టినట్లు కన్పడదు, ౧౯౦౯-జూలైమాసమున బ్రకటించిన 'నా దేశీయుల కొక బహిరంగలేఖ' యను వ్యాసమునందు రాజద్రోహ మున్నదని, ప్రకటితమైన ఎన్నోమాసముల కావల, శ్రీఅరవిందులు పుదుచ్చేరి చేరిన కొంతకాలమునకు,

రాజద్రోహ మొనర్చి పారిపోయిరను న్యూనత నారో
పించునట్లు 'కర్మయోగి' ముద్రాపకునిపై దోషారోపణ
మొనర్చి ఆతని బంధించిరి. ఆ లేఖ ప్రకటించిన తరువా
తను శ్రీఅరవిందుల సంపాదకత్వముననే 'కర్మయోగి'
తొమ్మిదిమాసముల పర్యంతము తనసందేశమును విని
పించుచుండెను. అంతపర్యంతము ప్రభుత్వమువా రా
లేఖపై నేమియు చర్య తీసికొనలేదు. శ్రీఅరవిందులు
పుదుచ్చేరి చేరిన తరువాతనే ప్రభుత్వమువా రభియోగ
మును దెచ్చిరి. కాని క్రిందికోర్టులో ముద్రాపకుడు
శిక్షింపబడినను ఉన్నతన్యాయస్థానమున ఆ లేఖయం
దేమియు రాజద్రోహము లేదని నిర్ణయించబడి ముద్రాప
కుని విడుదలగావించిరి. ఇట్లు ఒకటి రెండు మూడు
పర్యాయములు రాజద్రోహాది తీవ్రాభియోగములకు గుఱి
కావింపబడినను శ్రీఅరవిందులు నిర్దోషులని నిర్ధారణ
యగుట ఈశ్వరవిలాసముగాక మఱేమి కాగలదు?



# శ్రీ అరవింద జీవితము



## ఐదవ తరంగము

శ్రీ అరవిందులు తమ యోగసిద్ధికై దక్షిణదేశమును కేంద్రస్థానముగ నిర్ణయించుకొనుట నీశ్వర నిర్దేశముగా గనబడుచున్నది. అనాడనుండియు దక్షిణదేశము వేదాధ్యయనమునకు కీర్తి గాంచియున్నది. శ్రీఅరవిందు లొకచో వెల్లడించినట్లు ఉత్తరదేశము రాజసిక తామసిక గుణములపాలై అంతఃకల్లోలములకు యుద్ధములకు నాకరమైనప్పుడు ఆధ్యాత్మిక జ్ఞానము దక్షిణదేశము నాశ్రయించెను. త్రిమతస్థాపనాచార్యులై ప్రపంచమునందంతటను నేటికిని పూజనీయులైన శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్యులకు జన్మస్థానమై, తన్మూలమున పునీతము నగు దక్షిణదేశము నేడును శ్రీ అరవిందుల యోగసిద్ధికి నిలయమగుట మన భాగ్యము. మఱియు నేడు మనకు 'పుదుచ్చేరి' పట్టణ మెట్లగుపడు

చున్నను, పూర్వమొకప్పుడు ఆధ్యాత్మికముగా గూడ మంచి పేరుమోసి పెక్కు సాధుపుంగవులకు, ముక్త పురుషులకు నిలయమై యుండినట్లు, శ్రీసిద్ధానందస్వామి, శ్రీఅక్కాస్వాములు అను బ్రహ్మవేత్తలిద్ద టచ్చటనే వెలసియుండినట్లు తెలియుచున్నది. వారి సమాధు లిప్ప టికిని రెండు పరిసర గ్రామములందు గలవు. భక్తులెందఱో ఆ సమాధులను దర్శించి యారాధించి వచ్చుచుందురు. ఒక ద్రావిడ కవిశేఖరు డిట్లు వర్ణించియున్నాడు: "నీ వే పుణ్యక్షేత్రములనేని దర్శించి యుండవచ్చును; ఏ పవిత్రతోయము లందేని స్నాన మొనర్చియుండ వచ్చును; కాని మహాసిద్ధపురుషులకు నిలయమైన 'పుదుచ్చేరి' వంటి మహాక్షేత్రము మఱెచ్చటను లేదు. ఈ పట్టణము నీకు ముక్తి నిచ్చును. పరబ్రహ్మజ్ఞానము నొసంగును. ఏలయన, ఏందఱో సిద్ధు లిచ్చటికి తరలి వచ్చి శివగతిని మోక్షమును బడసిరి."

దేశకాలపరిస్థితు లనుకూలింపగనే వంగదేశము నకు తిరిగివెళ్లి యాధ్యాత్మిక దృష్టితో రాజకీయరంగ మున బ్రవేశించు నుద్దేశ్యము ప్రారంభ మందుండినను యోగసాధన యభివృద్ధి యగుకొలది మహోన్నతమైన యాధ్యాత్మిక పరిణామముయొక్క పరమార్థము వారికి




శ్రీ అరవిందులు 'ఆర్య' పత్రికాధిపతులుగా

గోచరమై తమ సర్వశక్తుల నిటు నటు వెచ్చింపక ఏకాగ్రము చేయుటయే యావశ్యకమని గ్రహించగా, రాజకీయ సంబంధమును సంపూర్ణముగా వారు ద్యజించిరి. అందువలననే దేశీయులు దేశీయ మహాసభాధ్యక్షునిగా వరించి యాహ్వానించినను మిత్రులు ప్రార్థించినను శ్రీఅరవిందు లంగీకరింపరైరి.

పుదుచ్చేరి చేరినతరువాత నాలుగు సంవత్సరము లేకాంతముగా తదేకధ్యానముతో యోగసాధన యొనరించి తమకు సాక్షాత్కారమైన దివ్యానుభవములను జిజ్ఞాసు లోకమునకు వెల్లడించుటకు ౧౯౧౪-వ సంవత్సరము ఆగష్టు ౧౫-వ తేది 'ఆర్య' యను తత్త్వవిజ్ఞాన విషయక మాసపత్రిక నాంగ్లమున శ్రీ అరవిందులు ప్రకటింప నారంభించిరి. ఇట్లు భారతదేశమందు ప్రపంచ కల్యాణమును భాగవతజీవనము నర్థించి తత్సిద్ధికై మహాప్రయత్నము 'ఆర్య' పత్రికామూలమున ప్రారంభింప సమకట్టిన సుముహూర్తమునందే పాశ్చాత్యులు కామ, క్రోధ, ద్వేష లోభాది దుర్గుణప్రేరితులై స్వార్థపరులై అర్థకాములై మానవత్వమునే గోల్పోయి లకలకోలది తోడి మానవులను ఘోర సంహారముల భయంకర క్షోభముల పాలుచేసిన మహాయుద్ధమునకు సన్నద్ధులైరి.

భౌతిక శాస్త్రమునం దపార పాండిత్యమును సంపాదించి ప్రపంచఖ్యాతి గాంచిన జగదీశ్వచంద్రబోసు తన పరిశోధన శక్తిని సర్వము వినియోగించి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను ఉపనిషత్తు ప్రతిపాదిత సత్యానుసారముగా వృక్షములందును, శిలలయందును ప్రాణ మున్నదనియు, నవియు సుఖదుఃఖముల ననుభవించగలవనియు శాస్త్రీయముగా రుజువు చేయుచుండిన సమయముననే పాశ్చాత్యభౌతిక శాస్త్రజ్ఞులు తమ ప్రావీణ్యమునంతను తోడిమానవుల క్షణములో హతమొనర్చుటకు వలయు విషవాయువులను మారణ యంత్రములను సృష్టించుటలో ధారపోయుచుండిరి. పూర్వపశ్చిమ దేశముల యొక్క దృష్టిభేద మహాత్మ్యమే యిది. ఈ సందర్భమున '(శ్రీ)అరవిందవ్యాసావళి' అను గ్రంథమునుండి 'ప్రాచ్య పాశ్చాత్యములు' అను వ్యాసములోని కొంత భాగము నీక్రింద నుదాహరించుచున్నాము.

మన దేశమునకును యూరోపునకును ముఖ్యభేద మిది: మన జీవన మంతర్ముఖము, యురోపుయొక్క జీవనము బహిర్ముఖము. మనము భావము నాశ్రయించి పాప పుణ్యముల విచారింతుము. యూరోపు కర్మ నాశ్రయించి పాపపుణ్యముల విచారించును. మనము భగవంతుని అంతర్యామిగా ఆత్మస్థితునిగా గ్రహించి

అంతరమునం దాతని వెదకుదుము. యూరోపు భ గ వం తు ని జగత్ప్రభువుగా గ్రహించి బాహ్యమందు నాతని వీక్షించి పూజిం చును. యూరోపుయొక్క స్వర్గము స్థూలజగమందు. పృథివియొక్క ఐశ్వర్యము, సౌందర్యము, భోగము, విలాసము ఇవన్నియు వారి కాదరణీయములు, అన్వేషణీయములు. వేఱొక స్వర్గమును వారు కల్పించినను ఈ నేలపైని ఐశ్వర్య సౌందర్యముల యొక్కయు భోగవిలాసముల యొక్కయు ప్రతిబింబమే అది. వారి భగవంతుడు పౌరాణిక యింద్రునకు సాటి: లౌకిక ప్రభువు చందమున రత్న మయ సింహాసనముపై గూర్చుండి వేనవేల వందిమాగదుల కైవార ములచే ఉపాస్యుడగుచు విశ్వసామ్రాజ్యమును పరిపాలించును. మన శివుడు పరమేశ్వరుడు; అయ్యును బిక్షుడు, ఉన్మాది, "భోలా నాధుడు".* మన కృష్ణుడు బాలుడు, హాస్యప్రియుడు, విలాసి, ప్రేమమయుడు. క్రీడించుట అతని ధర్మము. యూరోపుయొక్క భగవంతుడు ఎప్పుడును నవ్వడు, క్రీడింపడు. అట్లు చేసినచో అతని గౌరవమునకు భంగము కలుగును, అతని ఈశ్వరత్వ మిక నిలువదు. పైనిచెప్పిన బహిర్ముఖభావమే దీనికి కారణము—ఐశ్వర్య మున కేవి చిహ్నములో అవియే వారల దృష్టియందు ఐశ్వర్య మున కాధారము. చిహ్నములు కనపడ వేని వారు వస్తువును కనుగొనలేరు. వారలకు దివ్యచక్షువు లేదు, సూక్ష్మదృష్టి లేదు, సర్వమును స్థూలము. మన శివుడు బిక్షువు; కాని త్రిలోకమందలి సకల ధనమును ఐశ్వర్యమును ఇంచుకలో సాధకునకు దానమిచ్చు ను. అతడు "భోలానాధుడు"; కాని జ్ఞానులకు అందరాని జ్ఞానము

* "మైమఅపుస్వామి"—అంతర్నివిష్ట చైతన్యుడైన జడ మూర్తి—స్థాణుడు. —అనువాదకుడు.

అతని సహజసంపత్తి. ప్రేమమయుడును, విలాసియును అగు మన శ్యామసుందరుడు కురుక్షేత్రమునకు నాయకుడు, జగమునకు పాలకుడు, బ్రహ్మాండమున కంతకును నెచ్చెలి, ప్రియుడు. భారత దేశముయొక్క మహాజ్ఞానము, తీక్ష్ణమైన సూక్ష్మదృష్టి, మఱియు అప్రతిహతమైన దివ్యచక్షువు స్థూలములైన ఆవరణములను భేదించుకొనిపోయి, ఆత్మయందలి భావమును, అసలైన సత్య మును, లో నిలిచిన గూఢత్వమును బయల్పడజేయును.



పాప పుణ్యముల సంబంధమునను ఈ చందమే గోచరిం చును. మన మంతరమందలి భావమును గమనింతుము. నిందపాలైన కర్మయందు పవిత్రభావమును, వెలుపలికి పుణ్యరూపమున గాన్పించు కర్మయందు పాపిష్ఠమైన స్వార్థమును దాగియుండ వచ్చును. పాప పుణ్యములును సుఖదుఃఖములును మనోధర్మములు కర్మ ఆవరణము మాత్రము. సామాజిక నియతికొఱకై మనము బాహ్య పాప పుణ్యములను కర్మకు ప్రమాణముగా మన్నింతుము; కాని, 'అంతరంగమునందలి భావమునే ఆదరింపవలయును' అని మన మెఱుగుదుము. ఎవ్వడాచార విచారములను, కర్తవ్యాకర్తవ్య ములను, పాప పుణ్యములను దాటి, "బాలోన్మత్త పిశాచముల" విధమున విహరించునో, ఆ సన్యాసిని, సర్వధర్మత్యాగియగు నా పురుషుని శ్రేష్ఠుడని మన మందుము. ఈ తత్త్వమును గ్రహించు టకు పాశ్చాత్యబుద్ధి చాలదు. ఎవడు జడునివలె ప్రవర్తించునో అతడు జడుడనియే తలపోయును. ఉన్మత్తుని విధమున ఎవడు ప్రవర్తించునో అతడు హేయభావాస్పదమైన అనాచారి పిశాచ

మనియు గ్రహించును. ఏలయన దానికి సూక్ష్మదృష్టిలేదు. వారంతరంగమందలి భావమును చూడజాలరు.

*
* *

'ఆర్య' పత్రిక నే సంకల్పముతో ప్రారంభించి నడపినదియు తెలియుటకు శ్రీ అరవిందులు 'మా యాదర్శము' 'ఆర్య నాల్గవ వర్షము' అను శీర్షికల క్రింద ప్రకటించిన విషయముల నీక్రింద సంగ్రహముగా పొందుపఱచుచున్నాము. వీని మూలమున మానవాభ్యుదయమున కాశియాఖండము నైరోపాఖండము నేదృక్పథములనుండి ప్రయత్నించినదియు వాని పరిణామ మెట్లు సంకరమై ఫలప్రదము గాకపోయినదియు ఆత్మానుభవము వలన సత్యదర్శనము వలన శ్రీఅరవిందులు గుహ్యాతరమైన సమన్వయమార్గము నెట్లు కనుగొని తదధికారియైనదియు, నేధర్మసూత్రముల వలన లోక కల్యాణము భాగవతజీవన ప్రతిష్ఠింప ప్రయత్నించినదియు కొంత తెలియగలదు.

క్షణభంగురములును అనతిగూఢములు నగు తాత్కాలిక విషయ విమర్శనమేని ఇప్పటికి వాడుకలో నున్న మతశాఖా, సిద్ధాంత ప్రచారమేని మా పత్రికకు లక్ష్యముగా గైకొనలేదు. భవిష్యత్తును గూర్చి యాలోచించుటయు, దాని పునాది నిరూపణ

యందు దోడ్పడుటయు, దానిని గతమునందలి శ్రేష్ఠతమము వీర్యవంతము నగు చింతనతో సంధాన మొనర్చుటయు దీని యుద్దేశ్యము.

మానవాభ్యుదయము నిరంతర మనియు మఱియు నయ్యది కొంతకాలము బహిర్గతమును మఱికొంతకాల మంతర్విలీనమును నై బాహ్య బల ప్రయోజనముల వెనుకనుండి వర్తించు ప్రాణరఘురి యందలి యొకానొక భావవిశేష మనియు మా నమ్మకము. ఇది లీనమై యంతర్గత మైనపుడే అతి గోప్యమగు రహస్యార్థమును గుర్తించక ఆర్థిక రాజకీయ స్వార్థచింతనలబలముచే, వెనుకనుండి, తన యంశంబొండు ప్రకటించునట్టి మానవకోటి యొక్క వక్ర చలనములు, మందగతులు, దీర్ఘరాత్రులు, సంధ్యలుగల యుగము లగుచున్నవి. అది పునఃబహిర్గత మగుకాలము మానవకోటికి. తేజోవంతము శీఘ్రవికాసము నగువేకువలు, ఫలప్రదములగు వసంతకాలములు నగుచున్నవి. బహిర్గతమగు చింతనారూపము యొక్క గభీరత, వీర్యము, సత్యము, ఫలదాయకమగుశక్తి, వీనినిపట్టి దివ్యకాలాసన్నతయు, ధాత్రియందు పురోభివృద్ధియు నాధార పడియుండును.

చింతన మనునది జీవనవికాసమందలి కుసుమము లేక జీవనాలంకారమగు నాభరణము మాత్రమనియు, మానవుడు చేయు కర్తలకు రాజకీయ ఆర్థిక స్వీయలాభములే మూలాధారము లనియు నేటి లోకానుభవజ్ఞు డనుకొనుటకన్న గొప్ప పొరబాటు వేఱొండులేదు. ఈ ప్రపంచము ప్రాణభరితము, కర్మభూయిష్ఠము, ప్రవర్థమానమగు జీవగణయుతము యని మేమెఱుంగుదుము; కాని ప్రాణిక భౌతిక బలముచే మాత్ర ముద్గమింపజూచు జీవయాత్ర ఆలస్యాంధకార ప్రమాదకలుషితమైన వృద్ధినే చెందును.

మఱియు నయ్యది మానవుని జంతు వృక్షజాతి విధానముతో సరిపెట్టినదియే యగు. భూమి ప్రాణభౌతికమయమగు ప్రపంచము, మానవుడు చెట్టును జంతువునుగాడు; అత డిచ్చట దేహధారియై మహత్తరకర్తలకు ఉన్నతతర ప్రేరణలచే నా జంతురూపమును దివ్యోపకరణముగ నొనర్పనున్న నాధ్యాత్మిక చైత్యపురుషుడగుచున్నాడు.

కావున నతడు తన బాహ్యజీవితమందు గుర్తించలేకపోయినను తనలోనున్న యొకసంకల్ప విశేషమునే సదా సమకూర్చుచుండు. గంభీర జీవనాభిప్రాయముల ధిక్కరించు లేక నేవగించు వ్యవహారికపురుషుడుగూడ తా ధిక్కరించి యేవగించు భావమునే సేవించుచున్నాడు. భావము బహిర్గతమై జీవయాత్రకు త్రోవజూపిననే మానవుడు సంపూర్ణతను గాంచగల్గును.........

దానం జేసి మానవాభ్యుదయము పర్యాయముగా తమః ప్రకాశములతో గూడిన ద్వంద్వపంక్తులంబయిన నిరంతరవిప్లవరూపమైయున్నది, అట్లయ్యును ఈ యహర్నిశలు రెండును అభివ్యక్తముగా నున్నదానిని పోషించుచున్నవి. భూమియం దన్నిచోట్లను ఇవి యొకటే సమయమున తటస్థించుటలేదు. నీ యుగమునందు మొత్తముపై నాశియా ఐరోపా ఖండములలో నిట్టి యుద్యమము కేంద్రీకరించియున్నది. ఆశియాఖండము మేల్కొన్న కాలము ఐరోపా నిద్రించుకాలమైయుండెను. అటులనే ఆశియా జడత్వముగాంచి సుషుప్తిజెందిన రాత్రులు ఐరోపా మేల్కొని మనోదీప్తిని ప్రాణవీర్యమును గాంచిన పగళ్ళగుచుండెను.

అయినను, ఇం దొక ముఖ్యవ్యత్యాసముగలదు. కేవలముగా గాకపోయినను ప్రబలముగా నాశియాఖండము మనుజునియొక్క

అధ్యాత్మికానుభవాభ్యుదయమునకు ముఖ్యక్షేత్ర మయ్యెను. ఐరోపా యన్ననో మనఃప్రాణ క్రియాకలాపమునకు కర్మాగార మయ్యెను. యుగములు జరుగుకొలది పూర్వఖండము, కొంత కాలము వేగవంతమై నూత్నాభ్యుదయముల గాంచి మఱికొంత కాల మచంచలమగు నిలుకడం గాంచుచు నధికాధికముగ నాధ్యాత్మికశక్తిక నిలయముగ మారినది. ఈశక్తివాహిని ఐరోపాపై నీ యుగమున మూడు నాలుగుపర్యాయములు ప్రవహించినది, ఒక్కొక్కసారియు నీ ప్రవాహమందలి అధ్యాత్మిక సారమును ఐరోపాఖండము సంపూర్ణముగనో పాక్షికముగనో త్యజించి దానిని మానసిక భౌతిక నూత్నాభ్యుదయములకు ప్రేరణోత్సాహముగ గైకొనినది.

మొదట ఈజిప్టియన్ చాల్డియన్ ఇండియన్ జ్ఞానము పితాగరస్సు మొదలు ప్లేటోనియన్ పిదప నవీన ప్లేటోనియన్లు లోను గాగల గ్రీకుతత్త్వవేత్తల భావములద్వారా ప్రవేశించినది; దీని ఫలితమే మహత్తరప్రతిభాపూరితమును, అనాధ్యాత్మికమును అగు గ్రీకురోమన్ నాగరికత. కాని అది బౌద్ధ, వైష్ణవమతములకు, సెమిటీయుల భావములను క్రైస్తమతరూపమున రెండవపర్యాయము యూరోపునందు ప్రవేశింప నెడమిచ్చినది. క్రైస్తమత మైరోపాతత్త్వమును చాలవఱ కాధ్యాత్మికముగను విరాగపూరితముగను జేయయత్నించినను గొద్దిలో తప్పిపోయినది; మతగురువులగు గ్రీకుపండితుల మనస్సునందలి తత్త్వజ్ఞానవికారమును, క్రైస్తవ సంప్రదాయమునకును గ్రీకురోమన్ మేధకును గుణములయందేమి లోపములందేమి ప్రత్యక్ష విరోధభావముగల జర్మానియా వాళ్ళల యాకస్మిక దాడియును దానిని దిగ్భ్రమ జెందించినది.

# ఐదవ తరంగము

స్పెయిన్‌పై మఱియు మధ్యధరాసముద్రతీరపు దక్షిణ దేశములపై నొనర్చిన మహమ్మదీయ దండయాత్రయే మూడవది. భావములను శాంతముగ బ్రసరింపజేయుటయే నైజముగాగల ఆశియాఖండము తన స్వీయమార్గమును వదలి తద్విరుద్ధమైన ఐరోపావారి మార్గానుసారముగ భౌతిక రాజకీయ విప్లవముల నుపయోగించినదిందు; ఆశియాఖండము తన వ్యుత్పన్నత నిట్లు ప్రయోగించినందులకు యుదాహరణ మిదొక్కటియే. దీనిఫలితమే ఐరోపియనులందు నాత్మభావములకు వస్తుశాస్త్రపరిజ్ఞానమునకు అంకురార్పణమైనది.

కడపటిదియగు నాల్గవప్రయత్న మింకను తిన్నని ప్రారంభ దశయందున్నది. ఇందు ప్రాగ్దేశజ్ఞానము ముఖ్యముగ ఇండియాను తత్త్వవిచారము, ప్రథమమున జర్మనియా తత్త్వజ్ఞానవ్యాజము నను, పదంపడి గెట్టేల, స్కాండినేవియనుల, స్లావులయొక్క భావనల, గుప్తవిద్యల, మతముల పునఃప్రబోధము గావించుట కును మెల్లగ దోడ్పడియును, తరువాత ఐరోపా-అమరికాలలో బౌద్ధమత-దివ్యజ్ఞాన (థియసాఫికల్) - వేదాంత - బాహాయిజం లో నగు ప్రార్థనల రూపమునను ప్రత్యక్షముగా నేమి బహిరంగ ముగ నేమి ప్రవేశించు టగుచున్నది.

ఆశియాపై పాశ్చాత్యదాడి రెండుసార్లు జరిగినది; కొంత కాలము పశ్చిమాశియాయందు నాటుకొనియుండి, ఇండియాలో కలవరముగలిగించి, తుదకు మహమ్మదీయ వ్యుత్పన్నత మూలమున, మధ్యకాలపు ఐరోపాయందు బ్రవేశించినట్టిదియు నుద్రేక గ్రీకు సంప్రదాయముతో గూడినట్టిదియు నగు అలెగ్జాండరు దండయాత్ర యొకటి. ప్రాగ్దేశపునీతి, కళ, ఆధ్యాత్మిక వ్యుత్ప

న్నతలపై నిప్పటి ఐరోపాదేశపు వాణిజ్య, రాజ్యతంత్ర, వస్తు పరిజ్ఞాన శాస్త్రముల నవీనదాడి రెండవది.

ఈ యన్యోన్యసంఘట్టనలనుండి క్రొత్తవిశేషములు రెండు చూపట్టినవి. ఇవి యేకకాలమందు సంభవించుట యొకటి. తమ లోని వైపరీత్యముల విశేషించి నొక్కి చూపుట రెండవది. అనాధ్యాత్మిక మేధయే ప్రధానముగ గల ఐరోపాఖండము ప్రపంచమునందెల్ల నాధ్యాత్మజీవనమునకు హృదయస్థానమైయున్న ఇండియాను గాంచినపుడు, ఇండియా తన జాతియొక్క లౌకిక మానసిక జీవనాభ్యుదయమును నిరసించుచు కేవల మధ్యాత్మ జీవనమందే అనేక యుగములుగా నేకాగ్రత వహించుచు నెట్టి మహాపరీక్ష యందును ఉత్తీర్ణతగాంచుటకై వేదన నొందుచున్నట్లు గ్రహించినది. ప్రాగ్వాహిని ఐరోపాలో ప్రవేశించునపుడు ప్రాగ్దేశము, మతమును భావవికల్పముగను, శుద్ధమనస్సారమగు తత్త్వవిచారమును నిస్సారమగు వాగ్డంభనగను, ఆత్మవిచారమును మిథ్యగను నిరసించి, మానవ మేధనంతయును భౌతిక శాస్త్రవిచారమునందును మానవ - శారీరక - సాంఘిక - ప్రజాపాలక - జీవనాభ్యుదయము లందును ధారపోయ సమకట్టినట్లుల ఐరోపాను గాంచినది.

ఆ మహాప్రయత్న మిపుడు పూర్తియైపోయినది; తన యసమర్థతను విపులముగ జాటించకున్నను అసమర్థతే అయినది. ఈ రీతినే ఇండియను ఆధ్యాత్మికోద్యమము గూడ తన యసమర్థతను జూపెట్టినది; దానివలన నొకానొక డెట్లు మహోన్నత పదవి గాంచునదియు, జాతియంతయు భగవానునే కోరి యా యాతుర తలో మానవకోటియందలి భగవానుని యుద్దేశ్యమును మఱచి యెట్లు పతిత మగునదియు జూచియున్నాము. ఐరోపా హైంద

వోద్యమములు రెండును ఆశ్చర్యదాయకములు; అత్యద్భుత కార్యముల నొనర్చినవి; చివరకు భగవానుడును ప్రకృతియు మానవుని ఆత్మోన్నత్యమునకును మేధోన్నతికిని అందజాలని యగాధము లయ్యెను.

వ్యష్టియందును సమష్టియందును సాధింపతగిన సమంజస సంపూర్ణ మానవాభ్యుదయమునందే మానవజాతియొక్క విముక్తి యాధారపడియున్నది. మానవజన్మయొక్క ఆధ్యాత్మికతను గుర్తించిననే ఐరోపావారు బాగుపడగలరు. లేనిచో తమదైన జ్ఞానసూన్యమగు మేధవలనను జీవరహితమగు కట్టుదిట్టముల వలనను చితుకగొట్టబడెదరు. ఆశియాగూడ తన లక్ష్యసిద్ధికి అనివార్యమగు భౌతిక మానసిక స్థితి నిబంధనలను గుర్తించిననే తాను రక్షింపబడగలదని తెలియవలెను. లేనిచో శరీర మనోబలంబు లుడిగి మఱికొంత హీనస్థితిని జెందును. కేవల మన్యోన్యరూపాను కరణంబించుకేని సహకారి కానేరదు. పునర్జీవహేతుకములగు నన్యోన్యాకర్షణములు అవసరము లగుచున్నవి.

ఈ రెండు గొప్పమానవోద్యమములయొక్క ఏకకాల సమావేశ సంయోగములు భవిష్యన్మానవాభ్యుదయముల కాశాపూర్ణములేగాక, అపాయకరములును గాగలవు..........భౌతిక శాస్త్రాభ్యున్నతలు మానవజాతిని దగ్గరకు జేర్చినవి, మంచిదైనను చెడ్డదైనను వాని భవిష్యత్తు ఒక్కటైయున్నది; స్వతంత్రించి యొక్కొకటి వేర్వేఱు అభ్యుదయముల నికమీద గాంచనేరవు. భౌతిక శాస్త్రాభివృద్ధి యాచరణముల చేతను ఆత్మజీవన చేతను అంతర్బాహ్యైక్యము మానవకోటియందు ప్రతిష్ఠించ నవకాశము గలుగుచున్నది.

ప్రపంచముయొక్క స్థితిగతుల విధానమును సత్యమును ధర్మమును తెలిసికొని, వానిచే మానవ జీవన కర్మలు భావనలు నడవడులు కట్టడలు లోనగువానిని శాసించి, ఇదియే మానవాభ్యుదయసిద్ధులకు శ్రేయమని నమ్మకము గల్గించుచున్నయే ఐరోపియన్ జ్ఞానమునకు బీజము.

ఈ భావము పూర్ణముగ సరియేయని మేమంగీకరించుచున్నాము; కాని దానిని ఆచరణలో నుంచుటయందు పొరబాటు జరిగినది. మనము తెలిసికొనవలసిన సత్యము, ధర్మము, భౌతిక ప్రపంచమునుగూర్చియు కాదు; మనశ్శరీరముల గూర్చియు గాదు; ఇవన్నియు గావలసినవైయున్నను, విడువరానివైనను, వీని కన్నింటికి నాధారమగు నాత్మసత్యమును, ఆత్మధర్మమును తెలిసికొనవలెను. ఏలన, పదార్థములందలి యాత్మబలమే వాని రూపములయందును విధానములయందును వ్యక్తమగుచున్నది.

తన్నుదా తెలిసికొనిననే మానవుడు ముక్తుడగును. 'ప్రపంచము నంతయు జయించి యాత్మను బోగొట్టుకొనినచో—తన్నుదా గోల్పోయినచో—లాభమేమి?' అను సత్య సందేశమే ప్రాగ్దేశము ప్రతీచికొసగు సందేశము. ప్రతీచి దీనిని విని ఆత్మతత్త్వ ధర్మములను గనుగొన యత్నించుచున్నది. యాంగ్లికేయ ప్రతిభానిలయములగు నింగ్లాండు అమెరికాలలోను విమర్శనాకౌశలము తత్త్వసంకీర్ణమైన జర్మనీయందును తలయెత్తినట్లు మనకు గోచరించు బాహ్యవిద్యావైశిత్యతయు, కేవలమును గుణించిన బౌద్ధిక ఆనాధ్యాత్మిక పెడవాదములును ముంచివేయగలవను అపాయము గలదు. 'ఆత్మసత్యమే నిశ్చయము యథార్థము నగు సత్య' మను దృఢ ప్రతిజ్ఞయు, 'ఆత్మసత్యమును బడయుట కధ్యాత్మజీవనమే

మార్గ' మను నమ్మకమును, ఉత్తమదృష్టితో దాని ధర్మముల గ్రహించి యాచరింపవలయు' నను స్థిరబుద్ధియు, విశ్వాసమును, 'ఈ మహోద్యమమునకు దగిన సాధనములుగ మానవ బాహ్య జీవనమును, సంఘ నడవడులను నిర్మింప యత్నించవలయు' నను తీర్మానమును ఆశియాను ప్రకాశవంతము చేసినట్టి భావము.

ఈ భావమును యథార్థమగు సత్యమే, దీని నాసాంతము మే మంగీకరించుచున్నాము. కాని ఆచరణయందు ముఖ్యముగా నిండియాలో నాత్మను తదుపకరణములను, భేదము గల్పించి దూరీకృతము గావించుటచేత జాతియొక్క మనోబాహ్యజీవనలు సంకుచితము లయినవి. ఏలన, సంపూర్ణజీవనోపకరణ వికాసము లైననే ఈ సుస్థిరాఖండాత్మసిద్ధి యాధారపడియున్నది. ప్రాగ్దేశీయ పూర్వులీ జ్ఞానమును బడసి యనుభవములో నుంచిరి. వారి సంతతులయందీ జ్ఞానము సన్నగిలి ఆచరణలో క్షీణించినది.

ప్రాగ్దేశమునకు ప్రతీచి యొసంగు సందేశము నిజమైనదియే. మానవుడును భగవంతుడే. మానవత్వమున వృద్ధిచెందు కొలది దేవత్వమునకు సమీపింప నగు; జీవితము దైవికమే, ప్రవర్ధమానమగు దాని వికాసమే బ్రహ్మము యొక్క ఆత్మవికాసము; జీవనము నిరసించుట అంతర్వర్తియగు భగవానుని నిరసించినట్లగును. ప్రాచీన జ్ఞానమిది. ప్రతీచి నుండి ప్రాక్కునకు పునరాగామి యగుచున్నది. ప్రాగ్దేశ మీ సందేశముచే ప్రబోధము నొందుచున్నది. ఆశియా కొంతకాలము తన స్వభావమును ధర్మమును మఱచిపోయి, ఐరోపావిధానమున దానిని గ్రహించి, గ్రుడ్డిగ పాశ్చాత్యానుకరణము చేయుటయో లేక దూష్యము వికృతము నగు మిశ్రమముగ నొనర్చుటయో యను ప్రమాదము

నకు యెడమియ్యగలదు.

కావున ప్రస్తుత మాలోచింపవలసిన దేమన, సరియైన భావమును సరియైన సమన్వయమార్గమును గనుగొనుట; మనశ్శరీర జీవనల నాక్రమించి పూరించి యధిష్ఠించునటుల పురాతనము సనాతనము నగు అధ్యాత్మ తత్త్వమును పునర్నిర్వచనము చేయుట; అత్యుచ్చబలైశ్వర్యములతో, మానవ మనోచైత్యజీవనను, అధ్యాత్మ జీవనను వ్యక్తము జేయనోపునట్టి యమోఘము వీర్యవంతము నగు నాధ్యాత్మికశిక్షణలను యోగవిధానమును వృద్ధిపఱచుట; బాహ్య జీవనము, సంఘము, నడవడులు ఇవి ఆత్మసత్యముపై నాధారపడి క్రమముగ పునర్నిర్మితములై మానవుని స్వేచ్ఛకును సంఘైక్యతకును సంపూర్ణ సమరత్వమును సమకూర్పజాలు సాధనసంపత్తులని గనుగొనుట.

ఇదియే మా లక్ష్యము, 'ఆర్య' యందలి మా యన్వేషణము. ఈ భావముచే ప్రేరితములైన యుద్యమములు ప్రపంచమం దనేకములు గలవు, కాని ప్రకృతము వాడుకలోనున్న మత, శాఖ, తత్త్వసిద్ధాంతములందు గల ఆసక్తిచేత నేర్పడు దృష్టిలోపములేకుండ నీ సమస్యను సర్వభావములతో సంపూర్ణముగ వీక్షించు చింతనాన్వేషణమునకు యెడ మెంతేని కలదు.

సృష్టికి మూలమగు సత్యమును, అది జగత్తునందు వ్యక్తమగునట్టి ధర్మమును అన్వేషించు తత్త్వవిచారమును మత నిర్వచనమును; మానవుడు శుద్ధసిద్ధులంగాంచు నాధ్యాత్మిక శిక్షణల, సమరసముజేయు యోగమార్గముల ప్రవచనమును; మానవసంఘ జీవన సమస్యల కీ భావముల సమన్వయ మొనర్చుటయు నివి యన్నియు నీ యుద్యమాంశములై యున్నవి.

# ఐదవ తరంగము

ఇట్టి యుద్యమమునకు మూలము తత్త్వవిచారము, మత విషయక పర్యాలోచనము; కావున వీని ప్రాముఖ్యతను త్రోసి వేయజూచుట తగదు. గోచరమగు దాని వెనుకనుండు భావమును ఆలోచించి దాని సాధారణధర్మమును నిరూపించుటయే మానవుని ప్రబోధచైతన్యముయొక్క లక్షణము, ధర్మమును; ఈధర్మ నిర్వచనము నే మానవుడు మతముగా మార్చుకొనును. పదార్థముల మూలమునుగురించి బుద్ధితో నొనర్చువిచారమే తత్త్వవిచారము, మానవునియందీ సత్యమును జీవయుతముగ జేయుటయే మత మనబడును. ఈ రెండు అన్యోన్యాశ్రయములు; తత్త్వనిరూపణములేని మతము అంధకారబంధురమైన మూఢనమ్మకమగును, జీవయుతముగాని తత్త్వవిచారము ఆచరణకు రాజాలనిదైన నిష్ఫల ప్రకాశమగును.

కావున 'ఆర్య' లో ప్రథమమున ఈ సమస్యను గూర్చిన తత్త్వవిచారమును కడు దీర్ఘముగ నిర్వచనము చేయవలసివచ్చినది; ఇట్లు చేయనియెడల మేము వచించునది యథార్థము, ఘనము, శాశ్వతము నగు విలువ గాంచ నేరదని మా నమ్మకము. కావున మా భావప్రకటనమందేమి ప్రాగ్దేశపు ప్రాచీన జ్ఞానపరిశీలనా పునర్నిర్వచనమునందేమి విశేషించి వ్రాయవలసివచ్చినది.

మా రెండవతలంపు ఆధ్యాత్మ యోగశిక్షణముల గూర్చినది. ఇందును యోగమార్గములను సాధారణ విపులనిర్వచనము గావించుటయందే తృప్తిజెందక వాని మూలమును సాంతముగ విచారింప దొడగితిమి. ఇట్లుచేయనియెడల కేవల మార్గనిర్వచనము నిరర్థకము నిరుపయోగము మాత్రముఅయినదగును. పూర్ణసిద్ధికి సుళువగు ననుష్ఠానమార్గములు గన్పించవు.

*

* *

మానవజాతియొక్క ఐక్యము ఆంతరంగిక-ఏకత్వముచేత నే గాని కేవలము బాహ్యసంసర్గములవలన గానేరదనియు మానవుడు మనఃప్రాణశరీరములను మించి యాత్మపథంబు నొందవలయుననియు అధ్యాత్మబలము దేహమనంబుల బ్రవేశించి మానవునకు అమానుషత్వంబు నొసంగుననియు సామాన్యముగ మేము భావింతుము.

*

* *

మఱియు మానవజాతి ఒక నూత్నజీవనమునుగూడ సమకూర్పగలిగిన పరివర్తనమునుగూర్చి నడచుచున్నదను భావముతో మేము ప్రారంభించితిమి. ఈ పరిణామమున — ఈ యుద్యమమున — జాతికి సహకారులై దారిచూపగలిగిన ఆధ్యాత్మిక, మత తదితర సత్యాన్వేషణమే మేము లక్ష్యముగా గైకొంటిమి. ఈ యుద్యమమున కాధారభూతములగు నాత్మానుభవము, సత్యదర్శనము మాకు లభ్యమైయున్నది. లేనిచో ఈ కార్యమును బూనుటకు మా కధికారమే లేదు. అయినను దానిని సమగ్రముగ తెలియపఱచుటకు ఉత్కృష్టము, గూఢము, కఠినము నగు దీర్ఘచింతనము పలుతెఱంగుల జేయవలసివచ్చినది. ఈ భారమును మామీదను, చదువరులమీదను విధించవలసివచ్చినది.

*

* *

మాచే ప్రాధాన్యము గాంచిన తత్త్వవిచారమును "దివ్య జీవనము" (The Life Divine) నందు విస్తరించి నిర్వచనము

గావించితిమి. ఇందు వేదాంతమార్గానుసారముగ జీవుడు-మనస్సు-ప్రాణము, సచ్చిదానందము-జగత్తు, జ్ఞానము-అజ్ఞానము, పునర్జన్మ-అధ్యాత్మలను గురించిన వేదాంతభావములతో ప్రారంభించితిమి. కాని వేదాంతము సామాన్యముగ జీవన నిరసనవిధానమని యూహించుట గలదు. ఇదియే యందు కొంత నొక్కి చెప్పబడి యున్నది. వేదాంతము తొలుత 'సర్వము బ్రహ్మ' మను మూలసత్యముతో ప్రారంభించినను తుదకీ 'జగమంతయు బ్రహ్మముగాదని అనాత్మయే' యని గట్టిగా నుడివి విరుద్ధసిద్ధాంతమున పర్యవసించినది. కాని మేముమాత్రము నీ వేదాంత సిద్ధాంతమునుండి విపులమగు నద్వైతమును స్థాపింప సమకట్టితిమి. మనస్సు, ప్రాణము, జడపదార్థము అను నివి విజ్ఞానమనబడెడు విశ్వాధారమగు అధ్యాత్మ మనస్సుద్వారా ఆత్మనుండియే నిష్పన్నములయ్యెననియు మనస్సును ఆస్థితి జెందినదగు నట్లభివృద్ధిపఱచినచో జగత్తునందున్న చేతనయొక్క యథార్థ సత్యమును జీవితముయొక్క యథార్థసత్యమును బరమ ధర్మమును మానవుడు పొందగలడనియు మేము నిరూపించుచున్నాము.

ఆత్మయే సచ్చిదానందము. దానికిని ప్రపంచమునకును మానరానివిరోధము కనుపించదు. ప్రపంచమును అజ్ఞానదృష్టితో జూచుచున్నాము, జ్ఞానదృష్టితో చూడవలెను. భౌతికజడతయందు లీనమై పూర్ణచైతన్యమునుగాంచ వృద్ధిజెందుచున్న జ్ఞానమే మన యజ్ఞానము. ఆ పరివర్తనమునుబూర్తిచేసి మానవలోకమున నధ్యాత్మజీవనమును వికసింపజేయుటకే పునర్జన్మపరంపరలు అవకాశములుగ నేర్పడినవి. పరిణామమందలి సత్యమును మేమామోదించుచున్నాము. పాశ్చాత్యులచే దాని కొసంగబడిన

స్థూలరూపమున గ్రహించుటలేదు. ప్రాణము, మనస్సు, ఆత్మ, ఇచ్చట భౌతికములో విలీనమైయుండి క్రమముగ వ్యక్తమగుచున్న వను తత్త్వనిరూపణమునే గైకొనుచున్నాము. ఈ పరిణామము యొక్క శిఖరమున నధ్యాత్మజీవనమును దివ్యజీవనమును గలవు.

ఈ సత్యములు పూర్వవేదాంతమునకు భిన్నములు కావని నిరూపించవలసివచ్చినది. కావున వేదమును రెం డుపనిషత్తులను గీతను ఈ దృష్టితో బరిశీలించితిమి. వేదరహస్యము కర్మఠుల చేతను పండితులచేతను మఱుగుపరుపబడినది. కావున వేదఋషుల రచనాశైలియు వారి సాంకేతికములను అవి తెలియజేయుసత్యములను కొన్ని వ్యాసములలో సూచనగామాత్రమే నిర్దేశించితిమి. ఉపనిషత్తులలో ఈశ కేనలను గైకొంటిమి. పూర్తిచేయవలయునన్న తైత్తిరీయముగూడ చేర్చవలసియుండెను. కాని అది పెద్దదైనందున గ్రంథవిస్తరభీతిచే వదలితిమి. జీవనతత్త్వముయొక్క అతివిశాలము కాఠిన్యాంశము నగు కర్మాచరణమున ఆత్మసత్యము నే రీతి ననుసంధించవలసినది, కర్త ఏతీరున నధ్యాత్మజన్మను బడయునది, అధ్యాత్మజీవనముతోడి దాని నెట్లు సమరసము జేయవలసినది గీత నుండి ప్రతిపాదించుచున్నాము. తత్త్వవిచార మాచరణములో నుంచినగాని సార్థకము గాకుండుటచే 'యోగసమన్వయము'న పలు తెఱంగులగు నధ్యాత్మశిక్షణల మూలతత్త్వములను మార్గములను పరిశోధించి దివ్యజీవనమునకు అవి ఎట్లు సహకారులగునదియు జూపించితిమి.

అయిన నియ్యది యొకవ్యష్టియొక్క యాత్మాభ్యుదయమునకు మార్గమే గావున అది మానవజాతియొక్క సంఘజీవనమం దెట్లు వర్తించునదియు నిరూపించుట కావశ్యక మేర్పడినది.

అందుచే 'సాంఘికపరిణామతత్త్వము'న ఈ సత్యము లెట్లు మానవ సంఘపరిణామమునకు తోడ్పడునదియు సూచించితిమి. 'మానవైక్యాదర్శము' న మానవజాతియొక్క ప్రస్తుతపరిస్థితు లే యే తీరున ఇంకను సన్నిహితమగు నైక్యమును గాంచగూడినదియు, అందలి శుభసూచనలను, విశదపఱచి, యథార్థమగు మానవైక్యమును గాంచుటకు దానిలో నెయ్యది లోపించినదియు గనుపఱచితిమి.

ఈ పథకమున ముఖ్యముగ మూలసూత్రములను మాత్రము నిర్ణయించి వానిని సంపూర్ణముగ చర్చింపగలిగితిమి.

పైని పేర్కొనిన సంకల్పానుగుణముగా 'భాగవత జీవనము', 'యోగసమన్వయము', 'గీతావ్యాసములు', 'వేదరహస్యము', 'ఈశ కేనోపనిషత్తులు' 'మానవైక్యాదర్శము', 'సాంఘిక పరిణామ తత్త్వము' అను వీనికే ప్రాధాన్యమిచ్చి రచించినను, ఇతర విషయముల నెన్నింటినో వీరు విమర్శించి ఇందు నిగ్గు తేల్చి యున్నారు. 'భారతదేశ పునరుద్ధరణము', 'హైందవ సభ్యతాసమర్థనము', 'భావికవిత్వము' అను విషయములను గుఱించి విపులముగా విమర్శించియున్నారు. ఇవిగాక 'యుద్ధము-స్వయంనిర్ణయము', 'సభ్యత', 'పునర్జన్మ-కర్మ' మున్నగు విషయములను గుఱించియు సూక్ష్మముగా తమ సిద్ధాంతముల వెల్లడించియున్నారు. సంస్కృతమునుండి 'భర్తృహరి' నీతిశతకము నాంగ్ల

మున కనువదించిరి. 'ఆర్య' సంచికలలోని ముఖ్య రచనలు 'గీతా వ్యాసములు', 'భారతదేశ పునరుద్ధరణము', 'యుద్ధము - స్వయంనిర్ణయము', 'దివ్య జీవనము', 'ఈశోపనిషత్తు' మున్నగునవి ప్రత్యేక గ్రంథముల రూపమున నిపుడు ప్రకటితములై యున్నవి. మఱల నా ఈశ్వరాదేశమున గాబోలు నిరంతరముగా నాఱున్నర సంవత్సరములు సాగనిచ్చిన 'ఆర్య' ను గూడ నకస్మాత్తుగా నిలిపివైచి యోగానుభవములందే శ్రీఅరవిందులు నిమగ్నులైరి. పాఠకులు మానసికముగా గ్రహించగలిగినదంతయు, భాషారూపమున వెల్లడించ గలిగినదంతయు, సారాంశరూపమున ప్రకటితమైనదని యు, నిక కేవల పూర్ణాత్మానుభవమువలన యోగ సాధన వలన మాత్రమే ఆత్మసత్యమును భౌతికమందు స్థాపించవలెననియు, 'ఆర్య' పత్రికానిర్వహణమునకన్న తదేక నిష్ఠతో నంతస్సితముగా నాధ్యాత్మికముగా సృష్టించవలసిన మహత్తర కార్యము లున్నవనియు దలంచియుండవచ్చును. ఏకారణముననైతే నేమి తత్వ జ్ఞాన ప్రపంచమున 'ఆర్య' పత్రికారూపమున దేదీప్య మానముగా వెలింగిన దివ్యజ్యోతి తన ఏడవ సంవత్సర ముననే కొడిగట్టినది.

ఇక శ్రీఅరవిందుల రచనా మహత్త్వమును గురించి, ముఖ్యముగా 'ఆర్య' లోని వాఙ్మయమును గురించి ప్రస్తావింపబూనుట మాకుమించిన ప్రయత్నము. శ్రీఅరవిందుల గ్రంథములను చక్కగా బఠించి జీర్ణించు కొనిన విజ్ఞులు, ప్రతిభావంతులు, తత్త్వోపాసకులు ఈ మహాకార్యమునకు బూని, అపూర్వదర్శన యోగముల వెల్లడించిన యోగీశ్వరులుగా, 'అహనా', 'ప్రేమ-మృత్యువు', 'బాజీప్రభువు' మున్నగు రసాత్మక కావ్యములను 'భావికవిత్వము' అను గ్రంథమును రచించిన కవిచక్రవర్తులుగా, 'భర్తృహరి' 'విక్రమోర్వశీయ నాటకము'మున్నగు సంస్కృత గ్రంథముల ననువదించిన ఉత్తమానువాదకులుగా, వేద వేదాంత గీతాగ్రంథములకు సర్వాంకషవ్యాఖ్యాన మొనర్చిన భాష్యకారులుగా, కజిన్సు,ఆర్చర్ మున్నగువారి గ్రంథముల సాకల్యముగా విమర్శించిన విమర్శక విచక్షణులుగా, విద్యావిశారదులుగా నిట్లు వేర్వేరు వారియనంతగుణముల సూక్ష్మముగా నేని వెల్లడించి ఆంధ్రలోకమునకు మహోపకార మొనరింతురు గాకయని ప్రార్థితులు. కాని శ్రీఅరవిందుని రచన కేవలము బుద్ధిబలముతో, ఆలోచనసామర్థ్యముతో చర్చించి, తర్కించి, ప్రాకులాడి ప్రయత్నించి

వ్రాయబడినదిగాక వారు వేదకాలపు ఋషిపుంగవులవలె ద్రష్టయై అంతస్సిత ప్రేరణమున వెల్లివిరియించిన వాఙ్మయమనిమాత్రము చెప్పనగును. 'ఆర్య' పత్రికాపాఠకులకు శ్రీఅరవిందులు ఋక్కుల గాన మొనరించిన ఋషికవియని, సర్వతోముఖపాండితీ విభాసియని, సర్వజ్ఞుడని కొంత తెలియగలదు. శ్రీవారు శిష్యుని కొక లేఖలో వ్రాసిన విషయము లీ సందర్భమున అప్రస్తుతములు కావని సంగ్రహముగా నిట నుదాహరించుచున్నాము:...

......నే నెన్నడును సుతరాం తత్త్వవేత్తగా నుండలేదు. యోగాభ్యాసమునకు పూర్వము పుదుచ్చేరి చేరకముందు నాకు తత్త్వశాస్త్రమును గురించి తెలిసియుండినది స్వల్పమే. వస్తుతః కవిగా రాజతంత్రజ్ఞుడనుగా మాత్రమే యుంటిని. తత్త్వశాస్త్రజ్ఞుడనుగా మాత్రము కాదు...............

నే నెట్లు తత్త్వవేత్త నైతిని? దీని కొక గాథ కలదు. తాత్త్వికమాసపత్రిక కొకదానికి వ్యాసముల వ్రాసిపెట్టి సాయపడుడని నన్నొకరడిగియుండిరి. యోగి దేని నేని నిర్వహించుటకు సిద్ధముగా నుండవలయునను సిద్ధాంతము నాది; అందువలన నాతని కోరికను నిరాకరించలేకపోతిని. ఇంతలో (౧౯౧౪) యుద్ధము ప్రారంభమై ఆ మిత్రుడు దేశము వదలిపోవలసి వచ్చినది. అపుడు ప్రతిమాసము నొంటరిగా నొక్కడనే తత్త్వశాస్త్రములతో అరువదినాల్గు పుటల నింపవలసినభారము నాపై బడినది...అనుదినము యోగాభ్యాసము చేయునపుడు గుర్తించి

తెలిసికొనిన దాని నంతను బుద్ధిగ్రాహ్యముగా వ్రాయుట సంభవించినది. అది తనంత తానే తత్త్వశాస్త్రమైనది!

శ్రీ అరవిందులు మత, రాజకీయ, సాంఘిక, సారస్వతాది కళావిశేషముల నన్నింటిని ఆధ్యాత్మిక దృష్టితో సమన్వయ మొనరించి వాని యన్యోన్య సంబంధమును పరమార్థమును వెల్లడించియున్నారు. సుప్రసిద్ధ పాశ్చాత్య కవిశేఖరులగు షేక్సిపియర్, మిల్టన్ వర్డ్సువర్తు, షెల్లి, కీట్సు మున్నగు ప్రాచీనులయొక్కయు బర్నార్డుషా, వెల్సు, రసల్ (ఎ. ఇ.) మున్నగు యాధునికుల యొక్కయు కావ్యముల నన్నింటిని ఆమూలాగ్రముగ విమర్శించి అంతర్ముఖదృష్టితో కావ్యప్రపంచమున వారివారి యథాస్థాన మిదియని సోదాహరణముగ శ్రీ అరవిందులు నిర్ణయించిన విషయము వారు రచించిన 'భావి కవిత్వము' ను, దిలీపకుమార రాయకృత 'అనామి' అను బంగాళీ గ్రంథములో బ్రకటితములైన వారి లేఖలను బఠించినవారికి స్పష్టము కాగలదు. వారి యాంగ్లరచనా నైపుణ్య మసామాన్యము. అందు మహత్తరమైన ఆధ్యాత్మికభావముల పరిమళము గుభాళించుచుండును. క్రొంగ్రొత్త శయ్యాపాకములు, విశిష్టము నసాధారణము నగు భావార్థముల నీను నూతన

పదజాలములు, పోకడలు గలవు. ఇట్టిలీత విజ్ఞాన విభూషణములతో శ్రీఅరవిందు లాంగ్లభాషాకన్యను సర్వశోభాలంకృతం గావించి భాషాప్రపంచమునం దగ్రపీఠమున నెక్కించిరి. ఆత్మానుభవము లేక కేవలము హేతువాదమునకు తర్కమునకు బుద్ధిసూక్ష్మతకు ప్రత్యక్షభౌతిక శాస్త్ర పరిశోధనా పరీక్షలకును ప్రాముఖ్యమొసంగుటయే కాక ఆద్యంతము లివియే యను పాశ్చాత్య లోకమునకు యోగాభ్యాస పూర్వ కానుభవములను, వేదకాలపు సిద్ధాంతములను, తత్త్వసూత్రములను, పరమధర్మములను, సత్యములను, పరమార్థమగు భాగవత జీవనరహస్యమును సహేతుకముగ సప్రమాణముగ శాస్త్రీయముగ సర్వతోముఖముగ వెల్లడించి ప్రాచ్య పాశ్చాత్య సభ్యతాసంకలనము గావించి ప్రపంచకల్యాణమొనర్చుటయే భగవానుని సంకల్పమే యని శ్రీఅరవిందుల నిరుపమానాంగ్ల రచనావైభవము స్ఫురింపజేయుచున్నది.

ముందీ తరంగముననే 'ఆర్య' పత్రికనుండి యనువదించి యుదాహరించిన 'ఆర్య నాల్గవ వర్షము' అను భాగమును శాఠకులు పఠించియే యున్నారు. అందు మానవజాతి యొక్క నూత్న జీవనమునుగూడ

సమకూర్పగలిగిన పరివర్తన కేసి నడచుచున్నదని తాము గ్రహించితిమనియు, దానిని సాధించుటకు వలయు ఆత్మానుభవము తమకు లభించి యధికారుల మైత్రిమనియు శ్రీఅరవిందులు సూచించియున్నారు. ఈ విషయమును గురించియే మఱికొంచెము వివరముగా ౧౯౨౨-వ సంవత్సరము నవంబరు ౧౮-వ తేదీన కీ॥ శే॥ దేశబంధు చిత్తరంజన్ దాసు గారికి వ్రాసిన లేఖలో పేర్కొని యున్నారు. శ్రీఅరవిందులు దేనిని సాధించి తన్మూల మున మన బుద్ధి మనః ప్రాణముల నెల్లు పరిశుద్ధమొనర్చి నూతన జీవనమును దివ్య జీవనమును స్థాపింపదలచి నదియు, వారు బహిరంగముగా కర్మక్షేత్రమున బ్రవే శించుటకుగల అభ్యంతరమేమైనదియు కొంత యెఱుంగ నగును. ఆ లేఖలోని ఈ భాగమునుమాత్ర మనువదించి యీ క్రింద పొందుపఱచుచున్నాము.

ప్రియమైన చిత్తా!

జీవితము, కర్మానుష్ఠానము వీనిపట్లగల నా యిప్పటి భావ వైఖరులు, ఇవియే, నన్నిచ్చటికి గొనివచ్చిన వను విషయము మీకు తెలియుననియే తలంచెదను. ఒక నూతనమైన పునాదికి ఉద్గమిం చినగాని నిరంతరము నిష్ఫలమై పరిభ్రమించెడు చక్రమునుండి మానవుడు వెలువడి రాలేడను విషయము నాకు మఱింత

యెక్కువగా విస్పష్టమైనది. ఈ నిజమైన సాధనము, యాథారము—జీవితమునకు కర్మానుష్ఠానమునకు ముఖ్యమైనది—ఆధ్యాత్మికమని, అనగా యోగమువలనమాత్రమే పెంపొందగల యొకనూతన చేతనయని నా కవగతమైనభావము రూఢియైనది. మఱియు ప్రపంచమునకీ గొప్పవిజయమును జేకూర్చుట ఇండియాయొక్క కర్తవ్యకర్మ (మిషన్) యని నేను విశ్వసించుచున్నాను. ఈ భావము నాకెప్పుడు యుండెను. మునుపంత స్పష్టముగా తీవ్రముగా లేకుండెను. ఇపుడన్ననో అది యధికాధికముగా దృఢమైనది. కాని ఈ మహత్తర చేతనయొక్క క్రియాస్వభావమేమి? దాని సలప్రదమైన యథార్థస్థితి ఏమి? దానినెట్లు క్రిందికిగొనివచ్చి, సన్నాహ మొనర్చి, వ్యవస్థపఱచి జీవితమున కుపయోగించుట? మన ఇప్పటి యుపకరణములను, అనగా, బుద్ధి మనః ప్రాణశరీరములను, ఈ మహాపరివర్తనమునకు యథార్థము, శుద్ధము నగు సాధనములుగా-వాహినులుగా-నెట్లు చేయగలము? ఈ సమస్యనే నా స్వానుభవమున బరిష్కరింప బ్రయత్నించుచుంటిని. నా కిపుడా దృఢమైన సాధనము, విస్తృతజ్ఞానము, ఈ రహస్యసమస్య విషయమున నధికారవిశేషము లభించియున్నది. ఇంకను దాని పరిపూర్ణత్వము, దానిని పూర్తిగా చెలాయించగల స్థితి నాకు లభించలేదు. అందువలననే నే నింకను ఏకాంతముగా నుండవలసియున్నది. ఏలయన, నాకీ నవీనశక్తియొక్క స్వామ్యము స్పష్టముగా సంపూర్ణముగా లభించినగాని బహిఃక్షేత్రమున కర్మ నారంభించరాదని, చక్కని పునాదిమీద తప్ప నన్యత్ర నిర్మాణ మొనర్చరాదని నేను నిశ్చయించితిని.

అరవిందఘోషు.

# ఐదవతరంగము

ఇట్లు రాజకీయరంగమును సంపూర్ణముగా బరిత్యజించి శ్రీఅరవిందులు కేవల మాధ్యాత్మిక ప్రపంచముననే సమస్త శక్తుల వినియోగించి వర్తించుచున్నను బొంబాయిలోని 'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రిక వీరిపై నింకను రాజద్రోహదోషమొకటి యున్నట్లును పుదుచ్చేరినుండి కాలు కదల్చగనే నిర్బంధింపబడగలరనియు ౧౯౦౮-లో మానిక్‌తులా కుట్రసంబంధమున-అదియే ఆలిపూరు బాంబు కేసు - వీరు పారిపోయి వచ్చినట్లును సూచించుచు సంపాదకీయ వ్యాసమును ౧౯౨౫-వ సంవత్సరమున వింతగా బ్రకటించి దేశారాధకులపట్ల తనకుగల ద్వేషబుద్ధినే గాక తన యజ్ఞానమునుకూడ ప్రదర్శించుకొనినది. ఈ వ్యాసమున కపుడే యది యసత్యపువ్రాతయనియు దురుద్దేశ్యముతో వ్రాయబడినదనియు ఖండించుచు ఏ నేరమును శ్రీఅరవిందులపై లేదని యథార్థ మెఱింగిన యొకానొక న్యాయవాది ప్రత్యుత్తర మిచ్చియుండెను. మఱియు నీ విషయము మద్రాసుశాసనసభలో ప్రశ్నింపబడుటయు శ్రీఅరవిందులపై నేదోషారోపణముగాని తత్సంబంధమైన వారంటుగాని లేదని ప్రభుత్వమువారిపక్షమున ప్రకటింపబడుటయు నందఱెఱింగిన విషయమే.

# శ్రీ అరవింద జీవితము



## ఆఱవ తరంగము

### ఏకాంతవాసము

'ఆర్య'మాస పత్రికా ప్రకటన మాగిపోయినది మొదలు సుమా రైదుసంవత్సరములవఱకు శ్రీఅరవిందులు యోగసాధనయందే మఱింత నిమగ్నులై యుండిరనువిషయముతప్ప మఱేమియు బాహ్యప్రపంచ మెఱుంగుట కవకాశము కనబడదు. ఆకాలమున శిష్యుల నంతగానెవరిని శ్రీఅరవిందులు స్వీకరించకుండిరనియు, నప్పటికే తమ్మాశ్రయించి యుండిన కొద్దిమంది శిష్యుల కనుదిన మొకటి రెండుపర్యాయములు దర్శన మిచ్చుచు వారితో సంభాషించు చుండిరనియు, ప్రత్యక్షముగా శ్రీవారి సాన్నిధ్యమున గొంతకాల మాశిష్యులు ధ్యాన మొనర్చుచు సాధనచేయుభాగ్యము నందియుండిరనియు దెలియుచున్నది.

శ్రీ అరవిందుల జీవితచరిత్రముననే-కాదు ఆధ్యాత్మిక ప్రపంచముననే ౧౯౨౬ - నవంబరు ౨౪-వ తేది అత్యంత ముఖ్యమైన పుణ్యదినము. నాడు శ్రీఅరవిందుల సాధనయందొక మహత్తరమైన అంతర్ఘటనము సంఘటిల్లెననియు నాటినుండియే తమ్ము శరణుచొచ్చిన శిష్యులకుగూడ దూరస్థులై ఏకాంతవాసము నారంభించిరనియు వినుచున్నాము. నాటి యంతర్ఘటన మహాత్త్వమేమో దాని యంతరార్థపరిమితులేవో మనకు తెలియవు. యోగానుభవము లేనివారు లోపభూయిష్ఠమైన పృథక్దృష్టిగల మానవప్రజ్ఞతో నా విషయముల నూహించుట కష్టము. ఐనను పరిణామప్రక్రియ ననుసరించియో తన్ను మఱింతమఱింత భూలోకమున భగవానుడు నావిష్కరించుకొనబూనుట వలనో ప్రాణిక కక్ష్య మాత్రమే నెలకొల్పబడియుండిన భూలోకమందున్నతతరమైన మనఃకక్ష్య శ్రీ రామావతారమున స్థాపితమైనట్లే ద్వంద్వములకు త్రిగుణములకు నతీతమైన మఱియొక అధికాధికోన్నతతరమైన కక్ష్య శ్రీకృష్ణావతారమున నెలకొల్పబడినది. దానినే అధమనస్సని, అతిమనస్సని, అతిమనఃకక్ష్యయని (Overmental Plane) పేర్కొనెదరు. అదే దేవధామము, దేవలోకము. శ్రీ

అరవిందు లానాడు ఆకక్ష్యనందుకొని ద్వంద్వాతీతుడు త్రిగుణాతీతుడు నయ్యెనని చూచాయగా తెలియుచున్నది. కాని నాటినుండియే శ్రీఅరవిందుల యోగశక్తి కొంత బహిర్గతమగుట కుపక్రమించినదనియు ఆ యుపక్రమణము యొక్క ప్రారంభఫలమే శ్రీఅరవిందాశ్రమరూపము దాల్చినదనియు విశ్వసింపబడుచున్నది. శ్రీఅరవిందులు గడించిన ఆ యోగశక్తియొక్క — ఆ పరాశక్తియొక్క — దివ్యరూప లక్షణములును, ఆ శక్తిస్వరూపిణియగు లోకేశ్వరి వాత్సల్యానుగ్రహమువలన లభింపగల మహాభాగ్యములును, సాధకుడా మహాదేవి కరుణాకటాక్షమునకు పాత్రుడుగాగల సాధనవిధానములును కొంతకుగొంత సూత్రప్రాయముగా 'జనని' (Mother) అను దివ్యగ్రంథమున పేర్కొనబడియున్నవి. ౧౯౨౭-వ సంవత్సరమున కావల శ్రీ అరవిందు లేకాంతవాసము నారంభించిన తరువాత వ్రాసిన గ్రంథరాజమే యియ్యది.

ఈ కాలమందే తన శిష్యుల నెదుర్కొనుచున్న పలు సమస్యల పరిష్కరించుచు శ్రీ వారొసంగిన సందేశరూపక లేఖలు అనేకములు. ఇప్పటికే వానిలో కొన్ని నాల్గు సంపుటములుగా ప్రచురింపబడినవి. సావిత్రి యను మహాకావ్య రచనయు నాంగ్లమున సాగుచుండె

సు. ౧౯౫౦-డిశంబరు కింకను నిది చాలాభాగము సంస్కరింపబడినను సంపూర్తి గాకుండెను. అసంపూర్ణ మగు నీ మహాకావ్య మిప్పుడు రెండు సంపుటములుగా ప్రచురింపబడినది. ఋగ్వేద మందలి అగ్నిసూక్తముల కన్నిటికి ఆంగ్లానువాద మాకాలముననే పూర్తిచేయ బడినది. ఇప్పుడే అదియు ప్రచురింపబడినది. ఇంకను 'కడపటి కవితలు' లోనగు పద్యరచనలునూ సాగినవి. ఈ రచనలు పఠించినవారు శ్రీవారియొక్క యోగానుభవ మును లఘువుగానైన గ్రహించగలరని నమ్ముచున్నాము.

## శ్రీతల్లిగారు 'పుదుచ్చేరి' దర్శించుట

పది పండ్రెండేండ్ల పసితనమునుండియే యోగానుభవములగాంచిన ఫ్రెంచి దేశపు విదుషీమణి, శ్రీఅరవిందుల వలె, దివ్యజీవనమును పూర్ణయోగమూలమున భూలోకమందు స్థాపించవలయు నను స్థిరసంకల్పము గల మహాయోగిని, ౧౯౧౪-వ సంవత్సరారంభమున శ్రీఅరవిందులను పుదుచ్చేరిలో భౌతికముగా ప్రత్యక్షముగా దర్శించుట సంభవించినది. భారతదేశమే తన నిజమైన మాతృదేశముగా భావించి విశ్వసించిన ఆ స్త్రీరత్నము, ఆనాటి యుద్ధపరిస్థితులవలన నేర్పడిన ప్రభుత్వమువారి నిర్బంధ

విధాన మూలమున నిచ్చట నుండజాలక, ఇండియానుండి మరలిపోవలసివచ్చినను యుద్ధానంతరమున ౧౯౨౦-వ సంవత్సరము ఏప్రిల్ ౨౪-వ తేదీన తన నిజమాతృదేశమునకు వచ్చి స్థిరనివాస మిచ్చట నేర్పాటు చేసికొనినది. ఆమెగారి ప్రేరణోత్సాహముల శక్తిసామర్థ్యముల వలననే శ్రీ అరవిందుల లక్ష్యలక్షణములకు దగిన యోగసాధన నిలయము, ఆశ్రమము, క్రమక్రమముగా రూపముదాల్ప నారంభించెను. శ్రీ అరవిందులు ౧౯౨౬ నవంబరు ౨౪-వ తేదీన ఏకాంతముగా నివసించ నారంభించినది మొదలు ఈ మహాదేవియే సాధనార్థమై తమ్మాశ్రయించివచ్చిన సాధికాసాధకుల కుపదేశాదేశముల ననుగ్రహించుచు ఆశ్రమ వ్యవహారాది కార్యముల విజయవంతముగా నిర్వహించుచున్నారు.

## శ్రీ అరవిందాశ్రమము

భరతఖండమున నాశ్రమయుగము పునఃప్రారంభమగుచున్నదా యనునట్లు సర్వత్ర ఆశ్రమములు వెల్లివిరియుచున్నవి. ఆధ్యాత్మిక, మత, విద్యావిషయక సంబంధమేగాక కేవలము రాజకీయ సాంఘిక సంబంధమును, తుదకు వడకుట నేయుట మున్నగు పరిశ్రమ

సంబంధమును గల సంస్థలును కర్మాగారములును నేడాశ్రమనామముతో వ్యవహరింపబడుచున్నవి. ప్రాచీన సంప్రదాయముల నీవిధముగ బునరుద్ధరించ వలయునను ఉత్కంఠకు దోడు, పాశ్చాత్యసంపర్కమున గాబోలు, వ్యక్తిస్వాతంత్ర్యమని, సమష్టి పరిపాలనమని, యెల్లరకును స్వామ్యాధికారము లుండవలయునను భావాందోళన మా యాశ్రమముల నిర్వాహణమందును జెలరేగుచున్నది. ఈ సమయమున శ్రీఅరవిందు లాశ్రమము లగుఱించి, వాని నిర్వాహణము గుఱించి, తమ ఆశ్రమ మే విధముగా నుత్పత్తి యైనదియు దానిసంకల్ప మేమైనది యను విషయములను గుఱించి ౧౯౩౮-వ సంవత్సరమున ప్రకటించిన వ్యాసము మిక్కిలి యుపయోగకరమై ఆశ్రమధర్మసూత్రముల నెఱుంగుట కనువుగా నుండునని దాని యాంధ్రానువాదభాగము నీక్రింద బొందుపఱచుచున్నాము.

ఆశ్రమ మనగా నధ్యాత్మతత్త్వోపదేశకుని లేక యాచార్య పురుషుని గృహము లేక గృహములు. తత్త్వోపదేశమునకు, తదభ్యాసమునకు తద్వాశ్రయించి వచ్చువారిని అనుమతించి తా వొసంగినచోటు. ఆశ్రమ మొక సమాజము గాదు. మతసంస్థ గాదు, మతమును గాదు, — కేవలము పైని పేర్కొనినదే తప్ప తదితర మేమియు గాదు.

ఆశ్రమములోని సర్వస్వము గురువుగారిదే; సాధకుల విషయముననుు, ఏవిధముగను హక్కుగాని, స్వాతంత్ర్యముగాని పెత్తనముగాని లేదు. వారచ్చట నుండుటగాని, వెళ్ళిపోవుట గాని గురువుగారి యభీష్టానుసారముగానే యుండును. గురువున కర్పించు ద్రవ్యమంతయు వారి సొంత ఆస్తియేగాని ప్రజా సంస్థకు సంబంధించినదికాదు. ప్రజాసంస్థయే కానందున నా ద్రవ్యము సమష్టిమూలధనముగాని, నమ్మకముగా ధర్మకర్తపర మొనర్చిన నిధిగాని కాజాలదు. క్రీస్తున కనేక శతాబ్దములకు పూర్వమునుండియే భరతఖండమున నిట్టి యాశ్రమము లుండి యుండెను; విశేష సంఖ్యాకములుగా నిప్పటికిని గలవు. ఆ గురువునుబట్టియే అంతయు నాధారపడియుండును. ఆ గురుస్థాన మాక్రమించగల మఱొకగురువు వున్ననేతప్ప నది యా గురువు జీవితాంతముతోనే యంతమొందుచుండును.

పుదుచ్చేరిలోని యాశ్రమ మీ విధముగా నుత్పన్నమైనది. ప్రారంభమున పుదుచ్చేరిలో శ్రీ అరవిందులు కొద్దిమంది సహచరులతో తనయింట నివసించుచుండెను. తదుపరి మఱి కొందఱు వారిని ఆశ్రయించిరి. కొంతకాలమున కావల ౧౯౨౦-వ సంవత్సరమున శ్రీతల్లిగారు వారితో జేరినతరువాత శిష్యులసంఖ్య మిక్కిలి పెరిగినందున వచ్చినవారికి నివాససౌకర్యముల నేర్పాటు చేయుట అవసరమాయెను. తన్నిమిత్తము గృహములు క్రయము నకును బాడుగకును తీసుకొనబడెను. ఆ గృహములను సరిగా నుంచుటకు, మరమ్మతులు చేయుటకు, పునర్నిర్మాణ మొనర్చుటకు, సలక్షణముగా భోజనవసతులను, నివసించయోగ్యమైన వసతుల నేర్పాట్లు చేయవలసివచ్చెను. ఇవన్నియు సొంతముగా శ్రీతల్లిగా

కొనర్చిన పద్ధతులే. వీనిని సవరించుటకుగాని, మార్చుటకుగాని, పెంచుటకుగాని శ్రీ తల్లిగారే స్వతంత్రులు. ఇం దితర ప్రజా సంబంధ మేమియు లేదు.

ఆశ్రమగృహముల కన్నింటికిని శ్రీఅరవిందులు లేక శ్రీ తల్లిగారు హక్కుదారులు. వ్యయమొనర్చు ద్రవ్య మంతయు శ్రీఅరవిందులది లేక శ్రీ తల్లిగారిది. శ్రీఅరవిందుల కృషికి సాయపడునట్లు పెక్కుమంది ద్రవ్య మొసంగెదరు. ఇచ్చట నున్నవారిలోను కొందఱు తమ యాదాయము నర్పించుచుందురు. కాని యిది కేవలము శ్రీ అరవిందులకు లేక శ్రీతల్లిగారికి నియ్యబడుచున్నదే గాని ప్రజాసంస్థగా నాశ్రమమునకు గాదు. అట్టిసంస్థయే లేదు.

ఈ యాశ్రమ మొక సమాజము గాదు; నియమితసంఘ మేదియు లేదు; అధికారులు, ఉద్యోగులు లేరు, సంఘమునకు జెందిన సమష్టియాస్తి యేదియు లేదు. ఎటువంటి పరిపాలకవర్గము, సంఘమును లేదు. ప్రజాబాహుళ్యమునకు సంబంధించి చేయు కార్యకలాప మేమియు లేదు.

ఈ యాశ్రమ మొక రాజకీయ సంస్థ కాదు; ఆశ్రమవాసు లందఱును రాజకీయోద్యమముతో నెల్లసంబంధములను విసర్జించినవారే. మతవిషయక రాజకీయ సాంఘిక ప్రచారముల నన్నింటిని ఆశ్రమవాసులు సంపూర్ణముగా వదలుకొనవలసియున్నది.

ఈ యాశ్రమ మొక మతసంస్థకాదు. అన్ని మతములవారును నిచ్చట గలరు. ఏ మతమునకు జెందనివారును కొందఱు గలరు. ఇచ్చట నెట్టి మతసిద్ధాంతభావముగాని నిర్ణీతమత సంప్రదాయ విశ్వాసము గాని పరిపాలనాసంఘముగాని లేదు. ప్రకృతియొక్క



ప్రతి యుదయ మందలు శ్రీ తల్లిగారిని దర్శించు ప్రదేశము — ఆశ్రమ గృహమున నుత్తర భాగము.

శ్రీ అరవిందుల అనుగ్రహభాగ్యముననే ఆశ్రమ ప్రవేశ మును గాంచవలసియున్నది. శ్రీవారే లక్షణములను బట్టి నిర్ణయింతురో ఎట్టివారిని స్వీకరింతురో ఎట్టివారిని నిరాకరింతురో మన మూహింపజాలము. కేవలము బాహ్యస్థితులనుబట్టి గాక అంతస్స్థితముగానే యోగాభి లాషుల యోగ్యతాయోగ్యతలను శ్రీ అరవిందులు నిర్ణయింతురని భావింపవచ్చును.

ఆశ్రమప్రవేశమున కింతటి సూక్ష్మధర్మముల ననుసరించి పరీక్షలు జరుగుచున్నను, ఎందఱనో నిరాక రించుచున్నను, దారాపుత్రాది కుటుంబ సంబంధమేగాక దేశసంబంధము సర్వము త్యజించి కేవలము 'భగవా నుని కొఱకే, భగవత్ ప్రీత్యర్థమే' అను మహాత్తమ లక్ష్యముతో యోగసాధన చేయు వారీ యాశ్రమము నందు సుమారేడువందలమంది గలరు. ఇందు స్త్రీలు మాత్రము సుమారు రెండువందల మంది. ఇంచు మిం చన్ని రాష్ట్రములవారును గలరు. ఆశ్రమ వాసులలో వంగీయులే యెక్కువమంది యని చెప్పవచ్చును. బరో డాలో శ్రీఅరవిందులు పదుమూడు సంవత్సరములు నివసించియుండినందుననో తొల్లింటి ద్వారకానగర సామీప్య భాగ్యసంబంధముననో భక్తిప్రేరితులగు గుజ

రాతీయులసంఖ్య ద్వితీయ స్థాన మాక్రమించుచున్నది. ఆశ్రమము దక్షిణదేశమందు నెలకొనియున్నను సమీప మందున్న ద్రావిడాంధ్ర కర్ణాటకేరళుల సంఖ్యమాత్రము క్రమక్రమముగా స్వల్పమైయున్నది. ఇట్లు భారతీయులే గాక యూరోపు అమెరికా దేశీయులును – స్త్రీ పురుషు లు–కొందఱు గలరు. హిందువులు, బౌద్ధులు, జైనులు, పారశీకులు, మహమ్మదీయులు, క్రైస్తవులు నిట్లన్నిమత ముల వారును గలరు. కాని ఆశ్రమము ప్రవేశించిన తరువాత నే మత సంప్రదాయములను పాటించబడ వనియు శ్రీ అరవిందుల శిష్యవర్గముగా మాత్రమే వారు పరిగణింపబడుదురనియు తెలియుచున్నది.

ఈ యాశ్రమ మందలి సాధకులలో విద్యాధురీ ణులు, మేధావంతులు పలువురుగలరనియు, అసాధారణ ప్రతిభగల కవులు, గాయకులు, చిత్రలేఖకులు, కళా నిపుణులు కొందఱు గలరనియు, యోగోపాసనయందు, భగవదారాధనయందు మాత్రమే ఆత్మార్పణముగా వినియోగించు వారి శక్తిసామర్థ్యములు దివ్యపరిణామ మును గాంచుచున్నవనియు స్వానుభవముగలవారు పలువురు వెల్లడించియున్నారు. సాధకులందఱకును గురు వు ప్రభువు శ్రీ అరవిందులే గాని మధ్యపెత్తనము

పౌరోహిత్యము నెవరికిని లేదు. భక్తిజ్ఞానము లుపాంగ ములుగా నున్నను కర్మయే శ్రీఅరవిందుల యోగమందు ప్రాధాన్యము వహించియున్నందున సాధకులు సాధనగా తమ గురువర్యు లాదేశించిన కర్మల నాచరించుటయందే యెక్కువ కాలము గడపుచుందురు. శిష్యులలో సమాన ప్రతిపత్తియే యెల్లరకును గలదు గాని ఎక్కువ తక్కువ భేదమాత్రమును లేవు. బాహ్యనియమము లంతగా నీ యాశ్రమమందు గనుపించకున్నను బ్రహ్మచర్యమందు పట్టింపు తీవ్రముగా గలదు. దంపతులుకూడా గొందఱు కలరు. కాని యొకరొకని కళత్రసంతాన మని, బంధు మిత్రు లనిమాత్రము గాక ఆ యా వ్యక్తుల కీ సాధన యందు యోగమునందు గల అభీష్టము ననుసరించియో యోగ్యతనుబట్టియో ఈ యాశ్రమ ప్రవేశమున కవకాశము గలదు. స్త్రీలకు సాధారణముగా ప్రత్యేకగృహము లందు బస లొసంగబడుచున్నవి.

ఇక ఆశ్రమమం దొసంగు నాహార విషయమును గురించి : అన్నింటినిత్యజించి యోగముకొఱకే యాశ్ర మమున శరణుచొచ్చిన వారి విషయమున రుచుల కంత ప్రాముఖ్య ముండజాలదు. అయినను ఇట నొసంగు నాహారము బలకరము నారోగ్యప్రదము నై శుచిగా

నుండును. యోగసాధనకు కేవలము సాత్త్వికాహారమే యుండితీరవలయునను నియమము కంటె భిన్నభిన్న రుచుల కలవడిన పాశ్చాత్య దేశీయులకు భరతఖండము లోని నానారాష్ట్ర వాసులకు అందఱకు నింపితముగా ననుకూలముగా నుండవలయునను సమన్వయసిద్ధాంత మనుష్ఠింపబడుచున్నది. కాని మాంసాద్యాహారములు నిషిద్ధములు. మిరపకాయలు, ఉల్లిపాయలు, ఇంగువ, ఆవాలు మున్నగు ఘాటుపదార్థముల నుపయోగింపరు. చింతపండుకు బదులుగా నిమ్మకాయల నుపయోగింతురు. పండ్లు, పాలు, పెరుగు, రొట్టె, వరియన్నము, పప్పులు, కూరలు ఇవియే ముఖ్యములు. ఆహారవస్తువుల పరిశీలించి శుభ్రపఱచుట, గోధుమపిండి తయారుచేసి రొట్టెలుచేయుట, వంటచేయుట, వడ్డించుట తుదకు బియ్యమును తయారుచేయుట, భుజించిన పాత్రలను శుద్ధిచేయుట, ఆశ్రమవాసుల వస్త్రముల నుతుకుట సర్వము నాశ్రమ సాధికా సాధకులే చేయుచుందురు. కార్యకలాప మంత బాహుళ్యముగా నున్నను ఈ యాశ్రమమందుగల ప్రశాంత వాతావరణము నిరుపమానము. వంటశాలయందుగాని భోజనశాలయందుగాని మఱేకార్యరంగమందు గాని శాంతిసౌరభములే వెల్లి

విరియుచుండును. మామూలు హడావడి, అట్టహాసములు నుద్వేగవిశేషము లేవియు గనబడవు. కార్యనిమగ్ను లగు సాధకులు కర్తృత్వమును తాము వహించక ఏ మహాశక్తియో, దివ్యప్రజ్ఞయో తమచేత చేయించు చున్నదని తాము నిమిత్తమాత్రులమని భావించి శాంత్యానందముల ననుభవించుచుందురు.

ఆశ్రమ గృహముల ప్రత్యేకత వాని శుభ్రతయే. ఆ శుభ్రతను బట్టియే ఆశ్రమగృహము లివిగదా యని ప్రేక్షకులు గుర్తించగలరు. పూదోటలేని ఆశ్రమ గృహమే లేదని చెప్పవచ్చును. ప్రతిగృహమందు నానా విధములైన సజాతీయ విజాతీయములగు పూ మొక్కలు కనులపండువుగా కమ్మనివాసనల నీనుచు చూపరుల కానందము గొల్పుచుండును. ఆశ్రమ పూదోటలందు గల నానావిధ పుష్పజాతులు మఱెచ్చటను గానరావని యు నిట సుమారు మూడువందల భిన్న భిన్న జాతుల పుష్పములు గలవనియు ప్రతి పుష్పమునకు నొక్కొక్క చిహ్నము, గుణము గలదనియు—'తులసి' భక్తిచిహ్న ముగా, 'గులాభి' సమర్పణ చిహ్నముగా నెన్నబడినట్లు ను—పుష్పముల కెక్కువ ప్రాముఖ్యము గలదనియు తెలియుచున్నది.

## ఆశ్రమ విద్యాలయము

ఆరు ఏడేండ్లకు పూర్వము పంద్రెండేండ్లకు మించని చిన్నవారిని సాధారణముగా నాశ్రమములో జేర్చుకొను నవకాశమే లేకుండెను. ఆశ్రమము నాశ్రయించి సాధన చేయువారి సంఖ్య పెరుగుకొలదియు కొందఱు కుటుంబముతో వచ్చి చేరుట సంభవించినది. తమబిడ్డల కితరాశ్రయము, మఱొక మార్గములేని తల్లి దండ్రులు తమబిడ్డలను వెంటదీసికొనివచ్చుట అనివార్య మాయెను. కాని చిన్నపిల్లలకు మున్ముందు శరీరాభివృద్ధి తదనుగుణముగా మానసికాభివృద్ధి ప్రాధాన్యముగాని యోగము కానేరదు. అందువలన నట్టివారినిమిత్తమై విద్యాలయమును నాల్గైదేండ్ల క్రిందటనే స్థాపించిరి. నూరుమందికి పైగా, విద్యాలయమున, బాలికాబాలకులు గలరు. ఫ్రెంచి, ఇంగ్లీషు, సంస్కృతము, దేశభాషలలో హిందీ, బెంగాలీ, గుజరాతీ, అరవము మున్నగు భాషలు, గణితము, చరిత్ర, భూగోళశాస్త్రము, పదార్థ విజ్ఞాన-రసాయన-ఆరోగ్యాదిశాస్త్రములు, లలితకళలు మున్నగునవి బోధింపబడుచున్నవి. నానావిధములైన బంతి యాటలు, కసరత్తులు, సాములు మున్నగునవి నిపుణుల యాజమాన్యమున నేర్పబడుచున్నవి. విద్యార్థుల

నిమిత్తమే పెద్దమొత్తమును వెచ్చించి ఈదుట కొఱకొలను నవీన పద్ధతులమీాద సముద్రతీరమున నిర్మితమగుచున్నది. వివిధములైన చేతిపనులుగూడ నేర్పబడుచున్నవి. కాని యిది ఇంకను ప్రథమదశలోనే యున్నదని సంపూర్ణరూపమును గైకొనలేదని చెప్పవలయును. ఈ విద్యాలయమున కేవిధమగు ప్రభుత్వ సంబంధమును లేదు. ఆశ్రమమే ప్రజాసంస్థ గానపుడు తత్సంబంధమైన ఈ విద్యాలయమును గాదుగదా! *

## శ్రీ అరవిందాశ్రమ ముద్రణాలయము

శ్రీఅరవింద వాఙ్మయ మింకను ముద్రితము గావలసియున్న దెంతోగలదు. నానాభాషలలో శ్రీవారి గ్రంథము లనువదింపబడుచున్నవి. ఆశ్రమ సాధకులు గూడ నాయాభాషలలో గ్రంథముల రచించుచున్నారు. ఆంగ్లమున, బెంగాలీ, హిందీ, గుజరాతీ, అరవభాషలలో వార్షిక సంచికలుగా త్రైమాసిక సంచికలుగా పత్రికలు వెలువడుచున్నవి. ఇట్లు శ్రీ అ ర విం ద వాఙ్మయ

---

* దీనినే యిప్పుడు శ్రీ అరవిందుల అంతర్జాతీయ విశ్వవిద్యాలయకేంద్రముగ మార్చి వృద్ధిజేయు ప్రయత్నము జరుగుచున్నది.

మభివృద్ధియగు కొలది మేలురకము ముద్రణాలయ మవసరమాయెను. మఱియు విదేశములకేగి ముద్రణ సంబంధమైన కళావిశేషముల చక్కగా గ్రహించివచ్చి, ఒకగొప్ప ముద్రణాలయాధికారిగా ఇరువదైదేండ్లుగా ననుభవపరులైన విద్యార్థకు లొకరు ఆశ్రమ సేవచేయ సంసిద్ధులై వచ్చియుండిరి. అందువలన శ్రీ అరవింద ముద్రణాలయ మనుపేర కొన్నిలక్షలు వెచ్చించి ముద్రణాలయ మిటీవలనే స్థాపితమైయున్నది. అందు ఫ్రెంచి, ఇంగ్లీషు, బెంగాలి, గుజరాతీ, హిందీ, సంస్కృతము, అరవము, ఆంధ్రము ఈ భాషలలో గ్రంథములు ముద్రితములగుచున్నవి. మఱియొక విశేషమేమన, అధికతమ సంఖ్యగా అక్షరములుగల తెలుగుభాషయందు తప్ప తక్కినభాష లన్నింటియందును 'మోనోటైపు' అను నూతన యంత్రమువలన నెప్పటికప్పుడక్షరములు తయారగుట, కూర్పు (కంపోజింగు) జరుగుట. వేతనముల మీద పనిచేయువారితోపాటు సాధికా సాధకులు నన్నిశాఖలలో పనిచేయుచుందురు. శీఘ్రకాలమున ఈ ముద్రణాలయ మింకను క్రొంగ్రొత్త యంత్రములతో ఇండియాలోగల యుత్తమోత్తమ ముద్రణాలయములలో నొకటిగా రూపొందగలదని ఆశించగలము.



ఆశ్రమ విద్యాలయమందలి బాలికా బాలకుల వ్యాయామ దృశ్యము



ఇండియాలో లేని క్రొత్తరకము కట్టడము — 'గోల్కొండ'

## గోల్కొండ

అనుదినము సాధకులసంఖ్య పెరుగుకొలదియు విదేశములకు వెళ్ళి అచ్చట నివసించుచుండిన 'పుదుచ్చేరి' వాసులు మరలివచ్చి స్వపట్టణముననే స్థిరనివాసులగుచున్నందునను, అన్నిపట్టణములందువలె, పుదుచ్చేరియందిచ్చటను ఇండ్లకఱవు తీవ్రతర మగుచున్నది. ఆశ్రమ సమీపమున ఖాళీస్థలములు గూడ కానరావు. ఎట్లో కొద్దిపాటిస్థలము లభింపగా నచ్చట నేబదిగదులతో- క్రింద పునాదిపైనున్న శ్రేణిలోని గదులుగాక-ఆగంతకులైన భక్తులు ఆశ్రమవాసులు నివసించుట కాధునిక సౌకర్యవిలాసములతో క్రొంగ్రొత్త ఫక్కిలో నొక మూడంతస్తుల గృహము నిర్మింపబడినది. ఆశ్రమమున ఇండ్ల ఇబ్బందిని గమనించిన యొకానొక ప్రముఖుని ప్రేరణోత్సాహమువలన లక్షరూపాయల నొక సంస్థానము గృహనిర్మాణమునకని విరాళమిచ్చియుండెను. కాని ఈ కట్టడమునకు దాదాపు మూడులక్షలు వ్యయమైనట్లు తెలియుచున్నది. దీనినే 'గోల్కొండ' యని పేర్కొందురు. ఇటుకరాయిగాని, కొయ్యగాని అంతగా ఈగృహమున కుపయోగించలేదు. అంతయు సిమెంటు కాంక్రీట్ మయము. కిటికీలుగాని పెద్దతలుపులుగాని లేవు; అట్లని

గాలి వెలుతురు కొఱవడక వలయునంత పుష్కలముగా వచ్చునట్లు, అనగా ఎక్కువగాగాని తక్కువగాగాని గాక మన కిష్టమైనంత వచ్చునట్లు చేయగల ఏర్పాట్లు గలవు. స్నానమునకు వేడినీళ్ళు చన్నీళ్ళు వచ్చు కొళాయీలు గలవు. బట్టలు స్వయముగా నుతికి ఆరవేసి కొనుటకు, నౌకరులద్వారా ఉతికించి ఆరవేయించుకొనుటకు చక్కని యేర్పాట్లు వేఱువేఱుగా గలవు. శౌచ క్రియలకు జపానుపద్ధతి ననుసరించి క్రొంగ్రొత్త పద్ధతు లమర్చబడి యున్నవి. ఈ కట్టడమునకు వలయు బల్లలు, కుర్చీలు, మంచములు, బీరువాలు, దోమ తెరలు మున్నగునవన్నియు నాశ్రమమందే ఎంతో నాణ్యముగా నవీనరీతి తయారుచేయబడినవి. ఈ గృహ నిర్మాణ విధానము విదేశమునుండి యిందు నిమిత్తమే ఆశ్రమమునకు వచ్చిన అటోనియర్ రెమూండ్ అను సుప్రసిద్ధులగు వాస్తువిజ్ఞాన నిపుణులు, గృహనిర్మాతలు తయారు చేసినది.

## గోశాల

ఆశ్రమమున కిపుడిపుడే గోశాల యేర్పడినది. ఒంగోలు, సింధు జాతి ఆవులు మొత్తముమీద పశు సంతతి అఱువది డెబ్బది వఱకు గలదు. ఇంకను నూర్ల

కొలది ఆవుల సంఖ్య పెరిగినగాని ఆశ్రమమున కవసర మైనపాలు, పెరుగు లభ్యముగావు. అంతవఱకు పాలమ్ము కొనువారి మీాదనే ఆధారపడవలసి యున్నది. ధారాళముగా పశువులు మేయుటకుబీళ్లు ఇతరవసతులు త్వరలో లభించి గోశాల అభివృద్ధిగాగలదని తలంతుము.

## వ్యవసాయము

ఆశ్రమమునకు కొన్ని మెట్ట మాగాణిభూములు తోటలు గలవు. కొద్దిగా ధాన్యమును, పలు రకముల కూరగాయలు పండించెదరు. కూలీలతోపాటు అవసర మేర్పడినపుడా యా సమయములలో సాధికా సాధకు లన్నిపనులను జేయుచు తోడ్పడుచుందురు.

## దర్శనము

ఇక శ్రీఅరవిందులను దర్శించు విషయమున నొక్కమాట. శ్రీఅరవిందులు ౧౯౨౬-వ నవంబరు ౨౪-వ తేదీన ఏకాంతవాసము ప్రారంభించినప్పటి నుండియు నెవరికిని గనపడుట లేదు. వారి నాశ్రయించి ఎన్నేండ్లో ఆశ్రమమందున్న శిష్యులకేని సంవత్సరమునకు మూడు పర్యాయములు మాత్రమే శ్రీఅరవిందు దర్శించు భాగ్యముండెడిది. అప్పుడైనను నిమిషకాలము

శిష్యులొక్కొక్కరు భక్తితో శ్రీఅరవిందులను సమీపించి వారి పాదారవిందములకు నమస్కరించుటయు శ్రీ అరవిందులు తమ దివ్యహస్తముతో స్పృశించి శిష్యుల నాశీర్వదించుటయు మాత్రమే. సంభాషించుట గాని సన్నిధానమున నొక్కింతసే పుండుట గాని సంభవింపదు. కాని ౧౯౨౮-వ సంవత్సరము మే నెలలో శ్రీఅరవిందు లేకాంతవాసము స్వీకరించియుండిన స్వల్ప కాలముననే రవీంద్రకవి శ్రీవారిని సందర్శించ నభిలషించి యనుమతికి వ్రాసికొనినట్లును, అపు డెవరిని చూడరాదని యెవరితోడను మాటాడరాదని తా మేర్పఱచుకొనిన నియమమునకు శ్రీ అరవిందులు అరుదుగా మినహాయింపు గావించుచుండినందున, కీ॥ శే॥ రవీంద్రునికవకాశ మిచ్చినట్లును తెలియుచున్నది.

ఆవల ఈ దర్శనవిషయమై రవీంద్రు డొక రసవత్తరమైన వ్యాసము రచించి శ్రీఅరవిందుని స్తుతించియుండెను. అందు చిరకాలముగా శ్రీఅరవిందుని జూడవలయునను అభిలాష తీవ్రముగా తమ కుండెననియు, నాడది సిద్ధించెననియు, శ్రీఅరవిందుని దర్శించినంతనే అంతర్జ్యోతి వారిముఖకమలమున బ్రకాశించుచుండినట్లును వారాత్మోపలబ్ధికై చేసిన ప్రయత్నము పరిపూర్ణముగా

ఫలప్రదమైనట్లును, వారి యోగలక్ష్య మీ లోకమందీ శరీరముననే, అహంకార వర్జితము పరమవిజ్ఞాన విలసితము నగు పరిపూర్ణ విలాసమును సమగ్రముగా నిత్య జీవితమందు ప్రతిష్ఠించుటయే గాని ఏదో పరమునకు పలాయనమగు సన్న్యాసము గానట్లును, ఆత్మను క్షోభపెట్టు త్యాగము బాధానుభవము లివియే పరమార్థములుగా భావించు ఐరోపియన్ మతాచార్యుల యొద్దనుండి - రషియా క్రైస్తవ సన్న్యాసులనుండి - శ్రీఅరవిందు లేనాడును పాఠముల నేర్చుకొననట్లును వారి సాన్నిధ్య మందు తమకు ప్రత్యక్షమైనందు విశ్వాస మేర్పడిన దనియు రచియించియుండిరి. మఱియు సత్యాంతగాధమగు పరమప్రశాంతినుండియే శబ్దము, వాక్కు వెలువడుచున్నదనియు, ఆ వాక్కునుండియే నూతన ప్రపంచ సృష్టి యుత్పన్న మగుచున్నదనియు, అట్టి దివ్యవాక్కు శ్రీఅరవిందుని యందున్నదనియు రవీంద్రుడిట్లు వెల్లడించెను. "ఆ వాక్కు మీ యందున్నది. దానిని గ్రహించి శిరసావహించుటకు మేము ప్రతీక్షించుచున్నాము. 'నన్నాలకింపు' డని భరతఖండము మీ కంఠద్వారమున ప్రపంచమున కుపదేశించుచున్నది." లోగడ పేర్కొనినట్లు 'ఓ అరవిందా! రవీంద్రుని వందనముల

నందికొమ్ము' అని రవీంద్రుడు తనలోతాను భక్తిమెయి పునశ్చరణ మొనర్చి కీర్తించితిమనికూడ వ్రాసియుండిరి.

శ్రీవారిని దర్శించగల యవకాశము మొదట మూడు పర్యాయములే. అవి ఫిబ్రవరి ౨౧-వ తేది, ఆగష్టు ౧౫-వ తేది, నవంబరు ౨౪-వ తేది అయియుండెను. ౧౯౩౯-వ సంవత్సరమునుండి ౨౪-వ తేది ఏప్రిలునందు మఱొకదర్శనము లభించుచున్నది. అందువలన సంవత్సరమున కిపుడు నాల్గుదర్శనములు. ఆ సమయములం దాశ్రమమందున్న శ్రీవారిశిష్యులకే గాక దూరప్రదేశములందున్న శిష్యకోటిలో పలువురు దర్శనభాగ్యము నందుచుందురు. ఈ దర్శనములు యోగసాధనచేయు శ్రీఅరవిందశిష్యుల నిమిత్తమే యుద్దేశింప బడినను, ఆశ్రమముతో నేదోయొక సంబంధముగలవారు ఆశ్రమాభిమానముగలవారు పలువురు ముందుగా ననుమతిబడసి ఆసమయమున వచ్చుచుందురు.

## యుద్ధము - శ్రీఅరవింద సాహాయ్యము

గత ద్వితీయ ప్రపంచయుద్ధమున శ్రీఅరవిందులు శ్రీతల్లిగారు, ఉభయులును, మిత్రమండలి - అనగా ఫ్రెంచి, అమెరికా, బ్రిటనుల-విజయమునే కాంక్షించి

తమ సహానుభూతిచిహ్నముగా కొంత ద్రవ్యమును రాజ ప్రతినిధి నెలకొల్పిన యుద్ధనిధి కొసంగుచు తత్సంబంధ మున మద్రాసు గవర్నున కొకలేఖ వ్రాసియుండిరి. శ్రీఅరవిందులు శ్రీతల్లిగారు ఆ యుద్ధవిషయమై వ్రాసిన కొన్నిలేఖలు ప్రకటితమైయున్నవి. వానిని బఠించిన వివరములు తెలియగలవు. యుద్ధమన నేమి? అందులకు కారణము లెవ్వి? ఈ యథార్థమును జాగ్రదా వస్థలో కేవలము బాహ్యాభుక్కులగు మానవమాత్రు లము గ్రహింపజాలము. వీనిని శ్రీఅరవిందుల దృష్టి నుండి యతి సూక్ష్మముగా వెల్లడింప బ్రయత్నింతుము.

అనంతుడగు భగవానుని ఆవిష్కార పరంపరలు గూడ ననంతములు. అందలి ప్రధానావిష్కారముల నే తొల్లింటి వేదఋషులు స్వానుభవముతో సప్త లోకము లు, భూమికలు, కక్ష్యలుగా బేర్కొని యున్నారు, పరాశక్తి మూలమున పురుషోత్తముని సూవిష్కారము పరమునుండి, పైనుండి క్రిందికి, అవరమున కవరోహించు నపు డెల్లను క్రిందనుండి, అవర ప్రకృతినుండి, నిరోధ ములు నానారూపములుగా వెలువడుచుండును. ఆ పర మావిష్కారము భూలోకమున నిట నెంత తీవ్రముగా నవరోహించ బ్రయత్నించునో అంత తీవ్రముగానే

అవరశక్తులును బ్రతిఘటించ యత్నించును. ఈ ప్రతి ఘటనములే ఇట్టి మహాయుద్ధములు. అనగా నంధకార ము-అజ్ఞానము, వెలుగు-జ్యోతి వీనిమధ్య, సత్యాసత్య ములమధ్య, దైవము, దైవేతరములమధ్య, సురాసురుల మధ్య జరుగు నీయుద్ధము. ఈశ్వర రాజ్యమును దేవ రాజ్యమును స్థాపించు సంకల్పముననే, పరిణామప్రక్రియ ననుసరించి, అవతారములును. ఈశ్వరశక్తియావిష్క రింప జేయనున్న మహర్లోకము, విజ్ఞానభూమిక (సూప్రా మెంటల్ ప్లేన్) అవరోహణమై భూ-భువర్-స్వర్లోక ముల యందిచ్చట పృథ్వియందు గట్టిగా పాదుకొననేని రాక్షసుల అసురుల ప్రాబల్య మంతరించును. తమ యునికికే సోత్కర్షతో వీరు దైవమును దైవశక్తులను నిరోధించు ప్రయత్నమే గతయుద్ధమును.

అందువలననే శ్రీఅరవిందు లాయుద్ధము శ్రీ తల్లిగారిది, జగన్మాతది యని, అసురోపకరణ మగు నొక అవరశక్తియే హిట్లరు రూపము దాల్చినదని, హిట్లరుకు అతని పక్షమునకు పరోక్షముగానేని విజయమును దల పోయువారు తమకు తెలియకయే మహాపచారము ద్రోహమును జేయుచున్నారని తెలిపియుండిరి. బాహ్య దృష్టితో ఆ యుద్ధము కొన్నిజాతు లితరజాతులపై లేవ

దీసినదిగా భావింపరాదనియు, భూలోకమున నెలకొన వలసిన యొక పరమాదర్శము, పరమలక్ష్యము, సంపూర్ణముగా ననుభూతి గాంచవలసిన సత్యము, స్వాతంత్ర్యాధ్యాత్మికోన్నతులు, వీని ననుగులు తీవ్రముగా నెదుర్కొని మానవ స్వాతంత్ర్యమును ఆత్మాభివృద్ధిని భంగపటిచి తమ ప్రాబల్యమునే స్థిరముగా నెలకొల్ప జేయు ప్రయత్నమే ఆ యుద్ధమనియు సెలవిచ్చియున్నారు.

అట్లని మిత్రమండలివా రందఱు పవిత్రరూపము దాల్చిన పుణ్యపురుషులని యెవరును జాటుటలేదు. మానవుల నందఱను తరతమ భేదములతో స్వార్థము ద్వేషాసూయాదు లావేశించి యున్నవనుట మఱువరాదు. కొంద అదృష్టమున కాబోలు తమకు తెలియకయే దైవోపకరణములుగా దైవపక్షమున కీడ్వబడుచుందురు. పరదేశాక్రమణకు పరపీడన మొనర్చుటకు నలవడి, వానిని త్యజించజాలక వికారములకు లోనగుచున్నను, ఏవో కొన్ని యున్నతాదర్శముల కేసి యాకర్షింపబడుచు, నానాజాతుల సమ్మేళన మని, లోకుల కందఱకు సమానమైన సర్వస్వాతంత్ర్యమని, మానవైక్యమని, శాంతి సౌఖ్యము లని ప్రసంగించువారు మిత్ర

మండలివారు. భీషణ సంగ్రామమందు చావుబ్రతుకులలో నున్నపుడుగూడ, తమ దేశమం దేని వాక్స్వాతంత్ర్యమును యథేచ్ఛగా నొసంగినవారు బ్రిటీషువారు. ఇక హిట్లరన్ననో సకలజాతులలో తన జర్మనుజాతియే సర్వవిధముల శ్రేష్ఠమని, తన జాతియే సర్వప్రపంచమును బాలించవలయునని, తదితరజాతులు తన్నాశ్రయించి బ్రతుకవలయునని ప్రబోధించి, జర్మనుల వీరావేశమున ముంచెత్తియుండెను. మఱియు రంగుజాతులు, నల్లవారు, భారతీయులు వీరందరు అజ్ఞానులని, స్వపరిపాలన కయోగ్యులని, యూడిగముచేయుచు బ్రతుకవలసినవారే యని తుదకు వారిని చదివించరాదని తన 'మీన్ కాఫ్' బైబిల్‌నం దుద్ఘాటించుట కాతడు వెనుదీయలేదు. యూదులను కుతంత్రములను పన్ని ఆధునిక మారణ యంత్రములతో చిత్రవధగావించి యూదుజాతినే నిర్మూలింప నాజ్ఞాపించినాడు. తన సిద్ధాంతముల, విధానముల, ఆవేశములకెల్ల తాళము వేయుట కెవరు తన దేశమందు—ఉన్నతోద్యోగులు గాని, రణవీరులు గాని, తన ప్రాబల్యమునకు దోడ్పడిన మిత్రులు గాని—మానసికముగా నేని సంశయింతురని తన కేమాత్రమనుమాన ముదయించినను వెంటనే వారినెల్ల హత

మొనరించిన ఆతతాయి. పాఠక లోకమున కీ ఘోర
ములు తెలియనవి కావు. ఇతర దేశముల మాట
ఎట్లున్నను, భారతదేశము తన స్వాతంత్ర్యమును బడ
యుటకు తన నిరుపమానమగు సంస్కృతి సభ్యతలను
ఆత్మజ్ఞానమును బోషించి పెంపొందించుటకు నవకాశమే
శూన్యమైయుండును హిట్లరే వినాశముగాకుండ నుండిన
యెడల. ఆర్యావర్తము తన యపూర్వ విజ్ఞానముతో
తన్నుద్ధరించుకొనుటయే గాక తన ఆధ్యాత్మికశక్తి సభ్య
తాదులను సకల ప్రపంచమున వ్యాపింపజేసి దివ్యజీవన
మును స్థాపించి శాంతిసౌఖ్యములతో లోక కల్యాణ
మొనర్చవలసియున్నది.

రాజ్యాంగ పరివర్తనకై ౧౯౪౨-వ సంవత్స
రారంభమున క్రిప్సురాయభార మిండియాకు వచ్చుటయు
బేరములుసాగి విఫలమగుటయు లోక మెఱింగినదే.
నా డట్లు విఫలమగుటవలన దేశ మనుభవించిన నానా
యాతనల గుఱించి, ఎందుల కే విధముగా విఫలమైనదో
ఆ విషయముల గుఱించి భావిచరిత్రకారుడు వివరముగా
చర్చించి వ్రాయ గలడని విశ్వసించుచున్నాము. కాని
శ్రీఅరవిందులు ౧౯౧౦-వ సంవత్సర ప్రారంభమున
మన దేశ భవిష్యత్తునే కాక ప్రపంచ భవిష్యత్తును

గుఱించియు సూచించియుండినట్లు ఆశ్రమ కార్యదర్శి వ్రాసిన లేఖ నిట నుల్లేఖించు చున్నాము.

౧౯౪౭-లో మన దేశమునకు వచ్చిన బ్రిటీషు క్యాబినెట్ మిషన్ విషయమై శ్రీఅరవిందుల అభిప్రాయమును బ్రసాదించగోరుచు కలకత్తాలోని 'అమృత బజారు పత్రి' కాధిపతులు ప్రార్థేయపడగా శ్రీఅరవిందాశ్రమ కార్యదర్శిగా రీలేఖ ప్రత్యుత్తరగా నిచ్చియుండిరి.

ఏదో అధికారరీత్యా వారిని సమీపించి కోరినపుడు తప్ప తనంతటతానే తన అభిప్రాయముల దెలుపుట అనవసరమని శ్రీ అరవిందులు తలంచుచున్నారు. వారి భావమేమో తెలిసినదే. దేనిని ఆత్మగౌరవముగల జాతికి యోగ్యమైన ఏకాదర్శముగా, ఏ రాజీకిని లొంగక, బహిరంగముగా ప్రప్రథమమున వారు చాటినారో అట్టి ఇండియా సంపూర్ణ స్వాతంత్ర్యమునే వా రెప్పుడును గోరుచున్నారు.

౧౯౧౦-వ సంవత్సరమున భవిష్యత్తును గుఱించి తత్ఫలమును గుఱించి చెప్పినవిషయ మధికారపూర్వకముగా * ప్రకటిత మైయున్నది. అందు నాలుగేండ్ల కావల దీర్ఘకాలపు యుద్ధ

* "ధర్మ" అను అఱవపత్రికయందు ప్రకటితము. దీనిని స్వర్గీయులు, చిరస్మరణీయులు, మహాకవి యగు సుబ్రహ్మణ్య భారతి గారి సాయముతో శ్రీనివాసాచారి గారు స్థాపించియుండిరి. ఆ పత్రికాధిపతులు సజీవులై మద్రాసులో నున్నారు.

ములు, ప్రపంచవ్యాప్తములైన సంక్షోభములు, విప్లవములు ప్రారంభమై తరువాత ఇండియా స్వాతంత్ర్యమును బొందగలదనియు, ఆ స్వాతంత్ర్యము శీఘ్రముగా వచ్చుచున్నదనియు, ఏదియు దానిని నిరోధించజాలదనియు శ్రీ అరవిందులు తెలిపియున్నారు. మనదేశ స్వాతంత్ర్యమును అంగీకరించుచు అన్యోన్యముగా ఏర్పాటు చేసికొనుటకు బ్రిటీషువారు ఇండియాకు వచ్చెదరనియు నెప్పటినుండియో గుర్తించియున్నారు. వారట్లు ముందుగా చూచినదే ఇపుడు ప్రత్యక్షమగుచున్నది. బ్రిటీషు వారి క్యాబినెట్ మిషన్ దాని చిహ్నమే. ఇక నీ యవకాశమును సరిగా సంపూర్ణముగా నుపయోగించుట జాతీయనాయకుల పనియై యున్నది. ఏమైనను సరియే, ఉత్తరక్షణమున ఫలితమెట్లుగా పరిణమించినను, ఈ సంఘటనమునకై కృషిచేయుచున్న మహాశక్తియొక్క తుదిఫలము నిరోధింపబడజాలదు. ఇండియాయొక్క స్వాతంత్ర్యము, విముక్తి నిశ్చయము.

యోగలబ్ధమైన పరమసత్యమెఱుంగని, దివ్యదృష్టిలేని, మానవాగ్రేసరులు నాయకోత్తములుగూడ పరీక్షాసమయము వచ్చినపుడు కర్తవ్యమెఱుంగలేక దిగ్భ్రమజెంది నిర్వీర్యులగుదురు. ౧౯౪౭-జూన్ ప్రారంభమున సంభవించినదిదే. 'భారతఖండము ఏకము నవిభాజ్యము. ప్రాణములనైన నెదురొడ్డి దేశవిభజనకంగీకరించరా'దని తుదిక్షణమువఱకు గర్జించి, ఎలుగెత్తి చాటిన నాయకాగ్రేసులు, వివశులై కాబోలు, అత్య

ప్తులు, అసంతుష్టులునై గూడ దేశవిభజనమును శిరసా వహించిరి.

౧౯౪౭-జూ౯-౩-వ తేదీన కట్టకడపటి బ్రిటీషు ప్రతిపాదనను గుఱించి చేసిన బ్రాడ్‌కాస్టును వినుచుండగా శ్రీతల్లిగారికి అంతర్వాణి మూలమున లభించిన సందేశ మపుడే పత్రికాముఖమున బ్రకటితమైనది. దాని సంగ్రహసారము నిట నుదాహరించెదము:

"ఇండియా స్వాతంత్ర్య ప్రదాననిర్మాణములందుగల క్లిష్టసమస్యలను, గట్టిచిక్కులను, బరిష్కరించు నిమిత్త మొక ప్రతిపాదన మొనర్పబడినది. ఎవరికిని తృప్తి నియ్యనప్పటికిని, విచారము అయోగ్యము అయినదను విషయము నెఱింగియు ఇండియా నాయకులు దాని నంగీకరించినారు.

"కాని అసలీ ప్రతిపాదన మెందు కొనర్చ బడినదో మీకు తెలియునా? మన చిలిపిజగడము లెంత నిరర్థకములో హాస్యాస్పదములో మనకు ఋజువుచేయుటకే. ఈ ప్రతిపాదనమును మన మెందులకు శిరసావహించవలయునో మీకు తెలియునా? మన పిచ్చితగాదాలెంత నిరుపయోగములో నవ్వులపాలో మనంతట మనకు ప్రత్యక్షముగా ఋజువగుటకే.

"ఇది పరిష్కారముగాదు. మహాపరీక్ష, అగ్ని పరీక్షయే యనుట స్పష్టము. దీనిని యధాతథముగా ననుష్ఠించినయెడల దేశైక్యమును, ఔన్నత్యమును సాధించుట కాదేశమును ముక్కలు ముక్కలుగాచీల్చి ఖండించుటవలనగాదని మనకు ఋజువగును. అన్యోన్య విరోధములవలనగాని, నొండొరుల ప్రయోజనములను అవసరములను నిరోధించుకొనుట వలనగాని దేశసౌభాగ్యమును గడించలేము. ఒకపక్షము గావించు పిచ్చి సిద్ధాంతములకు మొండిపట్టులకు అన్యపక్ష మట్లే యడ్డు తగులుటవలనగాదు మనము నిజాత్మను సేవించగలుగుట. ఏమైనగానిండు, ఇండియా కొకేయాత్మ గలదు. ఏకమున విభాజ్యమునగు ఇండియాను గురించి ముచ్చటించగల యంతవఱకు నిరీక్షించు చుండవలసిన కాలములో 'ఇండియా ఆత్మచిరంజీవి యగుగాక' అని మన యుద్ఘోష"

శ్రీతల్లిగారి యీ సందేశమును దేశ మెట్లు గ్రహించునో తెలియదు. కాని శ్రీఅరవిందులు ౧౯౦౫ లోనే స్పష్టపఱచినట్లు ఇండియా దేశమొక జడపదార్థము గాదు. దానిని కొన్ని బయళ్ళు, క్షేత్రములు, వనములు, పర్వతములు నదులుగా నెఱుంగరాదు; తల్లియనే యెఱుంగవలె. మానవునివలె జాతికి దేశమునకును ఆత్మ

గలదు. సజీవమైన వ్యక్తిత్వముగలదు. జాతి కేవలము వ్యక్తులయొక్క కూటమి సమూహము గాదు. జాతి యందు మానవునకువలె చైత్యాత్మ (చైత్యపురుషుడు) గలదు. అందు ప్రజ్ఞాశక్తి యున్నది. తదనుగుణముగా ఆ దేశముయొక్క సంకల్పము, వికాసము, ఆంతరిక జీవనముతో పాటు, బాహ్యజీవనమునకు వలయు రాజకీయ, ఆర్థిక, సాహితీ సభ్యతాది ఉపపత్తులను నిర్ణయించుకొని రక్షించుకొనగలదు.

జాతియొక్క జీవితచరిత్రమందును ఎన్నో విషమ పరిస్థితులు, ఘటనలు, దినగండములు సంభవించుచు దాని యునికికే భంగము రావచ్చును. బ్రిటన్, ఫ్రెంచి దేశములు లేక జాతులును ఈ యాతనల ననుభవించి తమయం దంతర్గతమైన ఆత్మశక్తివలన పునరుత్థితమైన విషయము చరిత్ర చాటుచున్నది. కొన్ని జాతులు తొల్లింటి గ్రీక్, రోము, ఈజిప్ట్, చాల్డియా, బెబులిన్ జాతులు అసలే అంతరించినవి. ఇండియా దేశ మట్లు గాదు; తనలోని యవయవము లన్యోన్యముగా శత్రుత్వమువహించి వినాశనమునకు దారితీసినను, ఈ మహా వ్యాధివలన ప్రాణోపద్రవమేర్పడినను పునరుద్ధరణము నొందగల జవసత్త్వములు ఆత్మశక్తి ఈ జాతియందు

గలవు. మానవజాతి నుద్ధరించవలసిన కర్తవ్యకర్మము 'మిషన్' ఇండియాకు గలదు. అది నెఱవేరినగాని దాని మనుగడ సార్థకము గాజాలదు. శ్రీతల్లిగారు ప్రకటించినట్లు మనల నావేశించిన దివ్యేతరశక్తు లంత రించి మన మొఱ లీడేరి అఖండమైన భరతమాత మన కచిరకాలముననే ప్రసన్నమగుగాత మని ఆ పరాశక్తిని ప్రార్థింతము.

## శ్రీఅరవిందోపదేశము - సాధన విధానము

శ్రీ అరవిందులు స్వప్రయత్నమున యోగ మారంభించి సుమారు నలువది సంవత్సరములు మాత్రమే దాటినట్లొక కాలనిర్ణయము ప్రత్యక్షముగా గనబడు చున్నను ఆజన్మముగా వారియందు యోగబీజము లంకు రించి యభివృద్ధిగా నారంభించినట్లును పదునాల్గు పదు నెనిమిది సంవత్సరముల చిఱుప్రాయముననే, అనగా నేటికి సుమా రఱువది సంవత్సరముల క్రిందటనే, వారి కంతస్స్థితముగా నొక యాదేశము, ఒక కర్తవ్యము సువ్యక్తమైనట్లును శ్రీవారి లేఖలు సూచించుచున్నవి.

మన కంటికగపడు జగద్రూపముల కావల ఆత్మ చైతన్యముల సత్యము ఏకము నిత్యము నగు సర్వ

భూతాత్మ కలదను ఆర్యావర్తపు ఋషుల సిద్ధాంతము నుండియే శ్రీఅరవిందుల యుపదేశము ప్రారంభ మగుచున్నను లక్ష్యలక్షణము లందు వైలక్షణ్య విశేషములు లేకపోలేదు.

శ్రీ అరవిందుల తత్త్వసిద్ధాంతములును వారుద్బోధించిన సాధనవిధానమును కొంతకుకొంత సాధకులకు పరిచయమయ్యేయుండునని నమ్ముచున్నాము. ఈ జీవితగ్రంథమం దివి సందర్భానుసారముగ నక్కడక్కడ సూచింపబడియుండుటచే నొక్కచోట సూక్ష్మముగ వివరించిన యెడ పాఠకులకు సుబోధకముగ నుండుననియు దివ్యజీవనను కాంక్షించువారలకు సహకారి కాగలదనియు యెంచి శ్రీవారి ఉపదేశములు సాధన విధానమను శీర్షికతో గ్రంథమును ముగించి శ్రీఅరవిందుల పాదారవిందములకు ప్రణమిల్లి విరమించుచున్నాము.

మహ ద్విశ్వమందు—సూర్యమండలముకన్న యనేకరెట్లు పెద్దవైన వేలాది నక్షత్రమండలములతో నొకటికొకటికి శతసహస్రకోటి యోజనములకు పైబడిన అంతరాళముతో విస్తరించి విరాజిల్లెడీ మహద్విశ్వమందు——మన యీ పృథ్వి యొక అణువనియే చెప్పనగును. అందుండు మానవుడు అణువులో నతి స్వల్పాం

శమే యగుచున్నాడు. ఇట్లయ్యును తాను మనోశక్తి సంపన్నుడగుకొలది నీ మహాద్విశ్వార్థమును దాని నిజ స్వరూపమును యుత్పత్తిక్రమవిధానమును తెలిసికొన ప్రయత్నించుచున్నాడు.

సాధారణముగ నెల్లపదార్థములయొక్క జీవరాసులయొక్క సృష్టి సర్వస్వము యొక్క పరిశీలనము బాహ్యాభ్యంతరములను ద్వివిధ దృక్పథము నవలంబించనగును. బాహ్యపరిశీలనము మహాద్విశ్వమందలి యత్యంచదాంశమైన పృథివి కేవల జడపదార్థజాల సందోహమనియు అందు కొన్ని నిజరూపములను అనేకములు పరస్పర సంకీర్ణ సమ్మేళనాజనితములగు తారాది రూపములను దాల్చియున్నవనియు పదార్థాణువులు తుది పృథక్కరణమునందు వివిధాంతర బృహద్వేగముతో నిరంతరము స్పందించు విద్యుచ్ఛక్తి సూక్ష్మకణ సముదాయంబనియు నీకణంబులు త్రివిధములై నొక్కొకచో నొక్కొక సంఖ్యాపరిమితిం జెంది నొక్కొకవేగముతో స్పందించుటచే నొక్కొకపదార్థాణువుగ పరిణమించుచున్నదనియు తేల్చుచున్నది. ఈ శక్తివాహిని నిశ్చేతనము జడము ప్రజ్ఞావిహీనమనియు గుర్తించుచున్నది. అందుచే నీ విపులవిశ్వమునకు మూలము నిశ్చేతన

శక్తియేయనియు వేఱొండేదియు లేదనియు బాహ్యపరిశీల నము నిర్ణయించుచున్నది. కాని విద్యుచ్ఛక్తికణములు వేర్వేరు సంఖ్యాపరిమితితో వివిధస్పందనావేగముతో చరించుటకు కారణమేమి? అని ప్రశ్నించినచో అది మాకు తెలియదు ప్రకృతిలక్షణమే యదియని నుడివె దరు. ఈ జడప్రపంచమునందు ప్రాణచేష్టగల తరుగుల్మల తాది ఉద్భిజ్జములును, అతిప్రాథమిక ఇంద్రియ మనో చేష్టగల క్రిమికీటకాది జీవరాశియు బుద్ధివికాసముతో గూడిన మనోచేష్టగల మానవుడును యావిర్భవించుటకు హేతువునూ నూహింపనలవిగా దనుచున్నారు. అంతయు ప్రకృతిచర్యయే.

సృష్టి బాహ్యపరిశీలనమిట్లు నిశ్చేతనశక్తియే జడపదార్థమే మహద్విశ్వమునకు కారణమను నిర్ణయ మునకు వచ్చుటవలన నది పదార్థవాదము, ధాతువాద మనబడుచున్నది. సర్వాంతర్యామియగు నాత్మను గుర్తించకపోవుటచె అనాధ్యాత్మికవాదమనియు, సర్వజ్ఞత సర్వశక్తిసంపన్నతగల ఈశ్వరుని సృష్టికి హేతువుగ పరిగణింపకుండుటచే నిరీశ్వరవాదమనియు పేర్కొనబడు చున్నది. పరమావధియే లేక సదా చరించు నిశ్చేతన శక్తివాహినియే నీ జగమగుటచే నాస్తికవాదమనియు

గ్రహింపబడుచున్నది. పాశ్చాత్యదేశము లీ యుగమందు ఈ వాదమునకు కేంద్రక్షేత్రములై యున్నవి. అక్కడ జీవనవిధానం బంతయు ఈ సూత్రముపై నాధారపడి నడుచుచున్నది.

ప్రాథమికస్థియం దీ వాదము స్వభావానుసారముగ స్వధర్మానుగుణముగ జీవనను పెంపుజేసి వికసింపజేయు నవకాశములను జాతికి చెందిన వ్యక్తులకు సంఘములకు తొలగద్రోసి నిరోధించి జాతినంతయు నిశ్చేతనమగు యంత్రముగమార్చి కేవల జడతయందు ముంచి క్రమముగ జీవరహితమైన కర్మాగారముగ పరిణమింపజేయజూచు. ఈ పంథయే స్టాలిన్ నియంత యవలంబించు సోవియట్ కమ్యూనిష్టు విధానము. పరిశ్రామికాభివృద్ధినే అందును యుద్ధోపకరణములను, నానావిధములగు మారణయంత్రసమేతముగ, నిర్మించు పరిశ్రామికాభివృద్ధియే యేకలక్ష్యముగ గల్గి మఱియే పరమావధిని గుర్తించక తల్లక్ష్యసిద్ధికే జాతినంతయు కృషిచేయ శాసించు నియంతాధికారమునకు లోబడుటచే జాతిజీవనము సంకుచితమై క్రమముగ శుష్కించి యంతరించు ప్రమాదమును గల్గియున్నది. జాతిజీవనము జడవాదానుసారముగ నాస్తికవాదానుగుణముగ మాత్రము తీర్చ

దిద్దినయెడల జాతిమనుగడకే ముప్పు వాటిల్లగలదు.

ద్వితీయావస్థయందీవాదము వ్యక్తులను, సంఘములను, జాతులను జడయంత్రములను భావమందే దృష్టిని కేంద్రీకరించనియ్యక నేను నా సంఘము నా జాతియే మనదగినది, తదితరులందఱు జీవించ నర్హులు గారు, అథవా జీవించినను మాకు లోబడి మా జాతికి బానిసలుగా నుండవలెను. అను నీ యసురభావ ప్రేరితులై జాతినంతయు నుద్రేకపూరితము గావించి యంత్రసాధనసంపత్తి పెంపుజేసి యితర జాతులను క్రమముగ నంతమొందించ జూచెదరు. లేదా లోబరచుకొనజూచెదరు. ఈ పంథనే హిట్లరు ముసలోని మున్నగు నియంతలవలంబించ నాజీ–ఫాసిస్టు విధానము. ఇదియే గత ప్రపంచ మహాసంగ్రామములకు కారణము. ఇప్పుడును మఱొక ప్రపంచమహాయుద్ధమునకు దారితీయనున్నది. అసురీభావ ప్రేరితులైన జాతులన్నియు భీషణసంగ్రామముల పాలై సమసిపోవు ప్రమాదమును తప్పించుకొనజాలవు. జాతి జీవనము కేవల అహంకార ప్రాధాన్యమైన నాస్తిక వాదానుసారముగ తీర్చి దిద్దినచో జాతి మనుగడకే ముప్పు తప్పదు.

తృతీయావస్థయందీ వాదము వ్యక్తిని, సంఘము

ను, జాతిని పదార్థజనితములైన జీవరాసిగ గణించినను తమతమ స్వభావానుసారముగ స్వధర్మానుగుణముగ పెంచి వికసింపజేయు నవకాశములను సమకూర్చి జాత్యాగి అహంకారభావముల కంతగా నెడమిచ్చి క్రోధోద్ధృతిపాలబడనీయక జాతిని వికసింపజేయజూచు. గ్రుడ్డి, మూకాది వికలాంగులకు విద్యగరపు శిక్షణాలయములను వ్యాధిగ్రస్తులకు సేవయొనర్చు చికిత్సాలయములను ఏర్పఱచి ఆర్తులయెడ అనుకంపను ప్రకటించుచు జాతిని యంత్రప్రాయముగా చూడక సుఖసంతోషములతో నోలలాడించజూచు. ఈ పథము నే రూజువెల్టు, ట్రూమన్ లోనగు ప్రజాస్వామ్యాధినేతలు అవలంబించు డిమోక్రాటిక్కు విధానము. సంఘమందలి వ్యక్తు లందరకు సమానావకాశములను కల్పించియు హక్కు బాధ్యతల యందలి అంతరమును నిర్మూలింపజూచునదియే సోషయలిస్టు విధానము. జాతిజీవనను యేపరమావధి లేక కేవల ప్రాణికేచ్ఛలచే పాలితమగు మనోభావములనే ప్రాధాన్యముగ గైకొనుచు ధాతువాదానుసారముగ తీర్చిదిద్దునెడ జాతి యే స్థిరసౌఖ్యమును సంతోషమును బడయజాలక కల్లోలములపాలే విప్లములపాలే కాగలదు. సృష్టి బాహ్యపరిశీలనా ఫలితమగు ధాతువాదాను

వర్తియైన పాశ్చాత్యసభ్యత జీవనసంస్కరణను ముఖ్య మగు నీ రాజ్యతంత్రవిధానములచే మాత్రము నెరవేర్ప బూనుటవలన శాశ్వత శాంత్యానందములను కనలేక యున్నది.

ఇట్లనిన పాశ్చాత్య జాతులయందు భగవచ్చింత నయే లేదనికాదు. ప్రాచీనకాలమం దిచ్చటను భగవ చ్చింతనా తత్పరు లుండియుండిరను సూచనలు లేకపో లేదు. కాని ఈ యుగమందు ప్రాగ్దేశీయ తత్త్వవిచారము గ్రీకుతత్త్వవేత్తల నాకర్షించి ఉజ్జ్వల మేధాయుతము అనా ధ్యాత్మికమగు గ్రీకు - రూము సంస్కృతిగ పరిణమించి నది. మఱియు నది సెమిటీయులద్వారా వైష్ణవ బౌద్ధ క్రీస్తు మత రూపమున పశ్చిమమున ప్రవేశించ నెడమిచ్చినది. గ్రీకు పాదరీల తత్త్వజిజ్ఞాసయందలి వికారిత వల్లను క్రైస్తవమత తత్త్వమునకును గ్రీకో రోమను మేధకును గుణవిశేషమునందేని గుణవిలుప్తత యందేని ప్రత్యక్ష ప్రతిపక్షమైన జస్టానియా యనాగ రికతా ప్రవాహాము పొంగిపొరలుటవల్లను ప్రదీచిని ఆధ్యాత్మికము జేయ కొద్దిలో తప్పిపోయినది. క్రైస్తవ మతము శుష్కసాంప్రదాయపరమయ్యే నిల్చినది. ఆవల ఇస్లాము స్పెయిను లోనగు రాష్ట్రములపై

ప్రాగ్దేశీయ సాంప్రదాయానుసారముగ భావములను శాంతియుతముగ ప్రవేశపెట్టక పాశ్చాత్యపద్ధతిని రాజ్యాధికార వ్యాప్తిగావింప పూనినది. గ్రీసుదేశీయమైన క్రైస్తవమతమును ఢీకొని ఐరోపాయందు నవీన చింతనమునకు వస్తుపరిజ్ఞానశాస్త్ర పఠనమునకు అంకురార్పణమొనర్చినదికాని ఆధ్యాత్మికతను ప్రతిపాదింపజాలదాయె. ఇప్పుడీలా పాశ్చాత్యజాతులు తమ మేధాసంపన్నతను ప్రాధాన్యముగ ప్రపంచ బాహ్యపరిశీలనమందే వినియోగించి, జీవనను వివిధ యంత్రోపకరణముల సహాయ్యముతో సుఖ సంతోషభరితము జేయ నాశించుచున్నవి. దేవుడొకడున్న ఆతనిని యొకమూలకుత్రోసి 'నీ స్థానమదే మిగత జీవనమంతయు మాది, నీవు ఈ రంగముల ప్రవేశించరాదు' అని నిర్ణయించుకొనినవి. వివిధములగు రాజ్యతంత్రవిధానములను కల్పించి జీవనను సంస్కరించజూచుచున్నవి. విపత్కరములగు నంతరాయములను శాంతియుతముగ పరిష్కరింప తలంచి జాతుల నన్నిటిని ఐక్యమొనర్చు కూటమి నొకటని స్థాపించినవి. ఈసంస్థా స్థాపనకును మూలము ఏ పరమావధిలేని జడవాదమేయని చెప్పిన దోష మేమియు లేదు. దీర్ఘముగా నాలోచించినయెడ తన్నెదురొ్కను

విపత్తుల తోలగద్రోసికొని పెంపొంద ఇందేమి ముఖ్యముగ లోపించినది గ్రహించగలము.

జాతి జీవనను చక్కని నిర్దుష్టమార్గమున నడిపించ నిప్పుడు ప్రదీచి అవలంబించుచున్న ప్రపంచ బాహ్యపరిశీలనా విధానము సరియైనదనియే ఒప్పుకోవలెను. కాని ఆ పరిశీలనము ప్రపంచముయొక్క బాహ్యధర్మమును సత్యమునే కాక, ఇవి ఎంత అవసరమైనవైననుసరే, దేనిపై నీ సర్వమును అధారపడియున్నదో ఆ ఆత్మధర్మమును సత్యమును కనుగొన యత్నించవలెను. ఏలయన ఆత్మశక్తియే జగద్రూప విధానములను వ్యక్తము జేసి ప్రకాసింపజేయుచున్నది. బాహ్య పరిశీలనకుతోడు అతఃపరిశీలనము తప్పనిసరియై ఒకటి నొకటి పూర్ణము జేయునదియే కాగలదు. ప్రగాఢాంతఃపరిశీలనా ఫలమగు అంతరానుభూతి చాటునది యిదియే.

అంతఃపరిశీలనకు కేంద్రము అనాదిగ నాశియూంఖండ మయ్యును, అందీయుగమున నిండియూ ముఖ్యస్థానమును వహించినది. మన ఈ పృథ్వివిని ముంచి తేల్చిన గత చివరి జలప్రళయమునుండి వేదములు భగవంతునిచే రక్షించబడినవను సాంప్రదాయానుసారముగ వేదకాలము అనేక వేల సంవత్సరములనాటి దనవచ్చును.

మతొక యుగమునకు జేరినదన్నను తప్పు లేదు. వేద ఋషులు అంతఃపరిశీలనము గావించి సృష్టియొక్క మూలము ఆత్మశక్తియనియు ఆత్మధర్మసత్యములచే జీవనను సంస్కరించి అమృతానందములను బడయుటయే జీవన లక్ష్యమనియు ప్రతిపాదించియున్నారు. కాని యా ప్రతిపాదనలు బహుకాలమునాటివై పూర్వయుగమునకు చేరినవగుటవలన అందలి నిజార్థము మరుగుపడి వినష్టి జెందినది. జీవనకు సహకారిగా నుండగలదను భావముతో నిర్ణీతములైన క్రియావిధానములు మాత్రము ఎటులనో శేషించియున్నవి. జీవయుతము అగు అంతరార్థానుభూతులు మనకు అందుబాటులో లేవు. బాహ్యాభ్యంతర పరిశీలనమే ఆధారముగగొని జీవన పూర్ణతకే కృషిసల్పినకాలము కృతయుగము సత్యయుగ మనబడుచున్నది.

అంతరానుభూతులను గోల్పోయి, జీవన వికాసమునకు తోడునీడగా నుండ నిర్ణీతములైన క్రియాకలాపములు జీవరహితమైన శుష్కకర్మగా నిలిచియుండ వేదములందలి నిజార్థమును పునరుద్ధరింపజేసిన కృషిఫలితమే వేదార్థప్రతిపాదమునకు మారు వేదాంతమును ప్రతిపాదించిన ఉపనిషత్తులనాటికాలము. వేదకాలమున

కన్న నిది మనకు సమీపమందుండి వేద సాంప్రదాయ మునకు సన్నిహితత్త్వము కల్గిన ప్రాచీనవేదాంత మనియు రానురాను వేదసాంప్రదాయమునకు దూర మైన నవీన వేదాంతమనియు రెండు రూపముల దాల్చి నది. ప్రాచీనవేదాంతము 'ఏతావానశ్యమహిమ' అను వేద భావముపై నాధారపడి జీవన సర్వస్వమును ఆత్మ సత్యము ధర్మములచే వికసింపజేయ జూచుచున్నది. నవీన వేదాంతము ఆత్మవాదమునే నొక్కి చెప్పుచు, క్రమముగ జగత్తు మిధ్యయను భావమును రూఢిపఱచి బాహ్యజీవన శుష్కించి నశింప దారితీసినది. అంతరార్ధాను భూతులను గోల్పోయి కాలవాహినియందు వేదాంతము మేధావంతుల వాదోపవాదములకు గురియై జీవనవికాస మున కంత సహకారి కాకుండెను. వేదములును ప్రాచీన వేదాంతమును బాహ్యాభ్యంతర పరిశీలనాఫలితములగుట చే నీ మహద్విశ్వమునకు మూలము జడశక్తియేగాక జ్ఞాన యుతమగు చిత్శక్తియే సచ్చిదానందుని ఇచ్ఛాశక్తియే యని గుర్తించి సర్వతోముఖాభ్యుదయమునకు జీవనను తీర్చిదిద్ద యత్నించినవి. కాని బహుకాలము జరుగుట వలన ఈయోగము క్షయించి ఈమహోద్యమములు కర్మ కాండగను శుష్కవాదములుగను మిగిలిపోయినవి. ఈ

దశాకాలమును యుగచక్రమందు కలియుగకాల మను చున్నారు. శరీరము ప్రాణము మనస్సు విజ్ఞానము అను నాల్గుచరణములతో చరించుటకుబదులు శరీర మను నొక్క చరణముతో శారీరికమగు మనఃప్రాణముల నూత గొని కుంట నారంభించుచున్నది.

జాతిని పునరుద్ధరించుటకు ఈ సమయమున ఇండి యాలో బుద్ధు డవతరించెను. అంతఃపరిశీలన మొనర్చి ఏతత్ఫలితముగ జీవనను చక్కని మార్గమున నడిపించు టకు ధర్మసూత్రముల కొన్నింటి ప్రతిపాదించెను. జగత్తు ను అందుండు మానవుడును నిలుకడలేక సదా చలించు నస్థిరపదార్థ మగుటచే శూన్యమును జెందుటయే మానవుని లక్ష్యమనియు జీవితకాలములో భూతదయ యు, అహింసయు అనారతము జూపెట్టుచు జీవయాత్రను సాగించవలెనని బోధించెను. కాని అంతర్యామియగు నాత్మనుగాని నిత్యమగు జీవునిగాని గుర్తింపకుండుటచే బౌద్ధమతము పుట్టిన దేశమును విడిచిపోవలసివచ్చినది. నైతికమార్గమునకే ప్రాధాన్యమిచ్చి సర్వము క్షణిక మనియు శూన్యమే పరమావధియనియు విశ్వసించుటచే అన్నిటివెనుక జ్ఞానశక్త్యానందమయము నిత్యమగు ఆత్మ కలదని గుర్తించకపోవుటచే కర్మసంచయమే జీవుడుగాని

వేఱొండు ఏదియు లేదనుటచే జీవన పూర్ణవికాసమున కిది అంతగా నుపకారికాదయ్యె. ఇట్లగుటచే నది పాక్షిక అంతరానుభూతియే అయి పూర్ణానుభూతికి దూరమైన దగుటవలన దానివ్యాప్తి జాతిజీవనకు అంతరాయమే కాగలదిగా పరిణమించినది. ఈ సందర్భములో శంకరు లవతరించిరి: వీరు ఆత్మయే సత్యమనియు జగత్తుమిథ్య యనియు అందుచే జీవనలక్ష్యము ఆత్మసిద్ధియే యనియు ప్రతిపాదించి నిరీశ్వరవాదమగు బౌద్ధమతమును దేశము నుండి పారదోలు ప్రయత్నమును సాగించిరి. ఇట్లయ్యును వీరితర్వాత వచ్చిన ఆచార్యులు వీరిని ప్రచ్ఛన్నబౌద్ధు డని వెక్కిరింపగలుగుటకు కారణము ఇదంతయు బ్రహ్మ మను ప్రాచీన వేదాంత సిద్ధాంతమును, శూన్యవాద ఖండనమునకై, తనదగు అప్పటి పాక్షికానుభూతి కను గుణముగా కాబోలు, ఉన్నదున్నట్లు సమర్థింపక, జగత్తు మిథ్య ఆత్మయే సత్యమని మార్చి స్థిరపఱుపజూచుటయే అగుచున్నది.

ఇట్లు ప్రాచీన వేదాంతకాలమున కావలజరిగిన కృషిఅంతయు జీవననంత పటుత్వమైనదిగ జేయలేనివే గాక కృశింపజేయువాని వైపునకే తరలించినవియు పాక్షికానుభూతికి చేరినవియు అయియున్నవి. ప్రాగ్దేశము

లీరీతి ఆధ్యాత్మికజీవనకే ప్రాధాన్యమిచ్చియు బాహ్యజీవననుక్లుప్తపఱచి క్రమముగ క్షీణింపజేసినవి. ప్రాక్పశ్చిమములు రెండును ఈవిధమున సంస్కృతిని రెండుగ చీల్చి సంపూర్ణజీవనను నెలకొల్పలేకపోయినవి. ప్రాగ్దేశములిపుడు బాహ్యజీవనోన్నతి గాంచుటకును పాశ్చాత్యదేశము ఆధ్యాత్మికజీవనను పెంపొందించుకొనుటకును ఉన్ముఖమైయున్నవి. అన్యోన్య సమావేశ సంఘటనల మూలమున పూర్ణజీవన లక్ష్యసిద్ధి నాకాంక్షించుసమయమాసన్నమైనది. ఇట్టితరి ప్రాగ్దేశమున జన్మించియు చిన్నవయస్సుననే పాశ్చాత్యదేశములందు మిన్నయైయున్న ఇంగ్లాండునకు విద్యాభ్యాసమునకై పంపబడి పాశ్చాత్య సంస్కృతి నామూలాగ్రము కూలంకషముగ పరిగ్రహించి ఇండియాకు మరలివచ్చి బరోడా రాష్ట్రమందు ఉద్యోగపదవి నలంకరించి అందు సంస్కృతభాషయందపారపాండిత్యమును బడసి జాతిని పరాధీనతనుండి తొలగించ నన్నియును త్యజించి జాతీయోద్యమము సాగించుటకై కలకత్తాకుచేరి కృషియొనర్చు కాలములో ఆ పనినుండి విరమించమని ఆదేశించబడినను జాతీయోద్యమందలి వ్యామోహముచే నట్లు చేయలేకపోవుట వలన ఘోర నేరారోపణావ్యాజమున సంవత్సరకాలము

ఏకాంత కారాగారవాస మనుభవించి అంతకుపూర్వము విశ్వసింపజాలని హిందూమతరహస్యముల ప్రత్యక్షానుభవమును ఈశ్వరానుగ్రహముచే బడసి విచారణానంతరము నిర్దోషియని విడుదలనుగాంచి చేయవలసినకార్యమును నిర్దేశించి ప్రత్యక్షాంతరానుభూతినొసంగిన భగవదాజ్ఞనే శిరసావహించి కృషిసల్పబూనిన శ్రీఅరవిందులు బోధించిన పూర్ణజీవన వికాసోపలబ్ధి సాధనమార్గమును సూక్ష్మముగ వివరింప బ్రయత్నింతము. ఇది ముఖ్యముగ వేద ప్రాచీనవేదాంత దృక్పథమునుండియే అగాధాంతర్పరిశీలనానుభూతి ఫలితముగ రూపొందించబడినది. ఈకాలపు నవీనమనస్సుకు సుబోధకముగనుడువబడినది.

"అప్పుడు ఇప్పుడు ఎప్పుడో అనక ఎల్లప్పుడు ఉండునది, జడము కాక జ్ఞానతేజోపూరిత శక్తిమంతమైనది, రస విహీనముకాక నిత్యానందభరితమైనది సచ్చిదానందము. ఇదియే సర్వాంతర్యామియగు నాత్మ; సర్వాతీతమగు బ్రహ్మము. ఈ ఆత్మ సృష్టి కంతయు మూలాధారమగు కారణమే కాక సృష్టి ఫలితమును అగుచున్నది. నామరూపాత్మకమగు సృష్టిఅంతయు, అందేయొక్కటియు కూడ ఆత్మాభివ్యక్తమునకై ఏర్పడినదై

ఆదియందవి సర్వజ్ఞత్వాది ఆత్మవిశేషతలను ప్రకటించ లేని అజ్ఞానంధకార బంధురములు జరామరణ క్లేశము లకు లోనైన ముసుగులే వేషములే యగుచున్నవి. కాని యవి పూర్ణవికాసమునుగాంచి సత్యం శాంతం శివం సుందరంబను ఆత్మ విశిష్టగుణములను ప్రకటింపగల్గు వఱకు దైవీసంపత్తియందు వృద్ధినొందవలెను. దైవత్వ మందు మానవుడు వర్థిల్లుటే వాని నిజధర్మము పరిణా మముయొక్క ఉద్దేశ్యము నగుచున్నది. ఇది శ్రీఅరవిం దుల తత్త్వసిద్ధాంతముయొక్క నిజరూపము. సృష్టికి పూర్వమీ ఆత్మవ్యక్తము కానిదగుటచే శూన్యమనియు అసత్తనియు మనోవాగతీతమైనదగుటచే అచింత్యము అవిజ్ఞేయమనియు పరాత్పరమగుటచే కేవలము ఆద్య మనియు గ్రహింపనగును. అంతరానుభూతి పాక్షిక మగుకొలది ఆయా భిన్నభావము లుదయించుచున్నవి. పూర్ణానుభూతి కల్గినచో ఒక్కొకభావమును తనతన స్థాన మునాక్రమించి ఆనందరసానుభూతిని సర్వత్రనోలలాడిం చుచు జీవనకు పూర్ణవికాసమును చేకూర్చ కల్గును.

కాన, సచ్చిదానందమెట్లు అజ్ఞానాంధకార బంధురంబయి జరామరణ క్లేశములకు లోనైన జగత్తు ను సృజించె? తననుండియే నీసర్వస్వము నెట్లు వెలువ

రించె? తననుండి లేదా తానే ఈజగత్తుగ నెట్లు పరిణ
మించె! తుదకీ జగమెట్లు స్వస్థానమగు ఆత్మపదవిని
ప్రకటించగల్గు? అను విషయములను తెలిసికొన
యత్నింతము. అప్పుడు సచ్చిదానందము సృష్టికిమూలమే
గాక అతడే జగద్రూపమును దాల్చినాడనియు తన
మహత్త్వమును వానిద్వారా ప్రకటితము జేయుచున్నా
డనియు మనము గుర్తింపగలుగుదుము. జీవనను తదను
గుణముగా తీర్చిదిద్దగలుగ సాధ్యము కాగలదు.

సచ్చిదానందము—ఏకమగు బ్రహ్మము—ఒక్క
టైన ఆత్మ— 'సోకామయత బహుస్యాం ప్రజాయేయేతి'
అనేకముగ ప్రభవించెదనుగాక యని కోరెను. అనగా
ఆనందము వ్యక్తమయ్యెదనని ఇచ్ఛగించినది. సత్-
చిత్-ఆనందము అను త్రైకమునందు—సత్య-తపః-
జనః అను నీ పరార్థమునందు-సదా ఏకమైయుండు
ఆనందమయమునందు చలనము కలిగి చిత్-తపస్సు
ప్రాధాన్యతగాంచి మహాసృష్టిసాధనమగు 'మహః' విజ్ఞా
నము బయల్పడినది. సత్యం, తపః, జనః అను పరార్థ
మును సృజింపబడనున్న అపరార్థముతో సంధానమొన
ర్చునదియే మహః. ఇది క్రమముగ సువః అను
మనస్సును, భువః అను ప్రాణమును, భూః అను పృథ్విని

బహిర్గతము చేసినది; భూః భువః సువః అను నీమూడు ను అపరార్థత్రయ మగుచున్నవి. క్రిందివగు ఈమూడును, పైవగు నామూడును, సంధానలోకముతో కలసి, యేడు లోకములు భూమికలు ఏర్పడినవి. ఇవియే వేదమందు సప్తవ్యాహృతు లనబడుచున్నవి. పరార్థమును ఒక్క టిగా గ్రహించి వేదాంతము వీనినే ఐదుగా అన్నము ప్రాణము మనస్సు విజ్ఞానము ఆనందము అని పరిగణించు చున్నది.

విజ్ఞానమునందు చిచ్ఛక్తి ప్రాధాన్యతవహించినను మిగత రెండింటిసంబంధమును విడువక నంటియే యున్న ది. కావున ఈ భూమిక నుండి సృజింపబడునదంతయు సత్యజాతము అప్రతిహతము ఆనందభరితమైయుండు. సృష్టిహేతుకమగు నీ విజ్ఞానమును శ్రీ అరవిందులు (Supermind) పరమనస్సు అతీతమనస్సు అని నుడివి నారు. ఇది యింకను సృష్టియందు పరోక్షముగనే వ్యవహరించుచున్నది. ప్రత్యక్షముగ వర్తించుట లేదు. విజ్ఞానమునకు ప్రతినిధిగ ఉపరిబుద్ధి (Overmind) అతిమనోభూమిక సృష్టినిర్మాణ కార్యనిర్వహణమునకై ఏకమగు దైవమునుండి ప్రభవించి భిన్నరూపముల దాల్చినను ఏకోద్దేశముతో కృషియొనర్చు విశ్వేదేవతల

కునికిపట్టై యేర్పడినది. దీనినే శ్రీఅరవిందులు తేజో
మయ మనోభూమికయని నుడివినారు. ఇందు అనృత
మునకు అజ్ఞానమునకు తావులేదు. సృష్టివిధానమున
బ్రహ్మము క్రమావరోహణము గాంచుచూ అంతర్నిహిత
మగుకొలది (Intuitive mind) స్వతఃస్ఫురణ మనస్సు—
(Illumined mind) ప్రకాశాన్వితమనస్సు, (Higher mind)
ఉన్నతతరమనస్సు మొదలుగాగల భూమికలు ప్రభవిం
చినవి. వీనియందు సత్యతేజానందములు అంతర్నిహిత
ములై మరుగుపడుకొలది అనృతమునకు అజ్ఞానమునకు
ఆస్కార మేర్పడి తరువాతదియగు మనోభూమిక ద్వంద్వ
ములకు విభజనలకు నిలయమై వ్యథాదుఃఖముల కెడ
మిచ్చినది. ఇంకను ఆనందము అంతర్నిహితమై శక్తిమా
త్రము ప్రాధాన్యముగాంచగా ప్రాణమయభూమిక ఏర్పడి
నది. శక్తియు నంతర్నిహితమై శేషించగా ఆకాశము,
వాయువు, తేజము, (వేడి, వెలుగు) ఆపస్సు (ద్రవపదా
ర్థము – జలము) పృథ్వి (ఘనపదార్థము – భూమి) అను
పంచభూతములు ఏర్పడినవి. దీనితో అవరోహణక్రమము
ముగిసినది. బ్రహ్మము అనేకము కావలెనని సంకల్పించి
తపశ్శక్తిని జ్వలింపజేసి క్రమావరోహణ మొనర్చి
నిశ్చేతన జడపదార్థముగ రూపొందెను. ఈ అవరో

హణక్రియయందు బహుత్వ వికాసమునకు పునాదిగ పదార్థము సత్తుయొక్క వికృతిగ పరిణామము జెందినది. ఇటులనే ప్రాణము చిత్శక్తియొక్క వికృతియు మనస్సు విజ్ఞానముయొక్క వికృతియనియు తెలియనగు.

పదార్థజాలమందు అంతర్నిహితమైయున్న శక్తి ప్రాణభూమికయొక్క ఒత్తిడివలన బహిర్గతమగుచు తరుగుల్మలతాది ఓషధిరూపమున వికాసము నొంది నిశ్చేతనపదార్థమందు ప్రాణచేష్టను ఆవిర్భవింపజేసినది. ఇది ఆరోహణక్రమమునందు మొదటిమెట్టు. ఆవల మనోభూమిక ఒత్తిడివలన ఇంద్రియ మనోవర్తనము ప్రాధాన్యముగాగల క్రిమికీటకాది. సూక్ష్మ జీవరాశియు పశుపక్ష్యాది నానాజంతువర్గమును ప్రభవించినది. బుద్ధిని ప్రాధాన్యముగల మానవుడును ఉద్భవించె. ఉత్తమతరమనస్సాదిభూమికల ఒత్తిడి కలుగుకొలది బుద్ధిబలము వికాసమునొందగా మనుజుడు వ్యక్తి,సంఘ, జాతిసౌభాగ్యార్థము తన్నెదుర్కొనుచున్న వివిధ సమస్యల పరిష్కరించుటకై పలు సంస్కరణలను కట్టుదిట్టములను ప్రతిష్ఠించుకొని జీవనాభ్యుదయసిద్ధికై పాటుపడుచున్నాడు. ప్రాణికేచ్ఛలకు మనోవాంఛలకు అధీనుడగుటచే తేజోమయమనఃప్రభావమున కెడమియ్యలేకపోవు

చున్నాడు. మనఃప్రాణశరీరములు ఆత్మప్రతినిధియగు చైత్యపురుషాధీనతయందు గాక తాత్కాలిక ప్రయోజనార్థ మేర్పడిన వ్యవస్థీకరణమగు అహంకారాధీనతయందుండుటవలన నిత్యసుఖ శాంత్యానందములను బడయు మార్గమును గానలేక వివిధ విషాదసంఘటనల పాలగుచున్నవి. ఇదియే ఆరోహణమందలి ఇప్పటి ఘట్టము. 'బహుస్యాం ప్రజాయేయేతి' సంకల్పమింకను సంపూర్ణము కాలేదు. ఆత్మయొక్క పూర్తిమహత్తు పృథివియందు ప్రకటితము కాలేదు ఇప్పుడు తేజోమనఃస్థాయికి జేరవలెను. ఆవల పరోమనోభూమిక యొక్క ప్రత్యక్ష ప్రభావ ప్రసరణకు తావిచ్చి క్రమముగ మనఃప్రాణములెట్లు స్థిరపడినవో, ఆలా పరమనస్సును స్థిరపడవలెను. ఆరోహణ ప్రక్రియ సాగుకొలది నిశ్చేతనస్థితినుండి చేతనవికాసము క్రమాభివృద్ధి గాంచుచున్నది. చేతన బహిర్గతము కాకయుండుటచే జడపదార్థమునుండి ప్రాణము మనస్సు బయల్పడి స్థిరపడుటకు పరిణామ ప్రక్రియ బహుయుగకాలము సాగవలసివచ్చినది. చేతోవికాస మభివృద్ధియగుచుండ పరిణామము మందగతిని వదలి (శీఘ్ర)గతిని బూనుచున్నది. యోగసాధన కెడమేర్పడుచున్నది. మనఃప్రాణశరీరములు చైత్యపురుషా

ధీనత ప్రభావములకు లోనై వ్యవహరించగలిగిన చైత్య పరివర్తనము ప్రారంభమగుచున్నది. ఇది పూర్తియైన పిదప ఆధ్యాత్మిక పరివర్తనము—ఊర్ధ్వమనోస్థాయిని—ఉపరిబుద్ధిస్థాయిని చెందగల్గుదుము. ఆపై పరమనోస్థాయి కుద్గమించవలెను. ఈ పరివర్తనము మహత్తర ఫలముల చేకూర్చి దివ్య జన్మావతరణమునకు పునాది యగుచున్నది. అంత 'బహుస్యాం ప్రజాయే యేతి' సంకల్పము సిద్ధించినదగు. పూర్ణజ్ఞాన ప్రేరితమైనశక్తి ఆనందమయు నిజేశ్ఛయై ప్రత్యక్షముగ వ్యవహరించుటచే జీవనము అజ్ఞానాంధకార బంధురము జరామరణ దుఃఖభాజనము గాక నిత్యసుఖ శాంత్యానందభరితమై విలసిల్లు.

ఏకమగు బ్రహ్మ మీరీతి తనయందుం డీసర్వమును వెలువరించి తానే ఈ మహద్విశ్వముగ పరిణమించినది. ప్రస్తుతము పరిణామమింకను తుదిఘట్టమునకు చేరలేదు. చేతనాభివృద్ధితో పరిణామము త్వరితగతి గాంచుచున్నది. పరమనోపరివర్తనము తప్పనిసరియై యున్నది.

సృష్టివిధానక్రమమిట్టిది. బాహ్యపరిశీలనకే అత్యంతప్రాధాన్య మొసంగిన పాశ్చాత్యప్రాజ్ఞత నిశ్చేతన జడశక్తిమొదలుకొని మనుజుని యావిర్భావము

వఱకుగల పరిణామప్రక్రియనే విశ్వసించుచున్నది. అంతకు పూర్వోత్తరములను, అవి అంతఃపరిశీలనా ఫలితములే అగుటవలన, గమనింపలేకపోయినవగుటచే జడవాదమునకు కేంద్రమై జీవనను చక్కగా సంస్కరింపలేక తికమక లాడుచున్నవి. ప్రాగ్దేశీయప్రాజ్ఞత, ప్రాచీన వేదాంతకాలమునాటిదిగాక ఈవలికాలమునకు చేరినదైన ప్రాజ్ఞత, అటు ప్రగాఢాంతఃపరిశీలనానుభూతిగాని ఇటు తీవ్రబాహ్యపరిశీలనా పాటవముగాని లేనిదై కేవల సాక్షికాంతరానుభూతిపై నాధారపడి జగత్తును మిథ్యయని క్షణికమగు కర్తనిచయమని భావించుచున్నది. జీవనను బాహ్యాంతరములని రెండుగ విడదీసి ఇందున అందున చేరలేని స్థితియందుపడి త్రోవగానకున్నది. ప్రదీచి ఆధ్యాత్మికము వైపునకు ప్రాక్కు భౌతికసంసిద్ధివైపునకు మరలుచున్నవి. కాన జీవనసంస్కరణము బాహ్యాంతర పరిశీలనాజనితసూత్రములపై నాధారపడవలెను. పూర్ణసిద్ధిని బడయుటకు ద్వివిధోన్నతులను సాధించవలెను. శ్రీఅరవిందులు ఈసందర్భమున సూచించినమార్గమిది. "అన్నిటికి మూలము ఆత్మయగుటవలన భగవంతుని యొకమూలకుత్రోసి నీస్థాన మదియే మిగతజీవన అంతయు మాది అని పొరబడక సర్వమును ఈ మనఃప్రాణ

శరీరముల నన్నిటి ఆతని కర్పితముజేసి ఆత్మ ఆధీనతకు చైత్యపురుషాధీనతకు తెచ్చి ప్రప్రథమమున చైత్య పరివర్తన మొనర్చవలెను. ఆపై మనఃప్రాణ శరీరములందు వివిధ దివ్యశక్తులు తమతమ సంపత్తిప్రభావముల నెలకొల్పి విస్తృతముజేయ కృషియొనర్పవలెను. ఇదియే ఆధ్యాత్మిక పరివర్తనము. ఆధ్యాత్మిక పరివర్తనము పూర్ణమగుకొలది జ్ఞానతేజానందశక్తియొక్క ప్రత్యక్షప్రవర్తనము మనఃప్రాణ శరీరములందు ప్రతిష్ఠితమగును. ఇదే విజ్ఞాన, పరమనో, పరివర్తనము. ఈ పరివర్తనము పూర్తి అగుకొలది మనల నెదుర్కొనుచున్న గడ్డుసమస్యల పరిష్కరింపగలమార్గము సుబోధితమై జాతిజీవనను సంస్కరించుట సులభసాధ్య మగును.''

మార్గమును సూచించినదేగాక తుదివరకు ఆ పంథ నంటియే బహుదూరము సాగియుండిరి. బాల్యమందీ యోగసాధనయందు నమ్మికగాని ప్రయత్నించు సంకల్పముగాని లేకున్నను కవిత్వాభిమాని యగుట వలన అంతర్దృష్టి అంతర్వాణి వీరియందు వికసింపదొడగినవి. పరాధీనతనుండి జాతిని ముక్తినొందించుటయే తీవ్రాకాంక్షగ గల్గియుండుటవలన అంతర్వాణి నంతగా పాటింపకపోవుట తటస్థించినది. తనంతటతాను త్రెంచుకో

లేని బంధములను సర్వజ్ఞుడగు నీశ్వరుడు తొలగించి ఏడాదిపాటు ఏకాంత కారాగారవాసప్రాప్తి గావించి ఆధ్యాత్మిక ధర్మసూత్రములను తత్త్వతః నిరూపించి చేయవలసిన కర్తవ్యమిదియని చూపి విముక్తుని జేసెను. ఈ సంఘటన ౧౯౦౯-మే నెలతో సమాప్తి ఆయెను. కాని ఆధ్యాత్మికశక్తిని తదేకనిష్ఠతో జీవనసంస్కరణ కుపయోగించు సాధనముగ జేయగల మార్గాన్వేషణము ౧౯౧౦-లోనే ప్రారంభించి రనవచ్చును. ఈ కృషి ఫలితములను ౧౯౧౪-ఆగష్టులో లోక సంగ్రహార్థమై ప్రకటింప ప్రారంభించి ౧౯౨౧-వఱకు ప్రకటించుచునే యుండి తిరిగి ఐదుసంవత్సరములు యోగ సాధనయందు నిమగ్నులై ఆధ్యాత్మిక పరివర్తనముగాంచి పరమనో పరివర్తనార్థమై కృషి జేయుచు ౧౯౨౬-లో నాశ్రమ మును స్థాపించి దాని నిర్వహణ శ్రీతల్లిగారి కొసంగి ఏకాంతవాసమును పూనిరి. ఈ కాలమందు సావిత్రి మహాకావ్యరచనయు ఋగ్వేదమందలి అగ్నిసూక్తము లకు ఆంగ్లానువాదమును సాధకుల సంశయనివారణార్థ మై సందేశముల యుల్లేఖనమును సాగించుచుండిరి. ఏకాంతవాసము ప్రారంభించిన పన్నెండు సంవత్సరము లకు అనగా ౧౯౩౮-లో నొక విపత్కరసంఘటన

జరిగినది. నవంబరు ౨౪-వ తేది ఉదయం కాలుజారి పడగా తొడఎముక విరిగినది. ౧౯౩౯-ఏప్రిలునాటికి కాలుకట్టుకొని యథాప్రకారము నడువ సాధ్యమైనది. అప్పుడే రెండవ ప్రపంచసంగ్రామము ఆరంభముకాగా ఇండియా పరాధీనతనుండి విముక్తముగాగల సమయ మాసన్నమైనదని యెఱింగి ఆధ్యాత్మికశక్తి నుపయోగించి దానికై కృషి యొనర్చుచుండిరి. ఎటులనో ౧౯౪౭-లో నిండియా స్వాతంత్ర్యమును గాంచినది. ఆనాడు శ్రీవారొసంగిన సందేశములో నీమైదు విషయములును బాల్యమునుండి తా నాశించినవనియు ఇప్పుడు ఫలోన్ముఖమైనవనియు వివరించియున్నారు. "ఒకటి, పరాధీనతనుండి ఇండియాను తొలగించు విప్లవ క్రియాకలాపము; ఇండియా మనుగడ భగవంతుని కొఱకు లోక కల్యాణమునకు ఆవశ్యకము గనుక దాని స్వాతంత్ర్యము అవసరమైనది. ఇది సిద్ధించినను ఐక్యత సమకూరలేదు. ఏయుపాయముచేతనైనా విభజన అంతరించవలెను. అంతరించును; రెండు, ఆశియా స్వాతంత్ర్యము పునరుద్ధరణము, ఇదియును కొంతకు కొంత సిద్ధించినది, మిగత త్వరలో సిద్ధింపనున్నది; మూడు, మానవకోటి కైక్యత సమకూర్చు వ్యవస్థా

స్థాపనము, ఇదియు రూపొందినది కాని, స్థిరస్థాయిని గాంచుటకు మానవుని బుద్ధిమాంద్యము స్వార్థపరత అడ్డుతగిలి భగవదేచ్ఛను వ్యతిరేకించకుండుగాక!; నాల్గు, పాశ్చాత్యజాతులకు ఆధ్యాత్మికసిద్ధాంతములనే గాక శిక్షణలకూడ ఇండియా అందజేయుట, ఇదియు నిప్పుడు ప్రారంభింపసాగినది; అయిదు, అనాదిగా మానవుని నెదుర్కొను క్లిష్టసమస్యలను పరిష్కరించు నేకైకసాధనమగు పరమనోశక్త్యావతరణము, ఇది నా వ్యక్తిగత ఆదర్శమే యింకా, దూరదృష్టిగల మేధావులు కొందఱు మాత్రము దీనిచే నాకర్షింపబడుచున్నారు. ఇది సర్వత్ర వ్యాప్తిని గాంచుటకు ఇండియాయే కేంద్రము కాగలదు. ఈకార్య మెంతవఱకు, ఎంత త్వరితముగ, నెఱవేరునది స్వతంత్ర ఇండియాపై నాధారపడి యున్నది.''

ఈ సందేశమునుండి శ్రీ అరవిందులు భగవదాదేశము నెట్లుసాధింప యత్నించినది తెలియగలదు. స్వధర్మానుసారముగ స్వభావానుగుణముగ జాతిని సంస్కరించుటకు స్వాతంత్ర్య మవసరముగాన ఇండియా స్వాతంత్ర్యమును ఆశించుచూ పునరుద్ధరణ స్వాతంత్ర్యములును తప్పనిసరి యైనవి. అన్ని జాతులు సమరసభావముతో

విపత్కర సంఘటనలపాలుగాక జీవితాశయములను శాంతముగ సాధింపగల్గుటకు ఐక్యజాతికూటమి స్థాపనము ఆవశ్యకమాయెను. ఈసంస్థ వర్థిల్లి నిర్దిష్టకార్యమును చక్కగా నెరవేర్చుశక్తిసంపద మానవ పరివర్తనముపై నాధారపడియున్నది. అది ఆధ్యాత్మిక శిక్షణాభ్యాసమువలనమాత్రము సాధింపనగు. కావున సిద్ధాంతములే కాక శిక్షణక్రమములను కూడ పాశ్చాత్యజాతులందు ప్రవేశపెట్టవలసిన విధి ఏర్పడినది. ఇది సాకల్యముగ కొనసాగుటకు అప్రతిహతముగ నెరవేరుటకు జ్ఞానతేజానంద శక్తిపథమగు పరమనస్సుయొక్క అవరోహణము ప్రాధాన్యతను వహించినది. దీని నంతయు ఆధ్యాత్మిక బలముచే సాధింపబూనినారు. ౧౯౪౭ - ఆగష్టు నాటికిని పరమనోపరివర్తనము తమ వ్యక్తిగత ఆదర్శమనియే యన్నారు. ఆవల ౧౯౪౯-౫౦ సంవత్సరములలో ఆశ్రమ వ్యాయామశిక్షణ వార్తాపత్రికలో పృధ్వియందు పరమనశక్త్యావతరణమువలన గలుగు మహత్తర పరిణామములను సుదీర్ఘముగ వివరించియున్నారు. తాము తలపెట్టినకార్య మింకను పూర్తికాలేదు. జాతినేకాక ఈ మహాద్విశ్వమునే పరివర్తనమొనర్చబూనిన శ్రీయరవిందులు తాము పన్నినకార్యవిధానమును మార్చి

వేఱొక వ్యూహమును పన్నవలసిన యవసరమును గుర్తించుటచేకాబోలు ౧౯౫౦-డిశంబరు ౫-వ తేదీన శరీరోత్క్రమణమును గావించిరి. కార్యభార మిప్పుడు శ్రీఅరవిందాశ్రమ నిర్వాహకులగు శ్రీతల్లిగారిపై బడినది. శ్రీఅరవిందులు సదా సంపూర్ణముగ తోడ్పడుచున్నారు. దైవచోదిత మైనదిగాన ఈకార్యము అన్ని అంతరాయములను తొలగద్రోచుకొని తుదివఱకు సాగగలదు. పరమానస అవరోహణము తథ్యము. భూమియందీయవతరణము తప్పనిసరి. ధైర్యోత్సాహములతో మాత నండగొని ముందుకు జనుడని హెచ్చరించుచున్నారు శ్రీవారు.

శ్రీవారి యోగముయొక్క యుత్కృష్టతను అందలి యపూర్వవిశేషములను, మా వట్టిమాటలతో వర్ణించుటకన్న శ్రీవారి వాక్యముల నట్లే యుల్లేఖించుట ముఖ్యమని పది పండ్రెండేండ్లనాడు ప్రకటితమైన శ్రీవారి యొక యుత్తరములోని కొంత భాగము నిట ననువదించి యుదాహరించుచున్నాము.

అన్ని యంశములందును నా యోగము కేవలము క్రొంక్రొత్తయని నే నెన్నడు నుడువలేదు. దానికి పూర్ణయోగమని నామకరణ మొనర్చితిని. అట్లొనర్చుటవలననే పురాతన యోగ



ఆగష్టు ౧౫, ౧౮౭౨.　　శ్రీ అరవిందులు　　డిశంబరు ౫, ౧౯౫౦.

ములసారమును, వానినుండి యనేకపద్ధతులను అది గ్రహించినట్లు తెలియగలదు; దాని నవీనత్వము, దాని లక్ష్యమందును, దానిని గుఱించిన దృక్పథమందును, ఆ పద్ధతియొక్క సమగ్రతయందును గలదు. 'రిడిల్' 'లైట్సు' లోనగు గ్రంథములందుగాని ప్రకటింపనున్న నూతనగ్రంథమునందుగాని యోగముయొక్క ప్రారంభదశలనుమాత్రమే నేను వివరించియున్నాను. అందా యోగముయొక్క విస్తృతిని సూచించునాదర్శము, ఆ యోగవృత్తులందలి భావము, ఆయోగము లక్షించు నంతిమవిశేషము, మఱియు నాత్మవిచారణ విధానము, దాని నిర్వహణము ఇవి తప్ప పూర్వయోగములనుండి ప్రత్యేకభేదమును జూపించున దేదియును లేదు. ఆ నవీనత్వవిషయానికి యుత్తరములందు క్రమరీతిగా గాని ఏదోయొక పద్ధతి ననుసరించిగాని విపులీకరింపబడలేదు, సాధ్యమునుగాదు. అందువలన నింతకుముందే బుద్ధిపరిచయమునగాని కొంత అనుష్ఠానమునగాని అలవాటుపడని వారావిషయమును గ్రహించలేరు. ఇంతవఱకవిదితము నసాక్రాంతమునగు సీమను బ్రవేశించెడి యీ యోగముయొక్క యుత్తరోత్తరదశల విధానముంగాని, వివరముంగాని నేను బహిరంగ పఱచలేదు, ప్రస్తుత మట్లొనర్పనే నుద్దేశించను లేదు.

ఇదే మాదిరి పైకి కనబడు లక్ష్యములు, భావిసూచనలు—కొన్ని యోగమతముల ననుసరించి (మానవ) జాతియొక్క పూర్ణత్వము, కొన్ని తాంత్రిక సాధనములు, సంపూర్ణకామసిద్ధి నందుటకు ప్రయత్నము మున్నగునవి—ఉన్నవని నాకుగూడ చక్కగా దెలియును. వీనినిగుఱించి నేనే పేర్కొనియున్నాను. కేవలము ప్రపంచమున కావల దైవత్వసిద్ధిగాంచుటకు మాత్రమే

గాక భూ(మి) చైతన్యము పరిణామధర్మానుసారముగా నింకను నిర్వహించవలసియున్న ఆ యుత్తరపథము నందుటకుగూడ జాతి యొక్క ఆధ్యాత్మిక పూర్వదశ ప్రకృతి ప్రయత్నముగానుండి యున్నదను భావమునుగూడ నేను వెల్లడించియున్నాను. అందు వలన ఆయాదర్శములు నాదానితో సమాంతరములయ్యు నయ్యుదియే గాకపోయినప్పటికిని నాయోగము, దానిలక్ష్యము, దాని విధానము, నూతనమని యంగీకరించినను అంగీకరించకున్నను నే నేమాత్రమును సరకుగొనను; అది యొక యల్పవిషయము. కాని దాని నంగీకరించగలవారుగాని దాని ననుష్ఠించగలవారు కాని ఆ విషయము సత్యమని గుర్తించుట, అదియే కార్యసిద్ధి వలన సత్యముగా స్పష్టపడుట, ఇది యొక్కటియే ముఖ్యవిషయ ము; నవీనమనిగాని విస్మృతమైన పురాతనయోగమునే తిరిగి వల్లించుట యని లేక పునరుద్ధరించుట యనిగాని ఎట్లు పేర్కొని నను ప్రమాద మేమియులేదు. నా దృష్టియందు పూర్వయోగముల లక్ష్యమును భావమును తిరిగి యట్లే చర్విత చర్వణ మొనర్చుట తృప్తికరముగా నుండలేదనియు స్వభావసిద్ధమై గతకాలపు సమస్తాధ్యాత్మిక ప్రయత్నముయొక్క నిగూఢఫలితమైయున్నప్ప టికిని ఇంతవఱకు సిద్ధింపనిదానిని ఇంతవఱకు దృగ్గోచరము కాని దానిని సాధించుట కొకవిషయము నుపపాదించుచున్నాననియు తెలియజెప్పుటకు కొందఱు సాధకుల కొకయుత్తరమునందు అది నవీనమని నొక్కి చెప్పియుంటిని.

క్రింద పేర్కొను ఈ కారణమువలన పురాతనయోగము లతో బోల్చిచూచినపు డిది క్రొత్తదిగా నున్నది:—

౧. ఈ యోగము ప్రపంచమునుండి జీవితమునుండి స్వర్గ

మునకో నిర్వాణమునకో పలాయనమగుట గాక జీవితముయొక్క ఉనికియొక్క మార్పునే కాంక్షించుచున్నది. ఆ మార్పు ఏదో యప్రధానము ప్రాసంగికము గాక విలక్షణము ముఖ్యోద్దేశ్యము నై యున్నది. ఇతరయోగములం దవరోహణ మున్నను అది మార్గమం దొక ప్రాసంగికముగా ముందుగా ననుకొనిన యొక సంభవముగా నారోహణముయొక్క ఫలముగామాత్రమయియున్నది; నిజముగా నారోహణమే ముఖ్యము. ఇచ్చట ఈ యోగమందు ఆరోహణము ప్రథమసోపానమే, అది యవరోహణమునకు మార్గమే. ఆరోహణ మున లభించు నవ్యప్రజ్ఞయొక్క యవరోహణమే ఈ సాధన యొక్క ప్రత్యేకధర్మము, విశిష్టలక్షణము. తాంత్రిక వైష్ణవ సాధనలు గూడ జీవితమునుండి విమోచనము గాంచుటయందే యంతమగుచున్నవి. జీవితముయొక్క దివ్యత్వపరిపూర్తియే ఇందు లక్ష్యముగా నున్నది.

౨. వ్యక్తికొఱ కీశ్వరసాక్షాత్కారము నొక వ్యక్తిసాధించుటగా దీ యోగమున గాంక్షించు లక్ష్యము. ఏదో విశ్వాతీతమైనసిద్ధికిగాక ఇచ్చట, ఈ విశ్వమందు, భౌతిక చైతన్యమునకు నద్దాని లభింపజేయుటకే. సాధించవలసిన విషయముగూడ నింతవఱ కాధ్యాత్మిక జీవితమందు సహితము నిర్మాణముకానట్టియు భూలోకమున-పృథ్వీస్వభావమందు-ప్రత్యక్షముగా క్రియారూపము దాల్చనట్టియు నొక చైతన్యశక్తిని - విజ్ఞానశక్తిని - తీసికొనివచ్చుటయే. దాని నింకను నిర్మాణమొనర్చి ప్రత్యక్షముగా బని చేయునట్లు చేయవలసియున్నది.

3. తన ముందిడుకొనిన లక్ష్యమువలె సమగ్రము సర్వతోముఖమునైన ఈ కార్యసిద్ధికి నొకవిధానము స్పష్టీకరింపబడినది;

అనగా ప్రజ్ఞయొక్క, స్వభావముయొక్క సంపూర్ణమైన సమగ్రమైనమార్పు. పురాతన పద్ధతులను గ్రహించినను, అవి ప్రత్యేకమైన వేఱుమార్గములకు కొంతపాక్షిక ప్రయోజనముగా తాత్కాలిక సాహాయ్యముగా మాత్ర ముండును. పురాతనయోగములలో నీమార్గము నట్లే పూర్ణముగా గాని దానితోబాటుగా గాని వ్యవహరించినట్లు లేక స్వానుభవమునకు దెచ్చినట్లు నేను జూచియుండ లేదు. నా కది లభించియుండి యున్నచో ముందుగా నంధకారమునుండి కాంతిమంతముగావించి, సిద్ధపఱచి, దిద్దితీర్చి, ప్రతిష్ఠించి, నిరపాయముగా ప్రకాశము - బహిరంగము - గా గావింపబడి నటువంటి ఆమార్గముల ననుసరించి నే నతిత్వరగతి సుఖముగా నా గమ్యస్థానమునకు పరుగిడగలిగియుండినపుడు తిరిగి నేను బాటల నిర్మించుటయందు * ముప్పది సంవత్సరములుగా తదన్వేషణమందు, అంతస్సృష్టియందు నా కాలమును వ్యర్థపుచ్చి యుండరాదు.

పై నుదాహృతమైన లేఖనుండి, శ్రీఅరవిందు లెంత మృదువుగా సున్నితముగా సూచించినను, శ్రీవారి యోగ మన్నివిధముల నవీనమనియే నూత్నపరిణామ దశయనియే స్పష్టమగుచున్నది. 'ఆర్య' లోని 'యోగ సంయోజన' మను వ్యాసపరంపరలను, ముఖ్యముగా 'ఆత్మసిద్ధియోగ' మను భాగములోని అధ్యాయములను బఠించినయెడల శ్రీరవింద యోగమందలి నవీనత్వము,

* ౧౯౦౫-లో శ్రీవారు వ్రాసినది.

కనివినియెఱుంగని పరివర్తన ప్రక్రియలు ఋజువగును. ఆ విషయమును మాత్ర మతిసంక్షేపముగా సూచింప బ్రయత్నింతుము. దివ్యజీవనము దేవజాతి భూలోకమం దిచ్చట స్థిరముగా నెలకొనవలయునన్న ముందు మానవునియందు గల సకలాంశములు, కేంద్రములు విశుద్ధములై దివ్యోపకరణములుగా, ఈశ్వరావిష్కారమునకు వాహినులుగా నుండవలయును.

అందువలన మానవునియందు ప్రధానమైన ఉపకరణచతుష్టయ మగు శరీరము, ప్రాణము, చిత్తము, బుద్ధి,విశుద్ధములు సమర్థములునునై పరాప్రకృతికి శరణు చొచ్చి తదనుగ్రహమునకు బాత్రమైయుండవలయును. యంత్రప్రాయముగా, ఆసన ప్రాణాయామాదుల వలన గొంత పురోభివృద్ధిని శక్తిని గడించినను పరార్థమునకు వలయు నర్హత లభించదు. ఉచ్ఛ్రాయము నందుకొనగల కృత్స్నయోగమువలననే సిద్ధించును. అపుడే శరీరము తన నైజమైన అవరస్వభావమునుండి శుద్ధి ముక్తులను బడసి మహత్త్వమును, బలమును, లఘుత్వమును, ధారణాసామర్థ్యమును గడించగలదు. ప్రాణముగూడ, పూర్ణతను, ప్రసన్నతను, సమతను, భోగసామర్థ్యమును బొందగలదు. అట్లె చిత్తము సౌమ్యత్వమును, తేజస్సు

ను, కల్యాణశ్రద్ధను, ప్రేమసామర్థ్యమును. ఇక కడపటిది, మానవునియం దధికాధికముగా వికాసము నందినదియు నగు బుద్ధియు విశుద్ధతను, ప్రకాశతను, విచిత్రబోధను, సర్వజ్ఞాన సామర్థ్యమును, సంపాదించుకొనగలదు.

ఈ పరిణితిని బడసినపుడే విజ్ఞానశక్తి, పరాశక్తి, జగన్మాత ఈ యుపకరణముల ననుగ్రహించి, వానిభార మువహించి, పరిశుద్ధ మొనరించి, యున్నత శిఖరముల నందించి పరివర్తన మొనరించగలదు. అపుడే ద్వంద్వ ములు నశించి సమత్వము స్థిరపడి సర్వత్ర బ్రహ్మ మయానుభూతి గాగలదు. త్రిగుణములు నవరములు నగుమనః ప్రాణశరీరములందును బరివర్తన మేర్పడును. తమోగుణ ప్రధానమైన శరీరము పైని పేర్కొనిన నాల్గు శక్తులతోపాటు శాంతి మయమగును. అట్లే రజో గుణ ప్రధానమగు ప్రాణము శక్తిగా, సత్త్వగుణప్రధాన మగు మనస్సు తేజస్సు, జ్యోతిర్మయముగా నేర్పడును. అనగా శివచిహ్నముగా పరాశాంతిమయమైన శరీరము, రుద్రుని చిహ్నముగా శక్తిగానైన ప్రాణము, విష్ణు చిహ్నముగా తేజోమయమైన మనస్సు పరిణతము లగును. అపుడే దివ్యమైన భాగవతజీవనము, దివ్యజాతి భూలోకమం దావిష్కరించగలదు.

ఇంకను శ్రీ అరవింద యోగమును, ఆ యోగ సాధన విధానమును సమగ్రముగా గ్రహించుటకు వారు రచించిన యోగసంయోజనము (The Synthesis of Yoga) 'తల్లి' (The Mother), యోగదీపికలు (Lights on Yoga), యోగపు పునాదులు (Bases of Yoga), మున్నగు గ్రంథములు పఠించనగును. కాని యోగము నందఱు, ఎవరంతట వారు వారిష్టము ననుసరించి యభ్యసింప గలిగినంత సులభవిషయముగాదు. అపూర్వము మహత్తరము నగు శ్రీవారి పూర్ణయోగము మఱింత కష్టతమము.

ప్రథమమున దైవమే కావలయునను తీవ్రాకాంక్ష, తదితరముల నన్నింటిని బూర్తిగా పరిత్యజించుట ఉండవలయును. శ్రద్ధాభక్తులు తీవ్రోజ్జ్వలనముగా నుండెడి ఇచ్ఛావిశ్వాసములు నిరంతరముండవలయును. 'సమత్వం యోగఉచ్యతే' అను గీతోక్తిననుసరించి సమత్వము నభ్యసించి సాధించవలయును. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అను శ్రీకృష్ణభగవానుని ఆదేశము ననుష్ఠానమునకు దెచ్చుకొనవలయును. మఱియు సద్గురుసాన్నిధ్యమును వారి యనుగ్రహమును లభించవలయును. 'గురు వనగా నొక యున్నతతర ఆత్మస్థితికి చైతన్యమునకు నారోహించినవారు. సాధారణముగా

వారిని సాక్షాదీశ్వరావిర్భావముగా లేక ఈశ్వర ప్రతినిధిగా భావించెదరు. వారు తమ యుపదేశములవలన, నంతకంటె నెక్కువగా తమ ప్రభావాదర్శములవలన మాత్రమే గాక స్వానుభవము నితరులకు సంక్రమింప జేయునట్టి యొకశక్తిమూలమునను సాయపడుచుందురు.'

కాని శ్రీఅరవిందులు స్థాపించనున్న దివ్యజీవనమును గాంక్షించువారు కల్యాణశ్రద్ధతో, అనగా గురువర్యులు చాటుచున్న ఆదర్శము,విజయవంతము కల్యాణప్రదము తప్పక యగునను విశ్వాసోత్సాహములతో స్థిర సంకల్పముతో తదేకనిష్ఠతో గొంతమంది యీ ప్రపంచమం దెల్లెడల, ముఖ్యముగా భారతభూమి యందుండనవసర మెంతేని కలదు. అట్టి ఆకాంక్ష, సంకల్పములు తీవ్రమగుకొలదియే ఈశ్వరానుగ్రహము లభించి దివ్యజీవన మేర్పడగలదు. ఇది ముఖ్యవిషయము. అందువలన శ్రీఅరవింద వాఙ్మయమును బఠించి ఆ యాకాంక్షను బడసి, ఆ భావములను తోడిసోదరుల హృదయములందు నాటి ఈశ్వరోపాసకులగువారు యథాశక్తి ప్రయత్నించి ధన్యులగుదురుగాక యని ఆశించుచు చున్నాము.



సంపూర్ణము

సమీపములోనున్నట్లో, లేదా ప్రారంభమైనట్లో, నెఱవేరుమార్గమున నున్నట్లో ఈ దినమున నేను గుర్తించగలుగుచున్నాను.

ఈ యుత్కృష్టసమయమున సందేశ మొసంగుమని యడిగినారు కాని అట్లొసంగుస్థితిలో లేను. ఏ ఆదర్శముల, ఉద్దేశ్యముల నా బాల్య యౌవనములలో నే నూహించి, ఇపు డవి ఫలప్రదము లగుట కారంభించుటను చూచుచున్నానో వానినిగురించి స్వకీయము వ్యక్తిగతము నగు ప్రకటనము యొనర్చుట మాత్రమే నేను చేయగలిగిన దంతయును. ఏలయన నవి ఇండియాస్వాతంత్ర్యమునకు సంబంధించినవి; ఇండియా భావికార్య మని నేను విశ్వసించెడిదానిలోని భాగములు; అది ప్రధానస్థానమును గైకొనక తప్పనిసరియై యున్నదిగనుకను. ఎందువలన ననగా తన భౌతిక స్వప్రయోజనములను, తన విస్తృతిని, ఔన్నత్యమును, శక్తి సంపత్తులను మాత్రమే నెఱవేర్చుకొనుటకు గాక—వానినిగూడ ఇండియా విస్మరించగూడ దప్పటికిని—నిశ్చయముగా నితరులవలె అన్యదేశీయులపై నేలుబడిని సంపాదించుటకుగాక, సమస్త మానవజాతికి మార్గదర్శిగా సాహాయ్యకారిగా, భగవానుని కొఱకు ప్రపంచముకొఱకుగూడ ఇండియా జీవించుచున్నదని, ఉద్బోధ మగుచున్నదని చెప్పియున్నాను; నన్నెపుడును ఆ భావమే అంటియున్నది. ఆ యుద్దేశాదర్శముల సహజక్రమము లివి:

ఇండియా స్వాతంత్ర్యైక్యముల సాధించు విప్లవము; మానవ సభ్యతాభివృద్ధిలో తాను వహించియుండిన ఉచ్చపాత్రను మరల గైకొనుట, పునరుత్థానము, స్వాతంత్ర్యమును; మానవకోటి ఆశియా యొక, నవీనము, మహత్తరము, ప్రకాశమానము, నౌదార్యము నగు జీవనమున కధిగమించుట. ఆ జీవన సంపూర్ణ సంసిద్ధి జాతీయ

జీవనమును సమకూర్చి కాపాడుచు, బాహ్యమున ప్రజల ప్రత్యేక మైన యునికియొక్క సర్వస్వము నధిగమించి, ఐక్యమును బొందు పఱచుచు, అంతర్జాత్యైక్యమువీద నాధారపడును; సమస్త జాతికి ఆధ్యాత్మిక జీవనమునకు వలయు శిక్షణ విధానములను, తన ఆధ్యాత్మిక జ్ఞానమును ఇండియా ప్రసాదించుట; కడపటిది, ఉన్నతతర భూమికకు చేతన యధిగమించుటవలన మానవు డుద్బుద్ధుడై, వ్యష్టి సమష్టిసిద్ధులనుగూర్చి కలలగాంచ నారంభించినప్పటి నుండి వానిని కలవరపఱచినట్టియు, విసిగించినట్టియు జీవితసమస్య లనేకముల పరిష్కరింపగల నూత్న పరిణామ పథము.

ఇండియా స్వతంత్ర్యము గాంచినది, కాని యైక్యమును బడ యలేదు, చిట్లిన భిన్నమైన స్వాతంత్ర్యమే లభించినది. బ్రిటీషువారు జయించుటకు పూర్వము విభిన్నసంస్థానములుగా నుండిన అయో మయస్థితిలో మరల పడిపోవునాయను నట్లొకప్పుడు కనుపించెను. అదృష్టమువలన అట్టి ప్రమాదమైన పతన స్థితినుండి తప్పించు కొనగల దృఢమైన సంభవత ఇపుడు వర్ధిల్లినది. శాసననిర్మాణ సభవారు తెలివితేటలతో నవలంబించిన తీవ్రపద్ధతి ఛిద్రము, చీలిక లేకుండ నిమ్నజాతుల సమస్యాపరిష్కారమును సాధ్య మొనర్చినది. కాని హిందూ ముస్లీముల ప్రాచీన కులవిభజనము దేశముయొక్క రాజకీయ స్థిరవిభజనగా గడుసుబారినట్లు కన్పించు చున్నది. ఈ నిర్ణీత విషయమెప్పటికి స్థిరపడినదని గాని, ఏదో తాత్కాలిక పరిష్కారముకన్న మించిన దని గాని దేశీయమహా సభయు జాతియు నంగీకరించదని ఆశించెదము. విభజన శాశ్వత మైనయెడల ఇండియా తీవ్రముగా దుర్బలమై పోవచ్చును; కుంటు వడికూడ పోవచ్చును; అంతర్యుద్ధమునకు చిరావకాశ మేర్పడ

గలదు. విదేశీయుల పునర్దండయాత్ర, విజిగీషలుగూడ సంభవములు. దేశవిభజన మంతరించవలసినదే—అది నేటి తీవ్రోద్రేకము సడలి పోవుటవలన, శాంత్యన్యోన్యతల ఆవశ్యకమును క్రమక్రమముగా గ్రహించుటవలన, అందఱకు సంబంధించి కలిసిమెలసి చేయగల నిరంతర కార్యావసరమువలన, అందు నిమిత్తమై ఏర్పడగల ఐక్యోపకరణములవలన సిద్ధించగలదని ఆశించెదము. ఈవిధముగా నైక్య మేరూపమున నేని లభించవచ్చును. సరియైనరూపము మూల సిద్ధాంతముగా గాక వ్యావహారికముగా ప్రాధాన్యము గావచ్చును. కాని యే యుపాయమున నేని విభజన మంతరించవలెను, అంతరించును. ఐక్యములేకున్న ఇండియా భవితవ్యము తీవ్రముగా క్షీణించును; విఫలముగూడ గావచ్చును. కాని యట్లు కాకూడదు.

ఆశియా మేల్కొనినది; అందలి బహుభాగములు విముక్తములైనవి; లేదా ఈ క్షణమందే విముక్తము లగుచున్నవి; దాస్యమందున్న ఇతరభాగములు స్వాతంత్ర్యమునకై పోరాడుచున్నవి. ఏ స్వల్పమో చేయవలసియున్నది, అది నేడో రేపో చేయబడును. ఆ విషయమున ఇండియా తనపాత్ర నిర్వహించవలసియున్నది; అప్పుడే తన సాధ్యతల పరిణామమును సూచించగలిగినట్టియు సకల జాతుల సంఘమునందు తన కుండగలస్థానమును జూపెట్టగలిగినట్టియు శక్తిసామర్థ్యములతో తనపాత్ర నిర్వహణము నారంభించినదగును. మానవైక్యము మార్గమున బడినది; స్వీయశక్తి యసంపూర్ణముగ యున్నను, వ్యవస్థితమైయున్నది; కాని ప్రబలకష్టముల నెదుర్కొని పోరాడుచున్నది. బలమును గలదు; చరిత్రానుభవమును మార్గదర్శిగా గైకొంటిమేని అది జయించువఱకు తప్పనిసరిగా నభివృద్ధి నందవలసినదే. ఇందుగూడ ఇండియా తన

ప్రధానపాత్రను నిర్వహింప నారంభించినది; తాత్కాలిక విషయములకు, సమీపములోనే సంభవమగువానికి బద్ధముగాక భవిష్యత్తును వీక్షించి దానిని మఱింత సామీప్యమునకు తీసికొని రాగల రాజనీతిచతురతను బెంపొందించగలదేని, తనయునికి మందము - భయాన్వితము, ధైర్యము - వేగవంతము వీని తారతమ్యములవలె పురోభివృద్ధి నొనర్పనగును. ఏదో మహావిపత్తు మధ్యలో దాపరించి నిరోధించవచ్చును, జరుగుదానిని నాశనము గావించవచ్చునుకూడ; అప్పటికిని ఫలము నిర్దిష్టము. ఏలయన, ఏరీతిగానేని ఐక్యము ప్రకృతివిధానమందావశ్యకమైనది; స్వతస్సిద్ధమైనది; దాని సంసిద్ధిని దృఢముగా ముందే చెప్పవచ్చును. జాతులకుగూడ దాని యావశ్యకత విస్పష్టమైనది; అదిలకున్న స్వల్పజనసంఖ్యాకులగు జాతులస్వాతంత్ర్య మిక నెన్నడూ సురక్షితము కాజాలదు; మహత్తరము శక్తిమంతము నగు జాతులుగూడ నిరపాయముగా నుండజాలవనుట నిశ్చయము. ఇండియా విభాజ్యమైయేయుండు నెడల తన రక్షణముగూడ కల్లయగును. అందువలననే అందఱి క్షేమార్థమే ఐక్యమేర్పడవలెను. మానవుని బుద్ధిమాంద్యము విమూఢమైన స్వార్థపరత్వము మాత్రమే దానిని నిరోధించగలవు. వానికి వ్యతిరేకముగా దేవతలు ప్రయత్నించినను గూడ నిష్ప్రయోజనమని వచింపబడియున్నది; కాని ప్రకృతియొక్క యావశ్యకతకు భగవదిచ్ఛకు వ్యతిరేకముగా కలకాల మది నిలువజాలదు. అపుడు జాతీయత సార్థకమగును; అంతర్జాతీయభావము, దృష్టి బెంపొందవలయును, అంతర్జాతీయ రూపములు సంస్థలు నెలకొనవలయును; ద్వంద్వము బహుళము నగు పౌరసత్వాభివృద్ధిగూడ నుండవచ్చును; ఈ ప్రక్రియలో సభ్యతల స్వేచ్ఛాసంయోగముగూడ గలుగవచ్చు

ను. జాతీయభావము దృక్పథము తన తీవ్రతను విడనాడి తన స్వీయ దృష్టియొక్క సంపూర్ణతకు సమగ్రముగా సమన్వయించునట్లు కనుగొనవచ్చును. నవీనమైన ఏకత్వభావము మానవజాతి నావరించును.

ప్రపంచమున కిండియాయొక్క ఆధ్యాత్మిక ప్రసాదాను గ్రహ మప్పుడే ప్రారంభమైనది. ఇండియా యొక్క యాధ్యాత్మికత యూరోపు అమెరికాలయందు నిరంతర మధికాధిక పరిణామమున ప్రవేశించుచున్నది. ఆ యుద్యమ మభివృద్ధియగును; కాలానుగుణమగు విపత్తులమధ్యగూడ నధికాధిక దృక్కులాశతో ఇండియా వంక తిరుగుచున్నారు; కేవ లోపదేశములకే గాక దాని నైత్యాధ్యాత్మిక సాధనకు నధికాధికముగా నాశ్రయించు చున్నారు.

మిగత దంతయు నా వ్యక్తిగతమైన ఆశ, భావము, ఆదర్శము. ఇవిగూడ నిండియాలోను పాశ్చాత్యదేశములోను, రెండింటియందును, దూరదృష్టిగల మేధావులను వశీకృతము గావింప నారంభించినవి. ఇతరోద్యమములందుకంటె ఈ పథమునందు కష్టములు మరింత దుర్ఘటము; కష్టములు, వానిని జయించుటకే ఏర్పాటుప బడినవి; మఱియు పరమపురుషుని ఇచ్ఛయున్నయెడల నవి నిశ్చయముగా నతిక్రమింపబడును. ఇందును, ఈపరిణామ మేర్పడవలయు నేని, - ఆత్మోన్నతి, అంతశ్చేతనాభివృద్ధి వీని మూలముననే రావలయును గాన, - ప్రారంభ మిండియానుండియే జరుగగలదు. ఆ యవకాశము విశ్వమునకంతకు నున్నను కేంద్రోద్యమ మిండియాదే గావచ్చును.

ఇండియా స్వాతంత్ర్య దినమునుగుఱించి నాభావమిది. ఎంతవఱకు సంభవమగునది, ఎంతవఱకు, ఎంత త్వరగా నెఱవేర గలది అనునది ఈనూత్నము స్వతంత్రమునగు ఇండియాపై నాధారపడును.

---

౧౫ ఆగస్టు ౧౯౪౭ — శ్రీ అరవిందులు

# ఆంధ్రరాష్ట్ర విభజన సందేశము

**కీ॥ శే॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు శ్రీఅరవిందు లకు బహుమతిని యొసంగినపుడు కోరగా శ్రీవారు ఆంధ్ర విశ్వవిద్యాలయమున కొసంగిన సందేశము.**

మీరు సందేశమును కోరినారు, నేను వ్రాయునది, సందేశ మని అనిపించుకో దగినదైనచో, నది, ఆంధ్ర విశ్వవిద్యాలయము నకు, దాని నిర్వహణవిధులకు, స్వభావ స్వధర్మములకు, అది చేయవలసిన కృషి కలాపములకే సంబంధించినది కాగలదు. కాని, మనదేశ రాజ్యాంగ విధానమును, పరిపాలనాక్రమమును రూపొం దించుటయందే కాక, దాని నిర్దిష్ట విశిష్ట వైఖరిని, స్వభావ స్వధర్మ ములను, ఇతరజాతుల మధ్య తా నాక్రమించుకొనవలసిన భవిష్య త్స్థానమును నిర్ణయింప నిమగ్నమైయున్న ఈ మహాక్లిష్టసమయ మున నా దృష్టిని ఆవైపు మరల్పకుండజాలను. మనల నందఱ చీకాకుపఱచుచు దేశమంతటి నెదుర్కొనుచున్న సమస్యయొకటి కలదు. దానిని సాధ్యమైనంత విపులముగ వివరించెదను. బ్రిటీషు వారు తాత్కాలికముగ నేర్పఱచిన రాష్ట్రములను రాజధానులను, స్వతఃసిద్ధమగు క్రొత్త విధానమున, క్రొత్తదైనను ప్రాచీన ఇండియా చిరకాలముగ సన్నాహపఱచియున్న ఏకత్వములోని బహుత్వమను సూత్రముపై నాధారపడిన, పునర్విభజనను

గూర్చిన తీవ్రాకాంక్షయే యది. హిమాలయాపర్వతపంక్తివలను, హిందూమహాసముద్రము చేతను ఇండియా ప్రత్యేక జీవనకు బద్ధమైనప్పటికిని, యితరులనుండి భిన్నమై స్వీయగుణగణములు గల జాతికి నిలయమై, భిన్ననాగరికత, జీవనవిధానము, ఆత్మప్రవర్తనము, ప్రత్యేకకళ, సంస్కృతి, సాంఘిక కట్టుగిట్టములకు కాలవాలమైయున్నది. దానిలో ప్రవేశించిన దానినంతయు జీర్ణించుకొని, వానినంతటిపై ఇండియాను ముద్రనిడి, అతివిభిన్న వ్యక్తిత్వముల నన్నింటిని తన ప్రధానైక్యతయందు సమ్మేళన మొనర్చినది. కాని, కలకాలముగ నది భిన్నజాతులు, దేశములు, రాజ్యముల కాటపట్టయినది. స్వీయ నాగరికతా సంస్కృతులను నెలకొల్పగల్గి, ఇండియను సంస్కృతి నాగరికతలతో వివిధకళాశిల్పములను పొంది పొసగునట్లు జేయనోపిన ప్రజాస్వామ్యరాజ్యములు, వివిధజాతులు, స్వీయ విశిష్టస్వభావములతో గూడిన అంతర్జాతులతో నిండియున్నది. ఇండియనుచరిత్ర, చాలావఱకు ఇండియా నొకే కేంద్ర సామ్రాజ్యపాలనక్రింద, రాజకీయముగ, సాంస్కృతికముగ, వివిధభాగములను ఒకే నవిభాజ్య రాజ్యాంగముగ జేయజూచిన నిరంతర కృషిని సూచించుచున్నది. ప్రత్యేక మత విధానము సంఘసంస్కరణలు గల మహమ్మదీయుల దాడివలన చీలిక యేర్పడినప్పటికిని, రాజకీయ ఐక్యతకు నిర్విరామ కృషి జరుగుచునేయుండెను. సంస్కృతుల సమ్మేళనమునకును, ఒండొంటిపై నన్యోన్యప్రభావప్రసరణకును ఎడమిచ్చినదే ఆయెను; ప్రత్యక్ష విరుద్ధములగు నీ మతద్వయమునుండి, సమన్వయమత మొకటి ప్రతిపాదింప తీవ్రకృషియు జరిగినది. ఇందును అన్యోన్యప్రభావ ప్రసరణము కన్పించుచునే యున్నది. కాని

# ఆంధ్ర రాష్ట్ర విభజన సందేశము

ఇండియాను చరిత్ర అంతటిలో రాజకీయ ఐక్యత పూర్ణముగ సిద్ధించనే లేదు. దీనికి కారణము లనేకములు. మొదలు, దేశముయొక్క అతివిశాలత, వివిధ జనములను దగ్గఱకు జేర్చనోపిన రాకపోకల లేమిడి; రెండవది, సుస్థిరములు కాని పలు సామ్రాజ్యముల స్థాపనకు దారితీసిన సామ్రాజ్య సైనికాక్రమణము; చివఱకు, ఈ భిన్నరాజ్యముల నణగద్రొక్కి ఒకేరూపు రేఖలతో ఐక్యమొనర్చవలెనను ఇచ్ఛలేకపోవుటయు. ఇంతలో బ్రిటీషు సామ్రాజ్యము అవతరించినది. దేశమును తన అనుకూలావసరముల ప్రకారము రాజధానులుగ విభజించినది. ప్రాంతీయ జన విభజనసూత్రమును విస్మరించినదే కాని ఆ విభజనను అంతమొందింప లేకపోయినది. ఈలా ఆద్యపరిస్థితులనుండి స్వాభావికమగు ప్రాంతీయ భాషా ప్రయుక్త జాతులు తమతమ విభిన్న భాషలతో సంస్కృతులతో నాల్గు ద్రవిడజాతులుగ బెంగాలీ, మహారాష్ట్ర, గుజరాతీ, పంజాబి, సింధు, అస్సామీ, ఒరిస్సా, నేపాళీము, హిందీ భాషను మాట్లాడు ఉత్తరాదివారు, రసపుత్రులు, బీహారీలుగ నెలకొన్నవి. రాజధానుల పరిపాలనతో కూడిన బ్రిటీషు సామ్రాజ్యపాలనము ఈజాతులను ఐక్యమొనర్చలేదు. కాని, వారిపై సమష్టిపరిపాలన విధాన మొకటివిధించి తా నొసంగిన విద్య—ఆంగ్లభాష—వలన సన్నిహితత్త్వమును కల్పించి, స్వతంత్రమునకైన ఆకాంక్ష, తత్సిద్ధిసాధనకైన ఐక్యతను, సర్వవ్యాప్తమగు జాతీయాభిమానమును బలవఱచినది. స్వతంత్రమును సాధించతగినంత విజిగీషయైక్యతను సమకూర్చినది. కాని స్వతంత్రముతోపాటు ఐక్యత సిద్ధించలేదు. పాకిస్థానము, హిందుస్థానము అని ద్విజాతిసూత్రముపై ఇండియా కావలెనని చీల్పబడినది. దానివలన కలిగిన విషాద

పరిస్థితులు అందఱకు తెలిసినవే.

బ్రిటీషువారివద్దనుండి పరిపాలనను తీసికొనునప్పుడు తాత్కాలికముగనైన బ్రిటిషువారు నిర్మించిన రాజధానుల ననుసరించవలసినది విధాయకమాయెను; ఈ తాత్కాలిక విధానము స్థిరపడేసూచనలు కనుపించుచున్నవి. ఈ సుస్థిరతయందు అనుకూల మున్నదని కొందఱు భావించుచున్నారు. ఏలయన, దేశైక్యత కది సహకారియై దేశము పూర్ణ ఐక్యతనుగాంచ పూర్వమద్దుతగిలిన ప్రాంతీయ అంతర్గాతుల యావశ్యకత తొలగిపోగల దనుటయే. ఖచితమైన ఐక్యతయందే వాస్తవిక ఐక్యతను వారు చూచెదరు. ఒకేజాతి ఒకేపరిపాలనా విధానము, భాష, సాహితి, సంస్కృతి, కళ, విద్య ఇవన్నియు జాతీయభాషతో సమకూర్చ జూచెదరు. భవిష్యత్తులో నిది ఎంతవఱకు సాధింపకూడినది మన మూహించలేము, కాని ఇంతలో అది అసాధ్యము. ఇండియాకిది తగునా అనే విషయముకూడ సందేహాస్పదమే. దేశములోని విభిన్నతలు మేలు కీడులను గల్గియున్నవి. ఈ విభిన్నతలలో దేశము జీవయుతమగు అనేక జీవనకళాసంస్కృతి కేంద్రములుగ రసవత్తరమగు ఏకత్వములోని బహుత్వమునకు నిలయమైనది; అంతయు యేకొన్ని రాజధాని పట్టణములలోగాని సామ్రాజ్య కేంద్రమందుగాని, యితర నగరములను ప్రాంతీయదేశముల నణగద్రొక్కి, సాంస్కృతికముగ మాంద్యస్థితికి పోద్రోలి, కేంద్రీకరించలేదు. జాతియంతయు వివిధభాగములలో పూర్ణజీవనను ప్రకటించుచు అన్నిటియందు క్రియాశక్తిని అపారముగ వృద్ధిపఱచినది. విభిన్నత్వము ఇండియాయొక్క ఐక్యతను సంకుచితపఱచును. లేదా అంతరింపజేయునను ప్రశ్న యెప్పటికిని లేదు.

# ఆంధ్ర రాష్ట్ర విభజన సందేశము

వస్తుపరిజ్ఞాన శాస్త్రాభివృద్ధిచేతను వేగవంతమగు రాకపోకలు అలవడుట వలనను జాతులను దూరీకృతముజేయు దేశవిశాలత తొలగింప బడినది. సంయుక్తభావమును దాని నాచరణలో నుంచుట కనువైన సాధనోపకరణములు కనుగొనబడి స్థాపించ బడినవి. పూర్ణముగ వ్యవహరింపగలవు. అన్నిటికంటె అతిశయముగ జాతీయ ఐక్యతాభావము జనులయందు సుస్థిరమైనది. సులువుగా త్రోసిపుచ్చబడజాలదు. లేక తగ్గించబడలేదు. అంతర్జాతీయభావములు పూర్తిగా వికసిల్లి తమ సహజాభివృద్ధిని పొందకుండ నిరోధించుటయే విపత్కరవిషయము కాగలదు. స్వాతంత్ర్యాగమనమునకు పూర్వము కాంగ్రెసు భాషాప్రయుక్త రాష్ట్రవిభజనను ఆమోదించినది. వెంటనే కాకున్నను దానిని కూడినంత శీఘ్రకాలములో అమలుపఱుచుట చాలా విజ్ఞతతోకూడినవిషయ మనవచ్చును. ఇండియను జాతీయజీవనము నైసర్గికబలములపై నాధారపడి స్వాభావికమైన బహుళత్వములోని నేకత్వసూత్రమును పూర్తిగా తన జీవితమందు వర్తింపజేయుచు తన స్వభావ స్వధర్మములకు రక్ష యొనర్చగలదు.

ఈలాంటి అభివృద్ధినే భవిష్యత్తు సూచించు చున్నదనవచ్చును. స్వీయ పరిపాలనాహక్కునే ద్రావిడజనములు కోరుచున్నారు మహారాష్ట్రులిట్టిహక్కునే ఆశించుచున్నారు; గుజరాత్తులో నిదేస్థితి ఏర్పడగలదు. అంత బ్రిటీషునిర్మిత బొంబాయి మద్రాసురాజధానులు అంతరించగలవు. పూర్వపు బంగాళా రాజధాని, ఒరిస్సా, బీహారు, అస్సాములను స్వీయపరిపాలనా యుత పలు ప్రాంతీయజాతులుగ మాఱినవి. మధ్య పరగణాలలోని సంయుక్త రాష్ట్రములలోని హిందీమాట్లాడుప్రాంతముల కూటమి ఈ

విభజన విధానమును పూర్తిజేయగలదు. ఇండియాదేశ విభజనను రద్దుచేయుటచే యేకొద్దిమార్పులో కలుగవచ్చునేగాని ఈసహజ పరివర్తనమును మార్పజాలదు. రాష్ట్రముల ప్రాంతీయజనుల ఐక్యతయే ఐక్యయిండియాస్వరూపము కాగలదు.

ఈ క్రొత్త పరిపాలన విధానములో మీా విశ్వవిద్యాలయము తన విధ్యుక్తధర్మమును పరిపూర్ణతను కాంచగలదు. ఇండియాలోని యితర విశ్వవిద్యాలయములకన్న దీని పుటుక భిన్నమార్గమునకు చేరినది; అవి రాజధానికేంద్రములలో విదేశీయ అధికారవర్గముచే ఇండియాలో తమ నాగరికతను స్థాపించుటకై కేవల విద్వత్పరిషత్ కేంద్రములుగ యేర్పఱుపబడినవి. ఆంధ్ర విశ్వవిద్యాలయ మన్ననో దేశాభిమానముగల ఆంధ్రప్రయత్నముచే రాజధానికేంద్రమందు గాక ఆంధ్రనగరమందు ప్రాంతీయ జనులకు తోడ్పడవలెనను ఉద్దేశ్యముతో ఏర్పడినది. వీర్యవంతము బలాఢ్యమగు జాతికి నిలయమై రాజకీయముగ గతమందు నిండియాలో ముఖ్యపాత్రను వహించి కళ, శిల్పము, వాస్తు, సంగీతములలో సాధించిన పేరుప్రతిష్టలను పూర్వసామ్రాజ్యవాసనలను ఆంధ్రులు విస్మరించలేరు. దేశమందు చాలాభాగమును స్వీయ సామ్రాజ్యవంశ పరంపరలచే పాలించినదియు మఱువజాలరు. చివరిదియగు విజయనగర హిందూసామ్రాజ్యమహిమ ఏ జాతికైనను ప్రశస్తమైన వృత్తాంతమని జ్ఞప్తియుంచుకొనక తప్పదు. మీా విశ్వవిద్యాలయము తేజోజ్ఞాన సంస్కృతుల కేంద్రముగ ఉన్నతస్థానము నాక్రమించి ఆంధ్రయువకుల తమ పితృలతో సరితూగ శిక్షణ యొనర్చగలదు. మహత్తరమైన గతము అంతకు గొప్ప లేక అంతకంటె గొప్ప భవిష్యత్తును కల్పించగలదు. వస్తుపరిజ్ఞానశాస్త్రము నే గాక

కళలున్నూ, గ్రంథ పరిచయ జ్ఞానము నే గాక సంస్కృతి గుణాభివృద్ధియునూ విద్యకు నిజధర్మములు. వ్యక్తి తన శక్తిసామర్థ్యములను పెంచుకొనుటకు తోడ్పడి, భవిష్యత్తులో చింతనాపరుల, సృష్టికర్తల, ద్రష్టల, కార్యవీరులను సిద్ధపరుప సాయపడుటయే దాని ముఖ్య కార్యభాగము. కాని ప్రాంతీయజన జీవన కూపస్థ నుండూకము కాకూడదు; ఇండియాలోని యితర ప్రాంతీయ జనములతో ఆంధ్రయువకులు సంబంధ బాంధవ్యములు కలిగియుండవలెను. పరిశ్రమలు వ్యాపారములు లోనగు వారి యితర అనుభవవేద్య జీవితములలో నే గాక మనో ఆత్మ విషయములలో కూడ సన్నిహితత్త్వము గల్గియుండవలెను. ఆంధ్రదేశ పౌరులుగా నే గాక హిందూదేశీయ పౌరులుగా కూడ నుండవలెను. ఇండియా జాతిజీవనయే వారి జీవనవిధానము కావలెను. మహత్తర జాతీయవ్యవహారములు సమస్యలు సమగ్రముగ గ్రహించుకొని జాతీయసంస్థలలోను సర్వప్రవర్తనలలోను ఆంధ్ర ప్రాతినిధ్యము చక్కగావహించగల శ్రేష్ఠసంఘశ్రేణి ఏర్పడవలెను. దేశమందలి అన్ని భాగములలో నుండి అంతర్జాతీయరంగమందు సమర్థులు గుణప్రవృద్ధులయిన జన సహాకార మెంతేని కావలసియున్నది. ఏలయన ఇప్పటికే అంతర్జాతీయరంగమునందు ఇండియా ఉన్నతస్థానమును వహించియున్నది. ఇంకను కాలము జరుగుకొలది అపారమహిమను గాంచగలదు; కాలవాహినియందు ఉత్కృష్టరాజ్యముగ జగద్భవిష్యత్తు నే నిర్ణయించగల బలాఢ్యనాయకత్వమును వహించ నున్నది. దీనికంతకు ప్రతిభావంతులును, శిక్షణాన్వితులును, మేలురకమునకు చెందినవారును కావలెను. ఈరంగము లన్నింటిలో మీ విశ్వవిద్యాలయము ఉత్తమసేవ యొనర్చునదియు అపారము అమూల్యమగు కృషి

యొనర్చగలదియు కాగలదు.

ఈక్షణములో, స్వాతంత్ర్యసిద్ధినిగాంచిన రెండవసంవత్సర మందు, జాతి యనేక ప్రధానసమస్యల నెదుర్కొనవలసియున్నది. ప్రజ్ఞతో పరిష్కరింపలేనియెడల విషాదపరిస్థితులకు దారితీయగల సమస్యలివి. యుద్ధానంతరమున మఱొక సంగ్రామమునకు దారి తీయగల కలవరపాటుతో లోటుపాటులతో మిళితమైన జగస్థితి శాన్ ఫ్రాసిస్కోలో నిర్దేశించబడి యింకను పూర్తి అనుచరణ సాధ్యముకాని జగదైక్యసంస్థవలననే సాధింపబడగలదు. కాని ఈఉద్యమమును కొనసాగించవలెను. సమరసములోగూడిన జగన్నిర్మాణమునకు గల నిరోధములను త్రోసి పుచ్చగల క్రొత్త సూత్రవిధానమును కనుగొనవలెను. లేనిచో విపత్తును పతనమును తప్పించుకొనజాలము. ఇండియాకే కొన్నితీవ్రసమస్యలు గలవు. పుష్కరమగు పరిశ్రమలు, వ్యాపారము, సాంఘిక రాజకీయ జీవనయు, బలాఢ్యమైన సాయుధబలసంపత్తియు, యితరజాతులమధ్య రాజనీతిచతురతతో ప్రవర్తించుటయు, తాను సాధించినవానినెల్ల పోషించి రక్షించుకొనుటయు, ప్రపంచమునం దధికభాగము నయిత మాక్రమించుటయు అను నీ మహావిజయప్రాప్తియందు తన స్వధర్మమును ఆత్మను పోగొట్టుకొను ప్రమాదము గలదు. అంత ప్రాచీన ఇండియా ఆత్మతోసహా తుదిముట్ట అంతరించగలదు. అన్నిటితోపాటు మఱొకజాతియే ఏర్పడినదగును. మనకుగాని ప్రపంచమునకుగాని గణించినదేమి యుండదు. బాహ్యజీవనలో నిరపాయముగ వృద్ధిజెందుచు విచిత్రఘనతతో పూర్వము దృఢముగ సాధించి స్వీకరించిన ఆధ్యాత్మికానుభూతిజ్ఞానముల గోల్పోవునా అనేదేప్రశ్న? మిగత ప్రపంచమంతా ఆధ్యాత్మిక

సాహాయ్యమునకు, రక్షయొనర్చు తేజముతో అది తనవైపు మఱలు చున్నపుడు ఇండియా తన ఆధ్యాత్మికశక్తిని త్యజించినచో అత్యంత విషాదస్థితియే యేర్పడగలదు. ఇది జరుగకూడదు. నిజముగ జరుగనేఱదు. కాని చాలబహుళము క్లిష్టము అగు సమస్యలను జాతి యెదుర్కొనగలదు. నెదుర్కొనవలసి యున్నది. మనము తప్పక వీని నన్నింటి దాటగల్గుదుము. కాని చిరకాల పరాధీనతవలన క్రుంగతయు విషాదస్థితిలో చిక్కియున్నందు వలన బాహ్యాభ్యంతర మహద్విమోచనము పరివర్తనము విశాల బాహ్యాభ్యంతరాభివృద్ధియును ఇండియా తన నిజధర్మము నిర్వహించవలెనంటే అవసరములు.

శ్రీ అరవిందులు

మానసిక కృషికన్న శరీరముతో కష్టించి పనిచేయుట ఎన్నటికిని తక్కువైనది కాదు, మేధయొక్క దురహంకారమే ఈ అపోహకు కారణము. భగవానునికిగాను చేయు కృషియంతయు దైవికమైనదియే; తన స్వీయాభివృద్ధికిగాను, ఖ్యాతికిగాను, లేక మానసిక తృప్తికిగాను చేయు మానసికకృషికన్న భగవానునికిగాను చేయు శరీరకష్టము ఎక్కువ దైవికమైనది.

శరీరము తాత్కాలికముగ బడలియున్నయెడ శారీరిక బలమును మఱల సాధించుటకుమాత్రము విశ్రాంతి యావసరమగుచున్నది. మానసిక ఆత్మాభివృద్ధికై శారీరికమైన పనిని కృషిని వదలివేయవలెనను భావము మానసికాహంకార జనితమే.

శ్రీ అరవిందులు

# శ్రీ అరవింద విరచిత గ్రంథములు



## పద్యకావ్యములు

౧౮౯౦-౧౯౦౨ లోని రచనలు:

ఎ. ప్రచురిత కావ్యనాటకములు ప్రథమ సంపుటి శ్రీఅరవింద ౩౦౬ పేజీలు. ఆశ్రమం, పుదుచ్చేరి. ౧౯౭౨

విషయసూచిక :—

## శ్రీ అరవింద విరచిత గ్రంథములు

౧౮౯౫ - ౧౯౦౮ లోని రచనలు

(మహాభారత ఉద్యోగ పర్వాంతర్గతము); సాగరసంగీతము (సి.ఆర్. దాసుగారి బెంగాలీ గ్రంథము).

## సి. రాజకీయ అవాంతరములో గృహశోధనాసందర్భము చిక్కకపోయిన గ్రంథములు:-

(౧) బిసోరావజీయుర్లు. (౨) మేఘసందేశము. (3) మహాభారతము, రామాయణము, వైష్ణవకవులనుండి అనువాదములు.

## డి. పూర్తిగాని అనువాదములు.

కుమార సంభవము ... ... ...

## ఇ. మహాకావ్యము-సావిత్రి

౧-వ సంపుటి 3౧౬ పేజీలు. శ్రీ అరవింద ఆశ్రమం, పుదుచ్చేరి. ౧౯౫౦

## ప్రథమగ్రంథము. ఆద్యగ్రంథము:-

సర్గలు. (౧) సాంకేతిక యుషస్సు. (౨) సారాంశము. (3) రాజుయొక్కయోగము. (౪) రహస్యజ్ఞానము. (౫) రాజుయొక్కయోగము - ఆధ్యాత్మికస్వాతంత్ర్యము - మహత్తు.

## ద్వితీయ గ్రంథము—లోకాంతర యాత్రికుని గ్రంథము.

సర్గలు. (౧) లోకసోపానము. (౨) సూక్ష్మపదార్థలోకము. (3) జీవనోత్కృష్టత; పతనము. (౪) హైన్యప్రాణలోకము. (౫) హైన్యప్రాణదైవతములు. (౬) మహత్ప్రాణలోకములు దైవతములు. (౭) నిశికావరోహణము. (౮) అసత్య లోకములు - అధ్యాత్మ మాతృక - అంధకారతనయులు. (౯) ప్రాణదైవతములస్వర్గము. (౧౦) హైన్యమానసలోకములు దైవతములు. (౧౧) బృహన్మనోలోకములు దైవతములు. (౧౨) ఆదర్శిక స్వర్గములు. (౧3) మనో

మయ పురుషునియందు. (౧౪) విశ్వాత్మ. (౧౫) బృహద్జ్ఞాన లోకములు.

## తృతీయ గ్రంథము. దివ్యజనని గ్రంథము.

సర్గలు. (౧) అవిజ్ఞేయ పురోగమనము. (౨) దివ్యజనని ఆదర్శము. (౩) ఆత్మవాసస్థానము. (౪) సాక్షాత్కారము.

మహాకావ్యము సావిత్రి. ౨-వ సంపుటి: శ్రీఅరవిందాశ్రమం
౩౪౫ పేజీలు. పుదుచ్చేరి.
౧౯౫౧

## రెండవ భాగము

## చతుర్థగ్రంథము. జన్మ-అన్వేషణల గ్రంథము.

సర్గలు. (౧) జ్యోతి జననము-బాల్యము. (౨) జ్యోతి వయోవికాసము. (౩) అన్వేషణాదేశము. (౪) అన్వేషణ.

## పంచమగ్రంథము—ప్రేమగ్రంథము.

సర్గలు. (౧) నిర్దిష్టసంగమస్థానము. (౨) సత్యవానుడు. (౩) సత్యవానుడు-సావిత్రి.

## షష్టమగ్రంథము—విధిగ్రంథము.

సర్గలు. (౧) విధివాక్కు. (౨) విధివిధానము - బాధనుగూర్చిన సమస్య.

## సప్తమ గ్రంథము—యోగగ్రంథము.

సర్గలు. (౧) సంగమానందము. మృతినిగూర్చిన భవిష్యద్జ్ఞాన పరిశోధన—హృదావేదన. (౨) ఆత్మాన్వేషణ గాథ. (౩) అంత

ర్భూమికా ప్రవేశము. (౪) త్రివిధాత్మశక్తులు. (౫) ఆత్మసాక్షాత్కారము. (౬) నిర్వాణము, స్వర్గపరిత్యాగము, కైవల్యానుభూతి. (౭).........

**అష్టమగ్రంథము—మృత్యుగ్రంథము.**

సర్గలు...(౩) అరణ్యాంతరమృతి—

## మూడవ భాగము.

**నవమగ్రంథము—నిత్యనిశీగ్రంథము.**

సర్గలు. (౧) కటికి చీకటివైపు. (౨) నిత్యనిశిలో పయనము—చీకటివాక్ధ్వని.

**దశమ గ్రంథము—సంధ్యాద్వయ గ్రంథము.**

సర్గలు. (౧) ఆదర్శాత్మక స్వాప్నిక సంధ్యారాగము. (౨) మృత్యువు సువార్త. ఆదర్శము యొక్క నిరర్థకత. (౩) ప్రేమ మృత్యుసంవాదము. (౪) భౌతిక యదార్థతను గూర్చిన స్వాప్నిక సంధ్యారాగము.

**ఏకాదశగ్రంథము—నిత్యాహర్గ్రంథము.**

సర్గ. (౧) నిత్యాహస్సు—ఆత్మ నిర్దేశము-పరమావధి.

**ద్వాదశగ్రంథము—ఉపసంహారము.**

సర్గ. (౧) పుడమికి పునరాగమనము.

ఎఫ్. తుదికవితలు.... ౪౫ పేజీలు. శ్రీ అరవిందాశ్రమం,
పుదుచ్చేరి.
౧౯౫౨

(౧)దివ్యశ్రవణము; (౨)అంతస్థిత విశ్వమయుడు; (౩)విద్యుత్క్షణము. (౪) గుప్తపథకము. (౫) నిశిప్రయాణికుడు. (౬) ముక్తి (౭) సాక్ష్యాత్మ. (౮) నిశ్చేతనము. (౯) విశ్వచేతన. (౧౦) జీవనయేకత్వము (౧౧) స్వర్గజ్యోతి. (౧౨) అఖండదైవఘటన. (౧౩) మహత్తర పథకము. (౧౪) విశ్వమయావతారము. (౧౫) దైవము. (౧౬) శిలావిగ్రహము. (౧౭) కృష్ణ. (౧౮) శివ. (౧౯) శాంతిలోకము. (౨౦) అనంతాత్మ. (౨౧) ద్వంద్వపురుషుడు. (౨౨) లీల. (౨౩) అర్పణము. (౨౪) దివ్యకార్మికుడు. (౨౫) అతిథి. (౨౬) అంతరాధినేత. (౨౭) పరా సత్యశాస్త్రమునుగూర్చిన స్వప్నము. (౨౮) ఐక్యతానందము. (౨౯) అద్భుతజన్మ. (౩౦) శరీరము. (౩౧) ముక్తి. (౩౨) జ్యోతి. (౩౩) ద్వైపాయన సూర్యుడు. (౩౪) ఆత్మ (౩౫) సర్వవ్యాపకత్వము. (౩౬) అద్వైతము. (౩౭) కొండమాదిగుడి. (౩౮) "నీ వున్నంగున..." (౩౯) దివ్యసృష్టి. (౪౦) అగోచరానంతము. (౪౧) సోపానముపై నిస్పృహ. (౪౨) దివ్యేంద్రియము. (౪౩) మానవుడు, వైరుధ్యాధినేత. (౪౪) అపూర్వబిడ్డలు. (౪౫) రజితాహ్వానము. (౪౬) విభిన్నతలు. (౪౭) మానవుడు—ఆలోచించెడు పశువు. (౪౮) పరిణామము.

## వచనగ్రంథములు.

(౧) దివ్యజీవనము ౨ సంపుటములు. శ్రీఅరవింద
౩ భాగములు. ఆశ్రమం,
౧భాగము ౪౪౧ పేజీలు. పుదుచ్చేరి.
౨,౩ భాగములు ౫౧౬-౬౭౧-౧౧౮౬- పేజీలు. ౧౯౩౯,౧౯౪౦.

# శ్రీ అరవింద విరచిత గ్రంథములు

## ఒకటవ సంపుటి—సర్వవ్యాప్త సత్యము—జగత్తు.

అధ్యాయములు: ౧, మానవాకాంక్ష. ౨, ద్వివిధ త్యాజ్యములు, భౌతికవాది త్యాజ్యభావము. ౩, సన్న్యాసి త్యాజ్యవిధానము. ౪, సర్వవ్యాప్తసత్యము. ౫, వ్యక్తియొక్క అవధి. ౬, విశ్వమందలి మానవుడు. ౭, అహంకారము, ద్వంద్వములు—వేదాంతజ్ఞాన సరణి. ౯, శుద్ధసత్తు. ౧౦, చిచ్ఛక్తి. ౧౧, సృష్టియందలి ఆనందము—సమస్య. ౧౨, సృష్టియందలి ఆనందము—పరిష్కారము. (సమాధానము) ౧౩, దివ్యమాయ. ౧౪, విజ్ఞానము—సృష్టికర్త. ౧౫, పరాసత్యచేతన. ౧౬, విజ్ఞాన త్రిస్థాయి. ౧౭, దివ్యాత్మ. ౧౮, మనస్సు: విజ్ఞానము. ౧౯, ప్రాణమును మృత్యువు, కోరిక, అసమర్థత. ౨౧, ప్రాణారోహణము. ౨౨, ప్రాణసమస్య. ౨౩. మానవుని ద్వివిధాత్మ. ౨౪, భౌతికపదార్థము. ౨౫, పదార్థగ్రంథి. ౨౬, పదార్థ ఆరోహణక్రమము. ౨౭, పురుషుని సప్తరజ్జువులు, ౨౮, పరమనస్సు, మనస్సు, అతిమనోమాయ.

## రెండవ సంపుటి:

౧–వ భాగము–అనంతచైతన్యము–అజ్ఞానము.

౨–వ భాగము–అజ్ఞానము అధ్యాత్మిక పరిణామము

అధ్యాయములు: ౧-వ భాగము ౧ అవిదితములు-విశ్వవిదితములు. అవ్యక్తములు ౨ బ్రహ్మ-పురుష ఈశ్వర-మాయ, ప్రకృతి, శక్తి ౩ నిత్యుడు - వ్యక్తి ౪ సుర - అసుర ౫ విశ్వాత్మక మాయ; మనస్సు; స్వప్నము; భ్రమ ౬ సత్యము - విశ్వాత్మకమాయ - ౭ జ్ఞానము, అజ్ఞానము ౮ స్మృతి, ఆత్మచేతన అజ్ఞానము ౯ స్మృతి, అహం

ము, ఆత్మానుభవము ౧౦ తాదాత్మ్యజ్ఞానము, విభిన్నజ్ఞానము ౧౧ అజ్ఞానపరిణతులు ౧౨ అజ్ఞానోత్పత్తిక్రమము ౧౩ చిచ్ఛక్తి ప్రత్యేకధారణయే అజ్ఞానము ౧౪ అనృతము, పొరబాటు, తప్పిదము పాపము వీనిఉత్పత్తిక్రమము నివారణవిధానము.

రెండవ భాగము : ౧౫ సత్యము-పూర్ణజ్ఞానము ౧౬ పూర్ణజ్ఞానము-జీవనలక్ష్యము-సృష్టినిగూర్చిన నాల్గుతీరులు ౧౭ జ్ఞానాభివృద్ధి-దైవము, మనుజుడు-ప్రకృతి ౧౮ పరిణామవిధానము ౧౯ సప్తఅజ్ఞానములనుండి సప్తజ్ఞానములవైపుకు ౨౦ పునర్జన్మతత్త్వము ౨౧ లోకముల సరణి ౨౨ పునర్జన్మ - ఇతరలోకములు - కర్మ, ఆత్మ, అమృతత్వము - ౨౩ మానవుడు పరిణామము ౨౪ ఆధ్యాత్మిక పురుషపరిణామము ౨౫ త్రివిధ పరివర్తనము ౨౬ విజ్ఞానారోహణము ౨౭ విజ్ఞానమయపురుషుడు ౨౮ దివ్యజీవనము.

**౨. వేదరహస్యము** ఆర్య మాసపత్రికలో పుస్తకరూపమున
౧౯౧౪-౧౬ ప్రచురిత ముద్రణకాలేదు.
వ్యాసములు.

అధ్యాయములు : ౧ సమస్య - సమాధానము ౨ వేదమునుగూర్చిన విమర్శల పునఃపరిశీలనము...పండితులచే. ౩ ......నవీన విద్వాంసులచే ౪ చైత్యాత్మిక విధాన పునాదులు ౫ వేదమంలి శబ్దశాస్త్రవైఖరి ౬ అగ్ని-సత్యము ౭ వరుణ, మిత్ర - సత్యము ౮ అశ్వినులు - ఇంద్రుడు, విశ్వేదేవతలు ౯ సరస్వతి - సహచరులు ౧౦ సాగర - వాహినుల సాంకేతము ౧౧ సప్తవాహినులు ౧౨ ఉషాగణములు ౧౩ ఉషస్సు - సత్యము ౧౪ పోయినసూర్యుడు పోయినగోవులు ౧౫ అంగీరస ఋషులు ౧౬ సప్త శిరోచింత

నము స్వర్గము, దశగ్వులు ౧౭ మానవపితరులు ౧౮ పితృవిజయము ౧౯ స్వర్గశ్వానము ౨౦ అంధకార తనయులు ౨౧ దస్యులపై విజయము ౨౨ సిద్ధాంత సంగ్రహము.

3. పరిశీలిత సూక్తములు 'ఆర్య' మాసపత్రికలో ౧౯౧౪ - ౧౯౧౬లో ప్రచురిత వ్యాసములు. పుస్తకరూపములో ముద్రణ కాలేదు.

అధ్యాయములు: ౧ ఇంద్రాగస్త్య సంవాదము ఋ. మం. ౧ సూ ౧౭౦. ౨ ఇంద్రుడు తేజోదాత ఋ. మం ౧సూ ౪. 3 ఇంద్రుడు చింతనాశక్తులు ఋ. మం ౧సూ ౧౭౧. (౪) అగ్ని-ప్రజ్వలితేచ్ఛ ఋ. మం.౧సూ ౭౭. ౫ సూర్యసావిత్రి, సృష్టికర్త, పోషకుడు ఋ. మం. ౫సూ౮౧. ౬. ఉష - దివ్య సంధ్యారాగము ఋ మం 3సూ ౬౧ (౭) భగసావిత్రి ఆనందానుభూతిపరుడు ఋ మం ౫సూ౮౨ (౮) వాయువు - ప్రాణశక్త్యధినేత ఋ-మం ౪-౪౮ (౯) బృహస్పతి-ఆత్మశక్తి ఋ-మం ౪సూ ౫౦ (౧౦) అశ్వినులు-ఆనందప్రణేతులు ఋ-మం ౪ సూ౪ ౫ (౧౧) రిభులు-అమృతత్వకృషీకరలు ఋ-మం ౧సూ౨౦ (౧౨) విష్ణు-సర్వవ్యాప్తదైవము ఋ-మం ౧సూ ౧౫౪ (౧3) సోమము-ఆనందామృతాధినేత ఋ-మం ౯సూ౮3.

౪. అగ్నిసూక్తానువాదము ఋగ్వేదము ౧-౮, ౧౦ మండలములు ౬౦౭ పేజీలు. శ్రీ అరవిందాశ్రం పుదుచ్చేరి. ౧౯౫౨

**౫. అత్రేయ సూక్తానువాదము** 'ఆర్య'మాస పత్రికలో ముద్రణము కాలేదు.
౧౯౧౫-౧౬లో
రచిత వ్యాసములు.

౧ ఉపోద్ఘాతము ౨ రహస్యవేత్తల సిద్ధాంతము ౩ అగ్ని-దివ్య ఇచ్ఛాశక్తి ౪ తేజోరక్షకులు ౫ సూర్యుడు-తేజస్సు-ద్రష్ట- ౬ దివ్యఉషస్సు ౭ పూషనుడు-పోషించువాడు ౮ సావిత్రి సృష్టికర్త ౯ నలుగురు రాజులు ౧౦ వరుణుడు ౧౧ మిత్రుడు ౧౨ ఆర్యమనుడు ౧౩ భగుడు ౧౪ మైత్రావరుణ సూక్తములు ౧౫ వరుణ సూక్తములు ౧౬ ఉషస్సూక్తములు ౧౭ సావిత్రిసూక్తములు.

**౬. ఈశావాశ్యోపనిషత్తు** మూలము వ్యాఖ్య ౧౫౨ పేజీలు శ్రీఅరవిందాశ్రం పుదుచ్చేరి.
౧౯౧౪-౧౫

**౭. కేనోపనిషత్తు** మూలము వ్యాఖ్య పేజీలు ౧౨౫ ,,
౧౯౧౫-౧౬

**౮. తైత్తిరీయము** మూలము వ్యాఖ్య పూర్తి కాలేదు. 'ఆర్య' ౧౮-౧౯-లో రచిత వ్యాసము.

**౯. గీతావ్యాసములు** మొదటిభాగము ౩౦౮ పేజీలు శ్రీఅరవింద
రెండవ భాగము ౩౯౦ ,, ఆశ్రమం,
౧౯౧౬-౧౮ ,౧౯౧౮-౨౦. పుదుచ్చేరి.

విషయసూచిక : మొదటిభాగము.

గీతాశయము ; గురువు - శిష్యుడు సిద్ధాంతము - ౧-౨-౩; కురుక్షేత్రము; మానవుని జీవనసమరము; ఆర్యయోధుని

కర్తృత్వము; సాంఖ్యము-యోగము; సాంఖ్య - యోగ - వేదాంతము; ప్రజ్ఞాపూరిత యిచ్ఛాయోగము; కర్మలు యజ్ఞము ౧-౨; యజ్ఞము యజ్ఞేశ్వరుడు; దివ్యకర్మసూత్రము; దివ్యజన్మ దివ్యకర్మలు-౧-౨-3 దివ్యకర్మపరాయణుడు; సమత్వము; జ్ఞానము-సమత్వము; ప్రకృతి విధానము ; గుణాతీతస్థితి ; నిర్వాణము-జగత్కార్మలు; కర్మయోగ సారము.

విషయసూచిక ; ౨-వ భాగము

ప్రకృతి ద్వయము ; భక్తిజ్ఞాన సమన్వయము ; పరాత్పరుడు; ఉత్తమరహస్యము ; దివ్యసత్యము-మార్గము ; కర్మ భక్తిజ్ఞానములు; గీతా పరమవచనము; సృష్టి, శక్తి, దైవము; విభూతిక్రమము; విశ్వ రూప సందర్శనము ; మార్గము - భక్తి ; క్షేత్రము - క్షేత్రజ్ఞుడు; గుణాతీతము, త్రిపురుషులు; ఆధ్యాత్మిక కర్మపూర్ణత - గుణములు, మనస్సు, కర్మ; స్వభావము-స్వధర్మము ; పరమరహస్యము-౧-౨, గీతాసందేశము-౧-౨.

**౧౦. యోగ సమన్వయము** 'ఆర్య' మాసపత్రికలో మొదటి ౧౯౧౪-౧౯౨౧న భాగము, ప్రచురిత వ్యాసములు. దివ్యకర్మ యోగము మాత్రము ముద్రితము.
శ్రీ అరవిందాశ్రమం,
పుదుచ్చేరి. ౧౯౪౭.
౨౬౮ పేజీలు.

ఉపోద్ఘాతము : సమన్వయ సూత్రములు. జీవనయోగము; ప్రకృతి త్రిస్థానములు; త్రివిధ జీవన ; యోగవిధానము ; విధాన సమన్వయము......అచ్చుకాలేదు.

దివ్యకర్మయోగము - సాధనచతుష్టయము ; ఆత్మసమర్పణము; కర్మలందు ఆత్మసమర్పణము; యజ్ఞము, త్రిమార్గము; త్రివిధార్పణము; కర్మవిధానము; పరేచ్ఛ; త్యాగపూర్ణత; త్రిగుణములు; యజ్ఞేశ్వరుడు; యజ్ఞము.

౨ దివ్యజ్ఞానయోగము—జ్ఞానోద్దేశము ; జ్ఞానస్థితి ; విశుద్ధబుద్ధి; ధారణ ; త్యాగము ; జ్ఞానశిక్షణ సమన్వయము ; శరీరబంధ విమోచనము; హృన్మనో విమోచనము; విశ్వాత్మానుభవము ; ఆత్మస్థితులు ; సచ్చిదానందానుభూతి ; మనోమయ పురుషుని కష్టములు ; క్షరాక్షర బ్రహ్మము ; విశ్వచేతన ; ఏకత్వము ; ఆత్మప్రకృతి ; ఆత్మముక్తి ; సృష్టిస్థలోకములు ; అవర త్రిపురుషులు; ఆదర్శతక్రమణ సోపానము; విజ్ఞానము; విజ్ఞాననియమములు; విజ్ఞానము; ఆనందము; పరాపరజ్ఞానము; సమాధి.

(3) దివ్య హఠయోగము.

(౪) దివ్య రాజయోగము.

(౫) దివ్య భక్తియోగము—త్రిమార్గము; భక్తిహేతువులు; దేవుని పరమగు రసావేశము ; భక్తిమార్గము ; దివ్యపురుషత్వము ; దివ్యానందము; ఆనంద బ్రహ్మము; ప్రేమరహస్యము.

(౬) ఆత్మసంసిద్ధియోగము—పూర్ణయోగ సూత్రము ; పూర్ణసిద్ధి; ఆత్మసంసిద్ధితత్త్వము; మనోమయపురుష సిద్ధి ; ఆత్మోపకరణములు; అవరమనోసిద్ధి; జ్ఞానేచ్ఛాసిద్ధి; ఆత్మ విమోచనము; ప్రకృతి విముక్తత ; సిద్ధి - సమత్వసిద్ధి ; సమత్వ విధానము ; సమత్వప్రవర్తనము; ఉపకరణ సామర్థ్యము; ఆత్మశక్తి; చతుర్విధపురుషుడు; దివ్యశక్తి: దివ్యశక్తిప్రవర్తనము ; భక్తి - శక్తి ; విజ్ఞానస్వభావము ; స్వతః స్ఫురణమనస్సు; విజ్ఞానాంతస్థులు; విజ్ఞానమయ-చింతనము-జ్ఞానము;

## శ్రీ అరవింద విరచిత గ్రంథములు

విజ్ఞానోపకరణములు - చింతనాక్రమము ; విజ్ఞానేంద్రియములు; విజ్ఞానమయకాలదృష్టి .........ఇంకాపూర్తికాలేదు.

**౧౧. విజ్ఞానావతరణము** శరీరవ్యాయామ శిక్షణ. త్రైమాసపత్రికలో ప్రచురిత వ్యాసములు. ౧౯౪౯ - ౫౦. — శ్రీ అరవింద ఆశ్రమం, పుదుచ్చేరి. ౧౯౫౨ ౧౨౯ పేజీలు.

**౧౨. మానవ యుగములు.** 'అగ్య' మాసపత్రికలో ౧౯౧౬ - ౧౮ యందు సాంఘికాభివృద్ధితత్త్వమను శీర్షిక క్రింద ప్రచురిత వ్యాసములు. — శ్రీ అరవింద ఆశ్రమం, పుదుచ్చేరి. ౧౯౪౯ 33౪ పేజీలు.

**౧3. మానవైక్యతాశయము** 'ఆర్య' మాసషత్రికలో ౧౯౧౫-౧౮ల యందు ప్రచురిత వ్యాసములు — శ్రీ అవింద ఆశ్రమం పుదుచ్చేరి. ౧౯౪౯ 3౮౦ పేజీలు.

**౧౪. హిరాక్లిటను** ,, ౧౬-౧౭; ౬౧"

**౧౫. భవిష్యత్కవిత** ,, ౧౭-౨౦ పుస్తకరూపము ముద్రణ కాలేదు.

విషయసూచిక :-

ఉపోద్ఘాతము ; కవితాసారము ; లయచలనగతి ; పాకము—

సత్త; కవిత్వదృష్టి — మంత్రము; కవిత్వ జాతీయపరిణామము; ఆంగ్లకవిత్వస్వభావము (౧) (౨); ఆంగ్ల కవిత్వవాహిని; నవీన భాషాసరణి; ఉపకాల్పల కవులు; విక్టోరియాకవులు; ఇప్పటి ఆంగ్లకవిత్వము ౧, ౨, ౩, ౪; నూతనజన్మయా లేక వార్ధికతయా; కవిత్వఆదర్శభావము; కవిత్వసత్యసూర్యుడు; మహాజ్జీవన-ప్రాణము; కవిత్వానందము - సౌందర్యము - ఆత్మశక్తి; ఆత్మస్వరూపము; వాక్కు - ఆత్మ; సమాప్తి.

౧౬. పునర్జన్మ:కర్మ 'ఆర్య'మాసపత్రికలో ౧౯౧౫-౨౧ ప్రచురిత వ్యాసములు. ౧౯౫౨ శ్రీఅరవిందాశ్రం పుదుచ్చేరి. ౮౪

౧౭. * బంకిం - తిలక్ - దయానంద.

౧౮. * కాళిదాసు. ౪౦ పేజీలు. ౧౯౫౦.

౧౯. * చింతనలు ఉపద్రర్శనములు ౪౧ ,, ౧౯౪౧.
౧౯౧౭-౧౮

౨౦. అచేతనము, పదార్థ వాదము, పరిణామము. ,, ,,
౧౯౧౭-౧౬ ౧౯ పేజీలు

౨౧. ఇండియా నాగరికత మైనదా? ఇండియను సాంస్కృతి పరిశీలనము; ఇండియన్ 'ఆర్య' మాసపత్రికలో ౧౯౧౮ నుండి ౧౯౨౧ వఱకు ప్రచురిత వ్యాసములు. శ్రీఅరవింద ఆశ్రమం,
౧. ఇండియా పునరుద్ధరణము.